# శరభరాజీయము

(ద్వితీయ ముద్రణము)

---

తుల్లూరి శరభరాజ ప్రణీతము

---

ప్రకాశకులు

వేటూరి శంకర శాస్త్రి,

ఆన్ధ్ర రసాయనశాల, ముక్త్యాల.

1928

# నివేదనము

తెలుగుదేశపు వైద్యవాఙ్మయమునందు, స్వతంత్రముగ రచియింపబడిన వైద్యగ్రంథములు చాలతక్కువగనున్నవి. ఇంతవరకు ప్రకటింపబడిన తెలుగువైద్యగ్రంథములైనను, సంస్కృత వైద్య గ్రంథములకు సమగ్రములగు తెలుగుచేతలుగావు. సంస్కృత వైద్య గ్రంథములలోని కొన్నికొన్ని భాగములు మాత్రమే తెలిగింపబడి యున్నవి. కొన్నిభాగములకు తెనుగున లఘు టీకాతాత్పర్యము లున్నవిగాని అవియు విపులవివరణముల నపేక్షించుచున్నవి. మఱికొన్ని భాగము లింతవరకును తెనుగున కనువదింపబడనేలేదు. త్రిదోషసిద్ధాంతము,పంచలక్షణనిదానము,శారీరము,శస్త్రచికిత్స, అగదతంత్రము,చికిత్సాప్రణాళి, ఇత్యాదివిషయములగూర్చి శాస్త్రసమ్మతముగ సర్వవిషయముల దెలుపు వైద్యగ్రంథములు తెలుగున లేకుండుట విచారింపవలసినవిషయము.

ఆంధ్రదేశవైద్య సాంప్రదాయమును, ప్రత్యేకతను తెలుపు ప్రాచీనవైద్యగ్రంథములు అముద్రితములు చాల గలవు. అవియు నింతవరకు ముద్రణమునకెక్కక చూచువారులేక, చివికి జీర్ణించి పోవుచున్నవి. అట్టివానిలో కొన్నిటినైనను ప్రకటింప దలంపుతో, తొలుత నీశరభరాజీయమను తెలుగువైద్య గ్రంథమును ఆంధ్రవైద్య లోకమునకు సమర్పించుకొనుచున్నాము. ఈ గ్రంథమునకిది ద్వితీయ ముద్రణము. ప్రథమముద్రణపు బ్రతులు చెల్లిపోయినందునను, అనేకులు అనుదినము దీనినిగూర్చి హెచ్చరించుటచేతను, తిరిగీ

ముద్రించి ప్రకటించినాము. దీనిరచయిత శైవుడును తుళ్లూరుగ్రామ నివాసియునగు శరభరాజ భిషగ్వరుడు ఇంటిపేరు తుమ్మూరువారు. తండ్రి వీరన. తల్లి బాపమ. ఈతడు కేవల వైద్యుడేగాక, కవీశ్వరుడని కూడ నీగ్రంథములోని వంశాభివర్ణనమునుబట్టి తెలియుచున్నది. శృంగార సుధార్ణవము, ప్రజ్ఞావతీ రాయబారము మొదలైన అయిదుగ్రంథములను. అనేకశతకములను రచియించినట్లు కవియే చెప్పి-నియున్నాడు. ఈతనికాలమునుగూర్చి వివరములేమియు తెలియ లేదు. ప్రాచీనుడుమాత్రముకాడు.

ఈతడు గ్రంథము పూర్తికాకముందే శివపదము జేరుటచేత సీతనికుమారుడు, మాధవరాయడు, గ్రంథమును పూర్తిచేసినట్లు 161 పుటనుగల పద్యములనుబట్టి తెలియుచున్నది.

ఈగ్రంథమున అష్టస్థానపరీక్ష, పరిభాష, రసాదులకు శుద్ధులు, రోగనిదాన లక్షణాదులు, చికిత్సలు మొదలైన విషయములను సులభ శైలిని కొంతవరకు విపులముగనే వివరించియున్నాడు. చాలచోట్ల బసవరాజీయ గ్రంథభాగములను అట్లే తెలిగించినట్లు గుర్తింపవచ్చును. ఈవిషయము గ్రంథము నామూలాగ్రముగా విమర్శతో చదివిన వారు గుర్తింపగలరు. మరికొన్నిచోట్ల స్వతంత్రములగు రచనలు స్వానుభూతయోగములు కనుపట్టుచున్నవి. అందును సుఖవ్యాధులనుగూర్చి కడపటి ప్రకరణములందు గ్రంథకర్త కొన్ని చక్కని యోగములనిచ్చి ఆయారోగవిషయముల చక్కగ సాంప్రదాయ యుక్తముగ వర్ణించినాడు. ఇట్టితీరు యితర గ్రంథముల యందు గానరాదు. ఆంధ్రదేశ సాంప్రదాయమున కనుగుణములగు సులభ

యోగములు చాలగలవు కాని గ్రంథముకొన్నిచోట్ల లక్షణవిరుద్ధమై తప్పులు గలిగియున్నది. దిద్దబూనినచో విషయము చెడునన్నభయముతో యెక్కువగ మార్పులుచేయలేము. గాన ఛాందసులకు తప్పులు దోపవచ్చును. వైద్యము విషయప్రధానముగదా!! గ్రంథము అసమగ్రముగా గన్పట్టుచున్నది. చతుర్థాధ్యాయము సగములోనే హఠాత్తుగ ముగియుచున్నది. గద్యాదికములులేవు. ఇంతవరకే మాకులభించుటచేత ప్రస్తుతము అంతటితోనే ముగించినాము. గ్రంథము సంపూర్ణముగా లభించినచో తృతీయముద్రణమున ప్రకటింపగల్గుదుము.

తెలుగుదేశపు వైద్య సాంప్రదాయమును విస్పష్టముగా దెలుపు అనేకములగు తెలుగువైద్యగ్రంథములు, ఉద్ధరించువారులేక జీర్ణించుచున్నవని మనవిచేసి యుంటిమిగదా! అట్టివానినెల్ల ముద్రించి ప్రకటించినచో, ఆంధ్రవైద్య సాంప్రదాయము తనసహజస్వరూపమును చూపగల్గునను తలంపుతో, వానినెల్ల దొరకినంతవరకు సేకరించి క్రమక్రమముగా ముద్రించి ప్రకటింపదలపెట్టినాము. యథాశక్తి వైద్యలోకమును సేవింపదలచినాము. అందుకు ఆయుర్వేదాభిమానులును ఉదారస్వభావులును, సత్వగుణ సంపన్నులును అగు మాప్రభువులు శ్రీ శ్రీ రాజావాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరుగారు, తమ సహజౌదార్యముతో సర్వవిధముల నీసదుద్యమమునకు తోడ్పడి,ప్రోత్సాహ మొసగుచున్నారని తెలుపుటకు సంతసించుచున్నాము. శ్రీవారికి శ్రీధన్వంతరి ఆయురారోగ్య భాగ్యములనిచ్చి సర్వవిధముల శ్రేయముల నొడగూర్చుగాక!

ఆంధ్రదేశీయులెల్లరును, మాయుద్యమమునకు తోడ్పడి అభిమానాదరములజూపి, ఇంకను యిట్టివైద్యగ్రంథముల ప్రకటింపదగు ప్రోత్సాహమొసంగ గోరుచున్నాను.

ముక్త్యాల
12-9-28 }

వేటూరి శంకరశాస్త్రి,
సంపాదకుడు.

# విషయసూచిక.

శ్రీ

వాయుపుత్రాయనమః

# శ ర భ రా జీ య ము.

---

ఉ. శ్రీకరమైన మద్ధృదయ సీమ నొకప్పుడుఁ బాయకుండి వి
ద్యాకవితావిభూతు లశయంబును నిచ్చి కృతార్థుఁ జేయు నా
శ్రీకభవాచ్యుతాది సురలీలల కల్పన మాటిమాటికిన్
జేకొను శంభుపాద సరసీజము లేను నుతింతు వేడుకన్.

క. కాళికిఁ దోషీకృతకంకాళికిఁ
గవిసంఘహృదయ కంజాత లస
ద్ధ్వాళికి నిజగతివిజిత మ
రాళికి నతి సేతుఁ గావ్య రచనోత్సుకతన్

చ. వినతు లొనర్పఁగా దెసల వేణునినాదము నిండ యామునీ
వనతటి రాసబంధమున వాంఛలు దీరఁగ గోపకాంతలన్
మనసిజకేళిఁ గూడి రస మగ్నలఁ జేసినకృష్ణమూర్తి నా
మనమున నిల్చి యాకృతి సమగ్రముగాఁ దుదముట్టఁ జేయుతన్.

క. ఇందిరకుఁ బంకసంభవ
మందిర కరుణాంశుతుల్య మానితలాస్యా
చందిరకు వేణికాంతిం
దిందిర కంజలి యొనర్తు ధీరత మెఱయన్.

ఉ. ధాతకు సజ్జనౌఘశుభ దాతకు భక్తనిమగ్న దీనవా
క్ప్రోతకుఁ బాపజేతకును సూరిగణస్తవనీయపాదకం
జాతకు లోకపూరిత యశఃప్రమదాలసమానరోచికా
వ్రాతకు మ్రొక్కెదన్ మృదుల వాక్యచణారచనార్థినై వెసన్.

క. వేణీజితమత్తాళి
శ్రేణికి రాగపరిచాగ చిత్రవిపంచీ

పాణికి శతధృతిరాణికి
వాణికి వందనముఁ జేతు వాక్సిద్ధి కొఱకు.

శా. గీర్వాణాంధ్రమయప్రబంధకవితాంగీకార వాఙ్మాధురీ
సర్వజ్ఞప్రతిపాద్యమానవినతుల్ స్వాంతంబులో నెంచు శ్రీ
పార్వత్యగ్రతనూజు నాత్మను దలంపంగా దయాస్ఫూర్తితో
నిర్విఘ్నంబులు సేయుఁ గావ్యమునఁ బ్రాజ్ఞితు ల్విజృంభించుచున్.

గీ. కాళిదాసాది సంస్కృతకవుల నన్న
పార్యుఁ దిక్కన శంభుదాసాది వికృతి
కవుల నభివర్ణనముఁ జేసి కావ్యమొకటి
చెప్పఁగాఁబూనితిని మదికొప్పిదముగ.

ఉ. నీరము మాని పాలఁ గొను నీడజరాజముమాడ్కిఁ సత్కవుల్
నేరములెన్నకన్ రసము నేర్పునఁ దీయఁగఁ గాకవుల్ సక
ర్పూరసుగంధముఖ్యముల పొంతలఁ జేరిచి యేవ్యా మానఁగాఁ
గోరినయాఁగరీతిఁ గృతి కోటుల శంకలఁ జేతు రిద్ధరన్.

సీ. కావ్యనాటకముల గఱపె నడింపల్లి
మంగళాద్రి సమాఖ్యమంత్రివరుఁడు
వికృతిశాస్త్రార్థప్రవీణుసిఁ గావించె
రావూరిసంజీవ రసికమౌళి
జ్యోతిషమార్గంబుఁ జూపెఁ బురాణము
వంశజపొంటు దైవజ్ఞమూర్తి
మంత్రకోవిదుఁ జేసె మన్నించి శ్రీముది
గొండబుచ్చయ్యాహ్వగురువరుండు

గీ. దివ్యమామక విద్యోపదేశిదేశి,
కేంద్రుల నుతించి నతిఁజేసి హృదయసీమ
వారి పదపద్మములునిల్పి వన్నెకెక్కఁ
గృతియొకటి చెప్పబూనగా మతిదలంచి.

గీ. నన్నుమంత్రజ్ఞుఁజేసిన నయవిదుండు
ఘనుఁడు ముదిగొండబుచ్చయ్య గారికూర్మి

ప్రాణలింగాభి రతి నందఁ బఱచె నట్టి
మోక్షగురురాయ పదకంజ ములకు మ్రొక్కి.

క. హితవుగ నీకృతిఁ జేతువు
గృతినాథుం డెవరొ యనుచుఁ గేవలనిస్తా
న్వితుఁడనయి యుండి మానుక
మతిలోఁ దలపోయ నాసమయమునఁ గూర్మిన్.

సీ. తనమేను రుచి మేరు ధరణీధరము మాడ్కి
దివ్యలావణ్యంబు దెసలనింపఁ
దనదీర్ఘవాలంబు దైవేశముఖ దేవ
పరిపంథులకుఁ గాలపాశమనఁగఁ
దనమైత్రి రామభూధవునకు వెలలేక
కరమొప్పు క్రొంగ్రొత్తబంగారమనఁగఁ
దనకృపాదృష్టి భక్తచకోరతతుల కు
త్సవమొనర్చును జంద్ర చంద్రికయన

గీ. వెలయు సచరాచరాత్మ సేవితపదుండు
కొమిరపూడి నిశాంత విక్రమవిరాజ
మానుఁ డంజనిసుతుఁ డభిమానశాలి
స్వప్నమున నాకుఁ గృపనుసాక్షాత్కరించె.

గీ. కరము ప్రత్యక్షమయ్యు ముందరను నిల్చి
మృదులహస్తము సాఁచి నామేనునివిరి
శరభరాజాహ్వ యని పిల్చి సరభసమునఁ
బటుదయార్ద్రత నిట్లని పలికెనతఁడు.

సీ. శయ్యాచమత్కార సరసతగూర్చితి
వవని శృంగారసుధార్ణవంబు
పాకభేదముల నేర్పడబల్కితివి నుతి
సేయు ప్రజ్ఞావతీరాయబార
మవలీల రచియించి తౌనన లవలీవి
వాహంబు కవిరాజ వర్ణితముగ

సరసులుప్పొంగగాఁ సమకూర్చలేదె భా
గవతాభ్యుదయమను కావ్యమొకటి

గీ. పల్కితివి వేడ్కఁ గాళిందిపరిణయంబు
పార్వతీనాథ విష్ణులఁ బ్రస్తుతించి
శతకము లెన్నొ కూర్చితి శరభరాజ
యెన్న సామాన్యకవివె వివేకశాలి.

క. ఇత్తఱి నొకకృతిఁ జెప్పఁగఁ
జిత్తంబునఁ దల్చి తెఱఁగి చిరతరకరుణా
యత్తంబున నీకల నీ
పొత్తము గొనివచ్చినాఁడఁ బుణ్యవిచారా.

సీ. కార్మణ భేషజకల్ప బాహటాది
వైద్యశాస్త్రములో గీర్వాణభాష
నార్యులువచియించి రందలియర్ధంబు
ప్రాకృతులకు బోధపడదుగాన
పద్యంబులు తెనుంగు బాసనేర్పరచిన
సకలజనులకు మోదకరమొసఁగు
సర్వవైద్యగ్రంథ సారంబుదీసి త
త్కావ్యంబులోనుంచి శ్రావ్యముగను

గీ. శరభరాజీయమనుపేర శాస్త్రమొకటి
కల్పనముఁజేసి మత్కృతిగాఁగ దలఁచి
నొసఁగు శుభములు నీకగు నుర్విలోన
సాధుసంతాన శరభరాజప్రధాన,

వ. అని యొఱంగించి.

గీ. తనువు నివ్వరుచు దనప్రసాదంబు లొసఁగి
మగుడ నంతర్హితుండయ్యె మారుతాత్మ
జుండు, నంతట మేల్కాంచి సూరిజనుల
కేను స్వప్నప్రకారంబు నెల్లఁ దెలుప,

చ. విని సుజనుల్లనుం గని వివేకవిచార కృతిం బెచింపఁ జా
వన మగు సర్వసమ్మతము వైద్యవిచారముగాన ధర్మసం
ఖ్యానయఫలంబు లొందగల వందుకు సందియమేల సత్కృతం
బునఁ గదళీఫలామృతము పోలికఁబొత్తముఁ జేయుమేర్పడన్

క. అనవిని శ్రద్ధలవాక్యము
లును మారుతిసూతిపల్కులును నేకంబై
కనుపట్టె నేలసందియ
మని తత్కావ్యంబుసేతు నని నిశ్చయతన్.

వ. మద్వంశావతారం బభివర్ణించెద.

సీ. శ్రీమదష్టాంగ ప్రసిద్ధయోగాభ్యాసి
ధర నోరుగంటి సత్పురనివాసి
ప్రాణలింగార్చిత భావసంచయపాళి
యజ్ఞానతిమిర సంహారహేళి
బుధజనసన్మిత్ర పోష్యదయాశాలి
శోభితాశాంత యశోవిశాలి
యమరాశ్రీవత్ససం యమిగోత్రపావని
వర్ణితసకల విద్వన్నిధాని.

గీ. సంతతోల్లాసి దినవాధసమవిభాసి
రహితదుష్కర్మ నిత్యస న్మహితధర్మి
యనగనుతికెక్కె శివదేవు డనెడుయోగి
నాయకుండు సదామోక్ష దాయకుండు.

ఉ. అతఁడుప్రతాపరుద్ర వసుధాధిపుచేత నవాగ్రహారముల్
హితమతి నంది నిత్యసచివేశ్వరసంతతి కెల్లమేటియై
యతులితసంస్కృతాంధ్రకవి తావలికెల్లఁబితామహుండనన్
సతతమువన్నె కెక్కె బుధసంఘములోన మహాప్రసిద్ధుఁడై. 24

క. ఆవిభువంశంబునఁ గుల
పావనుఁడై పుట్టె సర్వపార్యుఁడు బుధసం

సేవితుఁడై నుతికెక్కెను
భావజసంహారునికృపను బ్రభువులసభలన్

క. ఆరసికామాత్యుడు తు
ఘ్లూరుమిరాసిగను గొనుట నుర్వీస్థలిఁ దు
ఘ్లూరువారంచు గొందఱు
సూరులనిరి నాఁటనుండి శుభమిగురింపన్.

క. అతనికి ముపురుకుమారులు
మతిమంతులు వీరనయును మాధవుడును శ్రీ
యుతుఁడబ్బరాజుసచివుడు
సతతము చెలువొందిరతుల సద్గుణయుతులై.

సీ. మాన్యుడగుచును సకలరాజన్యసభల
దారకేశపటీర నీహారతార
శారదాభసుకీర్తి విశారదుండు
అబ్బనామాత్యుఁ డన్మాత్రుఁ డనగనగునె.

ఉ. అట్టిగుణాతిసాంద్రమతి కాత్మజు లంతక వైరిసత్కృపన్
బుట్టిరి మువ్వు రందు ఘనపుణ్యుఁడు సర్వనమంత్రి నీటిరా
పట్టికి నెక్కుడౌకళల భాసిలుచుండును నబ్బరాజు వా
గిట్టగురామనార్యుడును ధీరత నొప్పుచునుండు రెప్పుడున్.

సీ. తనకీర్తి సకలభూతలమెల్లనిండి చూ
పరులకుఁ జంద్రికాస్ఫురణ దనరఁ
దనదానగరిమచేతను దిగంతంబుల
జనులెల్ల నైశ్వర్యఘనులు గాఁగఁ
దన చక్కదనము శ్రీతనయునిమీఱి స
ద్భామినీమణుల విభ్రాంతిగొలుప
తనదు వాచాప్రౌఢి ఘనుని శేషునిదాటి
నరులకు నామోదకరముగాఁగఁ

గీ. దన కటాక్షావలోకనంబునను మిత్ర
వంది మాగధ గాయకావళులఁ బెంప

నతని కాతఁడెసాటిగా కితరులెవ్వ
రనఁగ నుతికెక్కె నబ్బరాజాహ్వయుండు.

గీ. భవ్యుఁడాతనికాంత సంపన్నిశాంత
ఘనత పొత్తూరి శరభరాడ్గర్భశుక్తి
జనితముక్తాఫలంబన జగతిఁబరఁగె
నవనిజా తుల్య సాధ్వి బుచ్చమ్మయనఁగ.

సీ. స్థిరవృత్తిసరియౌనె సరసిజాక్షునికాంత
తనబుద్ధి చంచలత్వమువహింప
మానుషత్వమున సమానమే శారద
పదుగురినోళ్ళలోఁ బడినకతన
పతిసహవాసతఁ బ్రతియె సౌజ్ఞాదేవి
తననాధువిడిఁడాఁగె జనకునింట
బరిచర్యసేయనేర్పరి యౌనె చండిక
సగబాలుగానియెను మగనిలోనఁ

గీ. నని రమా వాణి సౌజ్ఞాంబి కాది సతుల
గారవంబెన్ని నిజనాధుగారవమున
ఘనతకెక్కెనుఁ బతిభక్తికలితయైన
ఘనసుగుణపేటి బుచ్చాంబికావధూటి.

క. ఆదంపతులిద్దఱు నతి
మోదంబున గనిరి సచివముఖ్యులఁ గరుణా
స్వాధితబంధుపరితతుల
నైదుగురిన్ రక్తిబెద్దతానని పొగడగన్.

ఉ. సూరిని వీరనార్యుఁ బరిశుద్ధునిఁ బాపనపద్మరాజులన్
గారవవృత్తి బాపనను గణ్యుని బుచ్చనమంత్రివర్యు మం
దారపటీరహీరవిధు తారహరిప్రతిమానకీర్తి వి
స్ఫారితపద్మజాండుల సుపుణ్యులనెన్నఁ దరంబెయేరికిన్.

క. అందగ్రజుఁ డంగజసమ
సుందరతను డఖిలలోక శోభితయశుఁ డా

నందహృదయారవిందుఁడు
మందరధైర్యుండు వీరమంత్రిగణింపన్.

సీ. శ్రీగురుపాద రాజీవయుగ్మమరంద
పానమానస మత్తబంభరుండు
బాపాంబికానన పంకజ శ్రీముషీ
పావనతర పద్మినీవిభుండు
వరశివదేవ సద్వంశసుధావార్ధి
సంపూర్ణ రాకానిశాకరుండు
ధాత్రీధరారి వేదండదంభోళి భా
సురకీర్తి హారదంత శోభితుఁడు

గీ. బంధుచయమిత్ర సముదాయపాలకుండు
ప్రాణలింగవరధ్యాన పారగుండు
విష్ణుసుతతుల్య సుందరవిగ్రహుండు
వీరనార్యుఁడు సుగుణవిశారదుండు.

వ. అమ్మంత్రివరుండు.

శా. శ్రీమద్భాసుర మంచికంటి కులవార్ధిప్రీతిచంద్రుండు సు
త్రామైశ్వర్యుఁ డనంగకోటిసమ సౌందర్యుండు బ్రహ్మాఖ్యుఁ డ
య్యామాత్యాత్మజ యైన బాపమను బెండ్లాడెం ధరామండలిన్
గామధ్వంసి హిమాచలేంద్రతనయన్ గైకొన్న చందంబునన్.

సీ. ఘనగాత్ర సౌందర్యమునకోడి సుమబాణు
వనజాక్షి యాచెలిననుసరింప
వరభోగభాగ్యము ల్గురుతరంబని శచీ
కాంత యచ్చేడియ చెంతఁ జేరఁ
బతిభక్తి తాత్పర్య మతిశయింప వసిష్ఠ
సతి యవ్వధూమణి హితవు గోర
సద్వాచోరచన కెంచఁగ నగ్గలం బని
వాణి యవ్వనితభావమున నుండ

గీ. ననయ మం(త్రులఁ బూజించుమనని భవాని
మెచ్చి తనరూప మక్కాంత కిచ్చెననఁగ
సర్వమాంగల్య యగుచు భూజనుల కెల్ల
ఖ్యాతిఁ గనుపట్టె బాపాంబికా వధూటి.

గీ. కౌశలముమించు గిరిజామహేశులకును
విఘ్ననాయక షణ్ముఖ వీరభద్ర-
శాస్త్రులుద్భవమందిన జాడ నల్వు
రట్టిదంపతులకుఁ బుట్టి రాత్మభవులు.

గీ. అగ్రజుండ నేను శరభరాజాహ్వయుండఁ
దమ్ముఁ డమ్మయ్య విజ్ఞాన తత్త్వవేది
తదనుజన్ముఁడు బుచ్చయ్య ధన్యమూర్తి
పిన్నతమ్ముని వియ్యన్న నెన్నఁదగుమె.

సీ. కవితావైద్యదైవజ్ఞ గణితశాస్త్రజ్ఞాన
సరసుఁడు శరభరాజ ప్రవరుఁడు
ప్రాణేష్టభావసంభరిత లింగార్చనా
రతియుక్తుఁ డా యమ్మిరాజువిభుని
కలుషజీమూతనిర్వాత సమానుండు
బుచ్చయామాత్య సంపూర్ణయశుఁడు
శాంభవదీనార్తి ఖండితావళిఁ బ్రోవ
నవని వియ్యన్న వియన్నగంబ

గీ. యనుచు జనులెన్న సర్వాంసహాంతరమునఁ
గీర్తి నే మించి సాధుసంవర్తనమున
దేశికారాధనము చేసి తృప్తి గాంచి
ప్రకటవైభవములతోడఁ బ్రబ్బలినాము.

క. ధరముదిగొండ బుచ్చనామదాన్యునిపుత్రిక శాయమాంబ శీ
లరసిక కంటకుక్కల కులప్రభ వాప్పయమంత్రి గాగ్గనో
త్తరుసుత వెంకమాంబయు ముదంబున నన్వరియింపఁ బెండ్లియై
శరభసమాఖ్యుఁగైకొని నిజప్రియకాంతలఁగూడి యుండఁగా

గీ. పెద్దభార్యకుఁ గల్గిరి పేర్మిసుతులు
సర్వపార్యుఁడు నబ్బన సచివవరుఁడు
చిన్నసతియందుఁబుట్టిరి శ్రేష్ఠులైన
సుతులు నల్వురు సద్గుణోన్నతులు కూర్మి.

క. కామసమకోటిలింగము
శ్రీమాధవరావుమంత్రి శివహితసంజీ
వామాత్యుఁడు గిరిధైర్యుఁడు
శ్యామలరాయండనంగ సొంజ్ఞలు మెఱయన్.

గీ. ఇట్టితనయులలోనఁ గనిష్ఠతనయు
నర్థిఁ గబ్బూరిబంగారు కాత్మజునిగ
స్వీకరింప నొసంగితి స్మృతిహితముగ
శ్యామలాహ్వయమున నొప్పు సచివవరుని.

గీ. అబ్బరాజాహ్వయుం డచ్చ మాంబవలనఁ
దనయుఁ గాంచెను గాళిదాసనెడువానిఁ
గోటిలింగము సంగమ్మ కోమలాంగి
వలన సుతుఁ గాంచెఁ బిచ్చయ నలఘుమతిని.

గీ. మాధవార్యుఁడు వెంకమ్మమహితచరిత
వలన నానందరావును గలిత లక్ష్మి
కాంతరావును శివభక్తి గలుగు మేటిఁ
జంద్రధరుఁడను తనయులఁ జగతిఁ గాంచె.

గీ. అవని సంజీవమంత్రి సుబ్బమ్మవలన
విద్యానను నాగభూషణు విపులయశునిఁ
గనియె మద్వంశజులు శైవులనుచు నెల్ల
సుజను లుప్పొంగ గుణముల సొంపు మిగిలి.

క. శ్యామలరాయుఁడు సుతులను
గామాంబికవలనఁ గనియెఁ గమనీయగుణో
ద్దాముఁడగు లక్ష్మణార్యుని
శ్రీమద్బంగారుఘనుని సితకరముఖునిన్.

వ. మదీయానుజుండగు అమ్మిరాజప్రవరుండు.

సీ. గురులింగజంగమోత్కరభక్తియుక్తుల
బరికింప నంగన బసవమూర్తి
లింగార్చనాసక్తిలీనచిత్తంబున
ఘనుఁడగు మద్దిసంగప్రవరుఁడు
చిరయశోదారత శివుని మెప్పింపఁగా
ధీరుఁడౌ కూకుడమూర ఘనుఁడు
పరిపూర్ణవిజ్ఞాన భావతదీపింప
నిరుపమ నందికేశ్వరుఁ డితం డ

గీ. టంచు జనములు వార్నిశ నూడుకొనఁగ
జన్మయానంద సంధాన శివవిలీన
మానసజ్ఞతఁ జెన్నొందె మహిమమీరఁతె
శాంతసుజ్ఞాని యమ్మిరాజప్రధాని.

క. అనయమణి పాపాంబా
మానినితోఁ గూడి కనియె మహిమోన్నతుఁడై
సూనుని వీరామాత్యుని
సానందత మదనుఁ గన్న శౌరియుఁబోలెన్

క. ధారుణి వీరార్యుండు కు
మారులఁగనె నిరువురం గ్రమంబున సుగుణో
దారుల శంకరదాస సు
ధీర విరూపాక్షు లనెడు తేజోమయులన్.

ఉ. మా పితతండ్రి బుచ్చన, కుమారులఁగాంచెను సర్వరాజు సు
ద్విపిత వీరమంత్రిని నుతింపఁగ శక్యమె వారు మాంత్రికా
లాప కళార్ణవజ్ఞులని లక్ష్యము గల్గి మనోనురాగతన్
చూపటు లద్భుతంబుగను చూడరొకో కొనియాడరో ధరన్

క. ధర సర్వరాజపుత్రుఁడు
సిరిపట్టియె లక్ష్మికాంతశేఖరుఁడు గుణో

ఆశ్వాసప్రారంభము.

ఉ. శ్రీతరుణీవరాంఘ్రి సరసీరుహచింతనచే జగంబులం
వాతత శక్తిఁగాంచి లవణాబ్ధిరయంబున దాఁటి లంకలో
సీతను గాంచి రాఘవుల సేమ మెఱుంగఁగఁ జెప్పినట్టి వి
ఖ్యాతునిఁ గ్రమప్రౌఢి హనుమంతునిఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

గ్రంథావతారిక.

సీ. నాడీనిదాన మెన్నఁగ ద్రవ్యశుద్ధులు
భస్మ సిందూరము ల్బహువిధంబు
లైన రసంబులు నఖిలరోగములకు
ఘృత రసాయన లేహ్య తతులు వటిక
చూర్ణ తైలములు సంపూర్ణమౌ నెన్నూట
యేబదియాఱు రోగాహ్వయముల
జనన లక్షణ చికిత్సలు కషాయంబులు
పదిరెండుపద్ధతు ల్కుదురుపఱిచి
గీ. రమణ బాహటసారసంగ్రహము లాది
గా విమర్శించి పద్యము ల్గా నొనర్తు
బుధులు గణుతింపఁ గడుఁ బాలబోధగాను
అవని నాచంద్రతారార్క మగుచు వెలయు.

# [illegible]ధ్యాయము.

## ప్రథమాశ్వాసము.

---

### నాడీపరీక్ష.

గీ. చేతిపెన్వ్రేలిమొదట విఖ్యాతి మీఱ
నాడి యవబీజమాత్రమై మూఁడువ్రేళ్లఁ
వనరుచును శ్లేష్మ పైత్య వాతములు నడచు
విరళమ్ముగ వీటిభేదముల్ విస్తరింతు.

క. ఎడమను బడఁతులకును మఱి
కుడిచేఁగనవలయుఁ బురుషకోటికి నెల్లన్
దడబడకను నిశ్చయమ్ముగఁ
గడువడిఁ బాదద్వయములఁ గరమూలములన్.

### వాతపిత్తశ్లేష్మనాడులు.

గీ. ధరణి వాతంబు వక్రప్రధాన మగుచుఁ
బరఁగు జపలప్రధానమై పైత్య మమరుఁ
డాను సుస్థిరమార్గప్రధానమగుచు
శ్లేష్మ మొప్పును దెలియుఁడీ సిద్ధముగను.

క. వాతము పైత్యము మొదలం
దాతత గతినడచు నడుమ నతివిస్మయమై
చేతనులకు శ్లేష్మము వి
ఖ్యాతిగ నీమూఁడు నడుచు గతిఁ గనవలయున్.

### వాతనాడి

చ. బలుపగు కప్పరీతిఁ బెనుఁబాము తెఱంగున జాల నూఁచు న
య్యలగతి లావుకంబుక్రియ నాపములోపల సంచరించు బ
ల్జలగలఁ బోలి యొప్పుచును జక్కఁగఁ దా నటియించుచుండు నిం
పులు దళుకొత్త వాతగతి భూతెతరంబగు వక్రసంగతిన్..

పైత్యనాడి.

క. అలరంగ నెమలిపింఛము
వలెను మరాళంబువలెను బలు గువ్వవలెన్
దిలకించి నడుచుఁ బైత్యము
సలలితచపలప్రధాన సంగత మగుచున్.

శ్లేష్మనాడి.

క. కోడివలెన్ బిచ్చుకవలె
నాడెపుఁ బావురముభంగి నానాగతులన్
ఆడెడు లకుముకివలెఁ దా
నాడు నిలన్ శ్లేష్మనాడి యతిసుస్థిరమై.

శ్లేష్మపైత్యనాడి.

క. పామువలె నడచి నడచియు
వేమరుఁ బెనుకప్పవలెను వెంబడి నడచున్
భూమిపయి శ్లేష్మపైత్యము
ధీమంతులు దెలియవలయుఁ దెల్లముగాఁగన్.

శ్లేష్మవాతనాడి

క. కోడివలె వేగ నడచియు
నాడి జలూకంబువలెను నడచుచు నొప్పన్
పోడిమగు శ్లేష్మవాయువు
జాడలు గనవలయు వైద్యశాస్త్రజ్ఞులిలన్.

అజీర్ణ సంగమ మలబద్ధకనాడులు.

ఉ. గ్రద్దవలెన్ గళిందుగతి గాఁ జరియించు నజీర్ణనాడి యా
గ్రద్ద కపోతకాకివలె నిల్చిన సంగమనాడి యాఁదలం
జొద్దుల మోసుకొంచుఁ జను మూర్ఖునిమధ్యముఁ తి నొప్పఁచు
దద్దయు హంససంగతిని దా మలబద్ధకనాడి యాడెడిన్.

సన్నిపాతనాడి.

క. వడివడినాడిన మందము
దొడరిన నది సూక్ష్మమైనఁ దుదిఁ గుటిలంబై

కఫుఁజపలమైనఁ దెలియుఁగఁ
బహు జనులకునెల్ల సన్నిపాతం బగుచున్.

స్వప్నలక్షణాలు.

క. వాతం బిఁచుకయుష్ణము
పైత్యము కడు చల్లనైన బలుకాకైనన్
బ్రాతిఁగనుపట్టు శ్లేష్మము
శీతము కొంచెముదనర్చుఁ జెలువుగ మేనన్.
ఒకతఱి శీతం బొకతఱి నుష్ణం
బొకోత్తఱి సమశీతోష్ణములై ప్రకటి
తమగుచును పరిపరిగతులను
బరగిన నదియె త్రిదోష మగున్.

దర్పనపరీక్ష.

క. నలుపగును వాతరోగికిఁ
దెలుపగుఁ గఫరోగికెపుడు దేహం బెఱుపై
బలుపచ్చనైనఁ బైత్యము
దెలియఁగ సన్నికి సమస్త దీప్తులు వెలయున్.

శబ్దపరీక్ష.

క. సమముగఁబల్కిన వాయువు
క్రమమెడలఁగఁబల్కుఁ బైత్యగతితానగు శ్లే
నముగాఁ బల్కిన శ్లేష్మం
బమరును సన్నులకునెన్న నన్నివిధము లౌ.

నేత్రపరీక్ష.

క. నలుపును నెఱుపును గలసియు
జలములుస్రవియించ వాత సంబంధము ని
మ్మల నెఱుపు పసుపువన్నియ
వెలయును పైత్యంబునను వీక్షాయుగముల్
ఆ. పుసులు గాఱి భానుపోలిక నొప్పినఁ
గఫము దనరు, నరుణ కాంత శీత

భ్రాంతిశోషణ్ము సన్నిపాతంబు, నయనము
లాకుపచ్చ నలకుఁ బసుపుకాంతి దనరు.

మలపరీక్ష.

గీ. నరపురీషంబు నీలవర్ణంబు దనర
వాతగుణ మగుఁ, బైత్యంబు పీత మైన
నెఱుపు కొంచెము తెలుపును మఱి కఫంబు
మిశ్రమైనను సన్నిపాతమౌయు నవని.

మూత్రపరీక్ష.

క. వాతశరీరికిఁ బాండుర
మూత్రంబగుఁ బైత్యదేహ మున కరుణం బా
శ్వేతం బగుఁ గఫరోగికి
నాతత నానావిధంబు లగు సన్ని కిలన్.

క. కామినులకుఁ బైత్యమువలె
నౌ మది సన్నులకు నెన్న నన్నివిధములౌ
నీమూత్రశోధనంబుల
ధీమంతులు రోగములను దెలియఁగ వలయున్.

జిహ్వాపరీక్ష.

క. గరగరనై పచ్చనయై
పరఁగిన మారుతగుణంబు పైత్యము నలుపై
యెరుపైనఁ గఫము శీతము
నొరసిన సన్నులకు నన్ని దోఁచును జిహ్వన్.

బహువిధగతినాడికారణము.

సీ. సాపడ్డవారికి స్నానం బొనర్చిన
వారికి సతతోపవాస మున్న
వారికి నిద్దురఁబడి లేచువారికి
నడచినవారికిఁ దొడరి గాలి
సోఁకినవారికి సురఁ బుచ్చుకొన్నవా
రల కేడ్చువారికిఁ బ్రబల మైన

## ప్రథమాశ్వాసము.

సిచ్ఛెత్తువారికి మచ్చిక గంజాయి
తిన్నవారికి యోగ దేహంబును
గి. పకృతిం జూడనివారికి క్షామకోటి
మాంసకపు మాంసములఁ దిన్న మానవులకుఁ
జూడ శాస్త్రోక్తరీతిగా నాడు లోక
గతిని నడువవు వివరింపఁ గరములందు.

క. ఇది శరభరాజీయం బను
మొదలిటిపద్ధతి సమస్తమును చెప్పితి స
మ్మదమునఁ గనుఁడీ సుజనులు
మదినెన్నికంపంబుతోడ మహి నెన్నికగాఁ.

---

## ద్వితీయపద్ధతి

### (ద్రవ్యశుద్ధిప్రకరణము.)

నాభిశుద్ధి

గీ. నాభి గోమూత్రమునఁ మూఁడు నాళ్లు లెంప
నునిచి యది పంచి కణ ద్రోవ నుపకములను
గడిగి దొండించి మందులోఁ గలయ నూఱ
దోష మొందదు సుజనసందోహములకు.

రసగంధకశుద్ధులు

సీ. పారదంబున కేడు పసఁగు దోషంబులు
కంచుకంబు లటంచు గ్రంథములను
పసవులోపలఁ బోసి వెసఁ జేతికొలదిని
రుద్ది వస్త్రంబున గూర్చి జేర్చి
క్రిందమూకుడు పెట్టి యందుఁ జేరఁగరాచి
పమిడి ప్రత్యేకైన తమలపాకు

రసమైనఁబోసి తోరము గాను మధియింప
నైఁది నేర్పుగా నౌషధముల
గీ. నిడిన దోషం బొనర్చదు పుడమిలోన
గంధకమునకు నెనిమిది గలవు శుద్ధు
లాముదముతోను గాచి జీర్ణాంశుకమున
వడియఁబోసిన దోషంబు వదలియుండు

వెలిగార ఇంగిలీకముల శుద్ధి.

క. వెలిగారము పెంచికలో
పల నిడి పొంగించ శుద్ధి, పణఁతులపాలన్
గలయంగ నూఱఁగా నిం
గిలికము శుద్ధియగు సురలు కీర్తింపంగన్.

మరిచ పిప్పలి పాషాణ శుద్ధులు.

క. మిరియాలను బిప్పళ్లను
బరువడి వేయించ శుద్ధి, పాషాణంబున్
తిరముగ సున్నము తోఁ జె
చ్చెర నుడికించినను శుద్ధి సిద్ధము దలఁపన్.

తుత్థద్వయ శుంఠీ శుద్ధులు.

గీ. పాలతుత్తంబునిప్పులమైనవేయ
శుద్ధియగు, మైలతుత్తంబు సొబగుమీఱ
నిమ్మపండ్లరసంబుననమ్మికైన
శుద్ధియగు, శుంఠి సున్నములోఁ జొనుప నగును

హరిదళ తాళక మణిశిల శుద్ధులు.

క. హరిదళ తాళక మణిశిల
లురువుగ సున్నంపునీట నుడికించినచోఁ
బరిశుద్ధమగుచు దోషము
లరయంగ లేవనుచుఁజెప్పి రార్యులు వెలుచన్

నేపాళశుద్ధి.

క. బలువగు నేపాళపు వి
త్తులు పైపలుకూడఁగొట్టి తోరంబగు ప

# ప్రథమాశ్వాసము.

ష్పలు మూటఁగట్టి వేసనా
వుల కొండనువంటికేని యుకుశుద్ధియగుకా.

ఉమ్మెత్త ప్రవిత్తులశుద్ధి.

క. ఉమ్మెత్తవిత్తులు చక్క ని
నిమ్మపులుసులోన నానఁజ్చిన వేగఁగా
దిమ్మరి దోషములణఁగును
ఇమ్మహిలో నౌషధముల నిడవచ్చు నరుల్

గుగ్గిలాభ్రక శుద్ధులు.

క. అభ్రకము నుల్వకట్టెలో నమర నుంచి
యుడకఁబెట్టిన శుద్ధి యగు నొప్పుగాను
అరయఁ ద్రిఫలకషాయంబు నందు నుంచి
వండినను గుగ్గిలము శుద్ధి వైద్యములను.

క్షారత్రయ లవణపంచక కర్పూరధాతు శుద్ధులు.

సీ. సౌవర్చలవణంబు సైంధవలవణంబు
కాచలవణము తక్రంబుతోను
జంబీరరసమునఁ జక్కగానుడికించి
యామమాత్రమున బిడాలవణము
శుద్ధియగు పెంకులో సాబగుమిగుఁగ వేచ
నుప్పును శుద్ధియగు నుర్విలోన
నగు యవక్షారంబు తండులోదకముతో
నెండలోనొక్కజామిడిన శుద్ధి

గీ. సర్జకారంబు టంకణ క్షార మమర
మేఁకపంచితమునను మేలుగాను
అరయఁ గప్పూర ధాతువు లంబుజాత
నాళరసమునమర్దింప నగును శుద్ధి.

నల్లబోళయింగువ శుద్ధులు.

గీ. నల్లబోళంబు కలిబోసి నలియనూఱి
యెండఁబెట్టిన శుద్ధియగు, హింగువందు

కొమరాకుల రసమిడి జాము యొండనునిచి
ననుశుద్ధియగుసున్నిఁ జనులకిడగ.

మస్తకి గజపిప్పలి యోగసుములశుద్ధి.

క. విను మస్తకి నంమాత్రము
సను గజపిప్పళ్ళు కలిని నాతపమున భా
వన సేయ శుద్ధి యోగం
బనువగు సున్నంపుసీల్లనగు శుద్ధి తగన్.

జీలకఱ్ఱ సుపిణివిత్తుల శుద్ధి.

గీ. జీలకఱ్ఱ లెలమి మేలైనయొడలో
జాము పెట్టి వెచ్చ సలుప శుద్ధి
మునిణివిత్తనముల మెదుదైన చిఱ్ఱివే
ళ్ళరసమునను వంచ లలిశుద్ధి.

మాక్షికద్వయశుద్ధి.

అ. మాక్షికములు రెండు మధువున మధియించి
ముద్దచేసి చుట్టి మూటగట్టి
యులవకట్టుకలిని నొకనాడు యుడికింప
శుద్ధియగును సుప్రసిద్ధముగను.

---

## తృతీయపద్ధతి.

### (ఔషధపాకయంత్రవివరము.)

సీ. అటికెలు రెండు సంఘటన సేయుచు చీల
మన్ను మెత్తినను డమరుకయంత్ర
మగు, నొకట్ల బొచ్చెకు నడుగున రంధ్రంబు
పొడిచి సన్న యిసుక పోయంగాను

## షష్ఠమాశ్వాసము.

సైకతయంత్ర మై చను, నొక్కకుండకు
పై నష్టముగఁ గొంచె పాటిపుల్ల
పెట్టి గుడ్డచే నూఁటగట్టినవస్తువు
వ్రేలాడఁ గట్ట నద్దాని గణింప
నగును డోలాయంత్ర మనఁగనుఁ,
గడపముఁ గ్రిందశిస్తంబిడి యందుక్రింద
మంటినేలను బాతి సంతనగా మన్ను
బిగియించి చుట్టును సెగదగుల్ప
పాతాళయంత్ర మైపరఁగు, విద్యాధర
యంత్రంబనఁగ నొక్క ముంతపైని
యీనెల్లిక వేసి యెలమి మూకుడు మూయఁ
బటువ్వతిఁ గొల్మిలోపలను నూద

గీ. విశ్వకర్మపుటంబగు, వేయిపిడక
లిడిన గజపుట మని చెప్పఁ బకును, బదిటఁ
గుక్కటంబను పుటమగుఁ గువలయమున
నూహ నుంచుఁడి ముందు నుదాహరింతు.

సీ. పాతాళయంత్ర మేర్పడ నధఃపాతంబు
భాషంబునకు నొక్క పక్కచిల్లి
పొడిచి గొట్టముచేర్చి బుధులు తిర్యక్పాత
మందురు మూతపైఁ బొందుగాను
చెంబుసంధులఁ జేసి సీలమన్నిడ నూర్ధ్వ
పాతంబు పింగాణి పళ్లెమునకు
నడిమిదిక్కున నిన్న కొండుపిడిపై వ్రేల
తిన్నగా పింగాణి గిన్నె గట్టి

గీ. గంధకాది ధృతుల్దీయ గాను నూర్ధ్వ
పాతమిది యొక్కనూత్రంబు ప్రౌఢులైన
వార లెఱుఁగుడి రోగ నివారణార్థ
మునకుఁ జెప్పెద నిక్రమంబునను జేయ

రసభస్మ ఖాండవ కర్పూర క్రమము.

సీ. కుక్కుటాండంబునకుఁ జిల్లిగొని రసంబుఁ
బోసి పైసీలమన్నిడి పుటము వేయ
భస్మమగు నప్పుడే నిడి పరంగ డమరు
కమున వేసినఁ గర్పూర మమరు నంత.

ఇంగిలీకభస్మము.

క. విమలమగు బట్టింగిలి
కము డమరుక యంత్రమునను గట్టుప్పుపయిన్
సమకూర్చి వేయ భస్మం
బమలంబుగ నౌను రోగహారణ మొనర్చన్

తగర సీస భస్మ సిందూరములు.

సీ. తగరంబు మండలో దగనిడి యొకమైన
నను నడ్డసరమైన ఘనముగాను
పసుపైన మేహారిపత్రింబులైనను
బరఁగ ఁ పామార్గ పత్రమైన
వేసి వేయించను విమలభస్మంబౌను
డగుపలాశద్రవ తాళకమున
భస్మమా జిల్లేడుపాలను మణిశిల
నూరి నాగపురేకు లారరాచి
గీ. పెంచికలఁ బెట్టి పుటమిడ మంచిభస్మ
మడ్డసర యోములు తగ్గిపోవు బోసి
తరపు రసములఁ బదిమార్లు వరుస వేసి
గజపుటంబిడ సిందూర కాంతిఁ జెందు.

వంగసిందూరము.

క. అరయంగ వంగభస్మము
పొరిఁజిక్కని నిమ్మపండ్ల పులుసున నూరం
దిరమైనరజము గజపుట
మురపిన సిందూరమగును ముఖ్యముగాఁగన్.

### తామ్రభస్మము.

సీ. తామ్రంబు పలుచనై తనరు రేకులుచేసి
 యెఱ్ఱగా వడిగాచి యేపుమాఱ్ఱ
కలబందరసమున నుంచవకట్టునఁ బొన్న
 గంటిసి వేర్వేరుగాను ముంచి
చల్లార్చి గంధకసహితమౌ జిల్లేడు
 పాలు బూసియు సమపాలు గంధ
కముఁబెట్టి మూఁడుళ్ల గజపుటంబిడినను
 భస్మమౌ గోవులపాల త్రిఫల

గీ. భవ కషాయంబునను కలుబందరసము
నేతితో మర్దనముఁజేసి ఖ్యాతిమీఱ
నాలుగు పుటాలుచేసినఁ దోలు ఛర్ది
దాహగుణములు భ్రమలును దామడంగు

### తామ్రసిందూరము, కంచుశుద్ధి.

సీ. భస్మము జిల్లేడుపాలతోడను మఱ్ఱి
 పాలను మేఁకలపాల హంస
పాదిరసంబునఁ బరఁగ దామరతూండ్ల
 రసముతోడను జువ్వి రావిచెక్క
నగు కషాయంబున నప్పుడప్పుడు నూఱి
 గజపుటాలేడు నిక్కముగ వేయ
సూర్యోదయసమాన శుద్ధసిందూరమౌ
 నీ తామ్రసిందూర మెలమి నియ్య

గీ. సకలరోగహరంబగు జనుల కెల్ల,
కంచు చింతాకురసమునఁ గలియనూఱి
యులవకట్టున నుడికింప నొప్పుగాను
శుద్ధియగుధాత్రిలో సుప్రసిద్ధముగను

కంచుభస్మము, తత్సిందూరము.

సీ. జోకతో మెత్తఁ గంచు రేకులు సన్నము
గాఁ గత్తిరించియు గంధకంబు
పాలుగా జిల్లేడుపాలను మథియించి
రేకులఁ బట్టించి ప్రాకటముగ
నెండలో నెండించి యేడుమాఱ్లీరీతి
జనినను వజ్రమూషను ఘటించి
యేడుపుటంబుల నేసిన భస్మమై
చను, భస్మమునకును సమము హింగు
గీ. లికము దానికి సమము గంధకము దాని
సగము రసమిడి మోదుగు చక్కెరసము
రావిచక్కకషాయంబు క్రమణ మఱి
పాల మథియించియును హంసపాదిరసము
గీ. తుమ్మచక్కకషాయంబు దూలగొండి
వేళ్లరసమున గజపుటాలేడు వేయ
కంచు సిందూర మగును ప్రపంచమునను
కొలిమిలోనైన నూఱినఁ గలుగు గుణము.

కాంతశుద్ధి

క. కలిలోన నిమ్మపులుసున
పులిచల్లను కాంతమునిచి పొలుపగు నెండన్
దిలకింపంగా నిరుగడి
యలునిలిపినయడల శుద్ధియగు యోగ్యముగాన్

కాంతభస్మము, తత్సిందూరము

సీ. కాంతంబునకునాలుగవపాలు గంధకం
బునిచి యర్కక్షీర మునమథించి
కొమ్మ్రవఁగోరివిని యిమ్మగుబోదుగు
చక్కరసంబుల చాల నూఱి

గజపుటంబులుమూఁడు కడువడి వేయగా
భస్మమైచనును తద్భస్మమునకు
సగమింగిలికము తిగఁబెట్టి దూలదా
మఱి వేళ్ళరసమున పరఁగ మూఁడు

గీ. దినములనునూఱి మూసయందునను బెట్టి
మన్నుతిగఁబూసి గజాపుటా లెన్నమూఁడు
వేయకాంతంబు బాలరవి ప్రభగల
కలిత సింధూరమగును లోకంబులెంచ

సువర్ణభస్మము.

గీ. సీసభస్మంబు ఘనమఃశిశిలయు నర్క
దుగ్ధములనూఱి బంగారు తోరమైన
రేకులకుబూసి పుటములుద్వాత్రినేయ
నగును భస్మంబుభువిలోన నద్భుతముగ

సువర్ణ సిందూరము.

గీ. యోగ్యమానట్టి యీభస్మయుగము నిమ్మ
పల్లరసమున మర్దించి బాగుగాను
గజపుటంబిడ సిందూర కాంతిఁదనరు
నూతమిడి వేయగానగుఁ జులుకగాను

ఉక్కుభస్మము, తత్సిందూరము.

సీ. నేరేడుచక్కల సారంబుచే రెండు
జాముల నుక్కురజంబు నూఱి
యుడికించి వరుసగా నుసిరిక పప్పాన
చింతాకు నావుపంచితము మునగ
చక్కరసంబున నొక్కొక్క తేపను
మర్దించి యుడికించి మహితముగను

గజపుటంబిడఁగ చొక్కపు భస్మమగు తాడి
యుసిరిక కల్గర రసముఁబోసి
గీ. యెప్పటప్పటికిఁ నూఱి యొప్పుగాను
మఱియు జిల్లేడుపాలను మఱ్ఱిపాల
తడిపి తెగనూఱి గజపుట మిడినవేగ
లోహసిందూరమగు పృథ్విలో గణింప.

రజితభస్మము.

ఆ. జెముడుపాల మాక్షికము మెత్తగానూఱి
వెండిరేకులందు వెలయరాచి
కుంచికలను పుటముఁ బెట్టిన భస్మమౌ
ప్రాణిమాహిమాంశు భాతిదనరి.

పగడశుద్ధి, తద్భస్మము.

గీ. విద్రుమము నిమ్మపులుసున వేగదడిపి
యెండలోనుంచి వేసిళ్ల నెలమిఁగడుగ
శుద్ధియగు నర్కదుగ్ధముల్ చొనిపి నూఱి
గజపుటంబిడ భస్మమౌ గట్టిగాను.

మౌక్తికశుద్ధి, తద్భస్మము.

గీ. పరఁగ ముత్యాలు కుంకుడు బండ్లరసముఁ
బోసి యెండించినను శుద్ధి, ములకపండ్ల
రసములోనూఱి ఘటశరావములను
పుటము వేసిన భస్మమౌఁ బొలుపు దనర.

వజ్రశుద్ధి, తద్భస్మము.

గీ. మంచి వజ్రాలు గుఱ్ఱపుపంచితమున
యెండనునిచిన శుద్ధి,పల్లేరు రసముఁ
బోసియొకనాఁడు నానిన బొలుపుగాను
వజ్రమూషను భస్మమౌ వసుధలోన.

మరకతశుద్ధి, తద్భస్మము.

ఆ. మరకతము విదారి మహిత కందమునందుఁ
బొదిగి కుక్కుటంపు పుటము వేయ
శుద్ధి, పిండిబెండ క్షుద్రసారంబుల
పటుశరావ పుటము భస్మమగును

మాణిక్యశుద్ధి, తద్భస్మము.

గీ. మానికంబులు హయమూత్ర మధ్యమున త్రి
దినము లుంచిన శుద్ధమై చనును, భాను
దుగ్ధములు మూఁడుపుటములు తూఁగి వేయ
భస్మమగు వైద్యములకును బాగుగాను.

పుష్యరాగశుద్ధి, తద్భస్మము.

గీ. పుష్యరాగోపలంబుల పొలుపుమీఱ
మేక పంచితమునఁ గ్రుంచి మెలఁగ శుద్ధి;
పిండి బెండాకురసమున నొండు భావ
నమున కొల్మిని భస్మమా విమలముగను.

గోమేధికశుద్ధి, తద్భస్మము,

గీ. మొనసి గోమేధికము హయమూత్రమునను
తడిపి యెండించి నేల గుమ్మడు రసంబు
నటుమ మూనాళ్లు నిల్పఁగా బడిన శుద్ధి,
భస్మ మగు నల్లయుమ్మెత్త పసరుతోటి.

వైడూర్యశుద్ధి, తద్భస్మము.

గీ. పొసఁగ గుమ్మడికాయల రసము తురగ
మూత్రమున శుద్ధ వైడూర్య ములకు, నెన్న
కొండపిండి రసమున కొల్మి నూది
గజపుటం బిడ భస్మ మక్కజముగాను.

నీలశుద్ధి, తద్భస్మము.

గీ. కణఁగి నీలాలు ఖరమూత్రమునను జేర్చి
యెండ నునిచిన శుద్ధియౌ; దండితులసి

యూకురసమున విశ్వకర్మాభిధాన
పుటము వేసిన భస్మమౌ పొలుపుగాను.

అభ్రకోత్పత్తి.

గీ. పార్వతీదేవి వీర్యసంభవములగుచు
నభ్రకంబులు నాలుగై యమరుచుండు
అరయ మండూక నాగ పినాక వజ్ర
నామధేయమ్ములను సమున్నతము గాంచి

అభ్రకనిషేధములు.

క. శ్వేతాభ్రక వరుణాభ్రక
పీతాభ్రకములను మూడు విడిచియు ధరణిన్
ఖ్యాతిగ కృష్ణాభ్రకమే
చేతనులకు నౌషధములఁ జేయఁగవలయున్

అభ్రకనవనీతము

గీ. కలిని మూనాళ్లు కృష్ణాభ్రకంబు నిలిపి
నోరువెళ్లు పైన కుండకు నూతనంపు
గుడ్డ బిఁగగట్టి సగముగా వడ్లుపోసి
కలిని దోమిన నవనీత మెలమినగును,

అభ్రకభస్మము, త్రిసంస్కారము.

సీ. ఆ నవనీతంబు నర్కపత్రంబుల
రసముతో నూరిచ క్రమముగాను
కొలిమిలోపలఁ బెట్టి గుఱుతుగా ముమ్మారు
లూఁదింప భస్మమౌ మేలు మగ
నట్టిభస్మంబు ల్వాకట్టున జిల్లేడు
పాలావునేతను పరగ మట్టి
పాలను ముమ్మారు బాగుగా మథియించి
మూఁడేసిపుటములు రూఢివేసి

గీ. దుష్టువును కాన్గ జిల్లేడు తులసి యుత్త
రేణి గోరింట సర్పాక్షి నాణెమైన

పుచ్చమోదుగు గలిజేరు పొన్నగంటి
కలువ గుమ్మడు రావి సుగంధపాల.

సీ. పెన్నేరు వావిలి పిల్లిపీచరయును
గోడతిరము నేలతాడిగడ్డ
వాకుడు జిల్లేడు వాకాసినంబును
నేరేడు తక్కేడు వారిజంబు
మునగ కచోరదాసనము జ్యోతిష్మతి
నమ్మగడ్డలు యుప్పి దొమ్మడోలు
రసముల మర్దించి వెస వేరు వేరును
గజపుటంబులు పెట్టి రజనిరసము

గీ. ఆర్ద్రకము నిమ్మపండ్లు చింతాకు తుంగ
గడ్డలను మర్రియూడలఁ గలుగు రసము
బోసి మర్దించి యిరువది పుటములిడిన
అభ్రకము దివ్యసిందూర మగు గణింప.

రసాభ్రకసిందూరము

సీ కోరియభ్రము పుట్టకొక్కులతో నూఱి
గజపుటంబులు మూడు కణగి వేయ
భస్మీకరించును పారదం బభ్రిక
మునకు సగంబిడి మూడునాళ్లు
గను బ్రహ్మ జెముడుపాలను మఱ్ఱియూడల
మూనాళ్లునూఱి యాగానులవలె
బిళ్లలు చేసెండఁబెట్టి ప్రమిదల నుంచి
సీలమన్నిడి నేల చేతిలోతు

గీ. త్రవ్వి పిడకలుబోసి యదార్థముగను
గజపుటంబిడ సిందూర కాంతిగలుగు
శ్వాసలును కాసలును పాండువులును క్షయలు
శోభలును మేహములు మాను శుభముదనర.

రసలోహము.

గీ. రసమును యుక్కురజంబును
వెససమముగ మూడునాళ్లు విడువక జంబూ
రసముననూఱి పుటంబిడ
రసలోహంబగును రోగరాజినణంపన్.

శతపుటలోహము, తత్ఫలము.

సీ. పరిశుద్ధమగునుక్కు పలిమెడు మూనాళ్లు
నేరేడుచక్కల సారమునను
గట్టిగామర్దించి గజపుటంబులు నూటి
తోడ పంచితము జిల్లేడుబాల
చిత్రమూలము గలిజేరున పసపున
వాశారసంబున వజ్రలతను
ఆర్ద్రికంబున పాతళామృతలతలను
మూకణావ భీరు కుమారి యిట్లు
గీ. సారములనూఱి యేడేసిమారులెంచ
గజపుటంబులు వేయ నిక్కముగ నుక్కు
వారితరమయి మంచిసింధూరమగుచు
రాజరోగంబు లణచు విరాజితముగ

వైక్రాంతలక్షణము.

క. విను వైక్రాంతము పక్షా
లెనిమిది కోణంబు లాఱు నెనిమిది యంచుల్
దనరుచు నష్టవిధంబుల
ఘనవర్ణము గలిగి బరువు గలదై యొప్పున్.

వైక్రాంతభస్మము.

సీ. ఉల్వకట్టునదినం బుడికించి కొల్మిలో
గాచిమూత్రములోన తోచిమఱియు

నిమ్మపుల్సున గంధకమ్మున నెనిమిది
పుటముల భస్మమౌ పొలుపుదనర
వజ్రింబునకుసాటి వచ్చు వైక్రాంతంబు
నిడవచ్చువజ్రంబు లిడెడుచోట
అనుపానయుక్తిని దినము వైక్రాంతంబు
పూటకు చిన్నంబు పుచ్చుకొనిన
గీ. ఆయురారోగ్య మగుచు వీర్యాభివృద్ధి
గలిగి రోగంబు లెల్లను దొలఁగఁజేయు
నరుచు లణగించు క్షయలను నపహరించుఁ
బీడలనుబాపి జనులకు బ్రీతిజేయు.

సత్తుభస్మము, తద్గుణము.

సీ. సత్తుబిళ్లలఁజేసి రేఖుత్తరేణులమసి
జిల్లేడుమసియును చెలువముగను
బోసిమూఁకుళ్లలోపుటము వేసిన భస్మ
మవు చవిటుప్పు సైంధవలవణము
తోనిచ్చినను శూలమానును మేహంబు
లణఁచును కాసలుగుణమునొందు
సత్తు పారదమును సమముగా నల్లయు
మ్మెత్త పోమిందను మెదగనూటి
గీ. పారిశరావంబులను గజపుటము వేయ
సారసిందూర మార్ద్రిక సారమునను
గ్రోలఁ బదునెన్మిదగు శూల లోలిగుదురు
బూని వింశతిమేహము ల్మానజేయు.

సత్తుసిందూరము.

గీ. సత్తురాపొడి రసమును సమముగాను
అరయ నల్లనియుమ్మెత్త యాకురసము

సరవి మోదుగుచక్క రసంబుతోను
నూరి గజపుటమేయ సిందూరమగును.

తాళకభస్మము, తత్సిందూరము.

సీ. తాళకంబును పట్టి తగ సమంబుగనూరి
బిళ్లనుజేసి యోపిక చెలంగ
జమ్మిబూడిద కుండ కిమ్ముగాఁబోసి యా
నడుమ బిళ్లలబెట్టి వడినిమంట
బెట్టిన భస్మమా శ్వేతాభ్రకపురేకు
లకు నడిచక్కి తాళకముఁజేర్చి
గట్టిగాఁగట్టి సైకతయంత్రమున జేర్చ
తోయజాప్తాభ సిందూరమగును
గీ. యెనుముకొమ్మునఁబోసియు మినపపిండి
గోదుమలపిండి పాతనుగొట్టికట్టి
గజపుటంబిడ భస్మమా రజము తెల్ల
యుప్పిచెక్కను భస్మమానొప్పుగాను.

శతపుటమండూరము.

సీ. మహనీయమగునట్టి మండూరమొనరించు
విధమెల్ల దెలిపెద వివరముగను
చింతాకు బూరుగ చిరుబొద్ది పాపర
గండుతన్ రేణియు గలిజరాకు
వావిలి యూడుగ వద్ది నేరేడును
దానిమ్మ తులసియు తమలపాకు
నల్లుప్పి రేలయు నల్లేరు భూతుల్సి
పల్లేరు కామంచి పాలతీగె
జిల్లేడు గొల్మిడి జీడిమామిడిచక్క
దేవదారును మద్ది తెల్లతెగడ

చిటిగార కల్గర చిత్రమూలపువ్రేళ్లు
బత్తిబచ్చలిగడ్డ పచ్చిపసుపు
మూలగొండి తెగడ దూసరి కలిగొట్టు
నేలవేమును బెండ నెమలియడుగు
కలుబంద పెన్నేరు కాకరములు దొండ
చిత్తివాకుడువ్రేళ్ళు వెత్తిచెరుకు
మోదుగ గోరింట మొగలిచండ్లరసంబు
కన్నెకొమరి పొన్న కానుగాకు
కాకిదొంఁ డరటియు కాంచనగుర్వింద
యిప్పమారేడును యీశ్వరియును
యుసిరిక కలువయు ఉప్పి తెల్లనిదిగా
చీకువెలగ తుమ్మి చిలుకచెట్టు
తామర గంజాయి దాసన చెంచలి
ఆరెయు మొగబీర యడ్డసరము
గంపెన చిగిరింత గచ్చాకు రావియు
విను లింగదొండయు విష్ణుక్రాంత
బుడ్డకాకర నీలి పెద్దమానును వెల్ల
మద్దిచక్క యుటికమామిడాకు
కూతురుబుడమయు గువ్వగుత్తాకును
అంత్రతామరబొక్క నల్లములను
పొన్నగంటియు నిమ్మ చన్నచెఱుకీదును
కారుమునగ తాటికల్లుతోడ

గీ. నూరి యొక్కొక్కదినమున నారనిచ్చి
శతపుటంబులు వేయ విస్తృతముగాను
పల్లవోపేతమగుచు నిష్పాండువైన
చారుతరమైన శుద్ధమండూరమగును.

## చతుర్ధపద్ధతి.

### ( ఔషధప్రకరణము. )

ఆనందభైరవి.

క. కణ మరిచ నాభి బలుటం
కణ హింగుళములు సమంబుగాఁగను మూఁడౌ
దినములు జంబీరరసం
బున నగు నానందభైరవోజ్వలమగుచుక్.

సన్నిపాతభైరవి.

సీ. తగు సూత గంధక తాళకంబులతోటి
సమము హాలాహల మమరఁగూర్చి
మరియు విషంబంత మణిశిలవెలిగార
మొక్కటిగా వేసి నిక్కమైన
హింగుళంబన్నిట నెత్తుగానిడి చిత్ర
జంబీరయార్ద్రక సారములను
మరి మూఁడుదినములు మర్దించి గుంజాప్ర
మాణంబొసంగిన మానవులకు
గీ. సన్నిపాతంబు విషమమహాజ్వరము బాహు
కంపవాతంబుఁ బోగొట్టు ఘనత సన్ని
పాతభైరవ మిది మహాప్రాభవాను
పానమున సర్వరోగము ల్మానఁజేయు.

సంజీవరసము.

మ. హరవీర్యంబు విషంబు గంధకము చక్రాంగరబు నింగిల్కముల్
దిరమౌగుంటగరాకు రసమున మర్దింపంగ నౌమందు సాదా
గురిగింజంత యొసంగినన్ జ్వరముల న్గూల్చున్ త్రిదోషారి యా
పరసంజీవరసంబు దీనిమహిమ ల్వర్ణింపఁగా శక్యమే.

ప్రతాపమార్తాండరసము.

పంచచామరము. పాలురసము రెండుపాళ్లు బలియు మూఁడుపాళ్లు నే
పాళములను వీటితోటిపాటు హింగుళంబునన్
చాలఁగూర్చి నిమ్మపండ్లసారమున మథించినన్
వాలలిం బ్రతాపమార్తాండ రసము దానగున్.

ప్రళయానలరసము

సీ. పారదమొక్కటి బలిరెండు హారిదళ
మైదును వెలిగార మమర రెండు
పాలతుత్తంబాఱు పటుమణిశిల మూఁడు
నేపాళమొక్కటి నివివిషంబు
రెండింగిలీకము రొండులోహంబొక
టియు తామ్రమొక్కటి నయముగాను
పాళ్లుగా జిల్లేడుపాలను వావిలి
దుత్తూరజంబీర చిత్రమూల
కారవేల్లంబుల సారంబుచే నూఱి
రాగిపాత్రంబున రమణ నుంచి
రెండుయామంబులు మెండైన వాలుకా
యంత్రానమంచి గాఢాగ్ని నొండి
దించి తొల్లిటను మర్దించి యెండించిన
రహి ప్రళయానల రౌద్రరసము
గీ. వెసను గుంజెత్తు యల్లపు రసముతోడ
నొసఁగ త్రిదోషములును మహాగ్ని యైన
సన్నిపాతంబు లాహిక జ్వరము లస్తి
గతము లైనను మాను నిక్కముగ నవని.

వాతవిధ్వంసి.

సీ. ఘనరసనాగవంగంబులు గంధ
మహితామ్రలోహ తామ్రతి త్రికటుక

ముఁలు సమభాగము గలపి ద్వియామముల్
విడువక మర్దించి విషముమెన్మి
దవపాలు గూర్చియార్ద్రికసిందు వారార్క
దుత్తూరజంబీర ధాత్రిసార
ములను నూటినమందు సలలిత గుంజాప్ర
మాణం బొనంగిన మానవులకు
గీ. శూలలును వాయువులు శ్లేష్మ శోఫ లగ్ని
మాంద్యములు సూతికానామ మారుతములు
ఘోరగ్రహణులు పైత్త్యాపస్మారకముల
నణఁచు నిది వాతవిధ్వంస మనురసంబు.

## కాలమేఘరసము.

క. గంధక విష హింగుళములు
బంధురముగ మంచి నిమ్మపండ్లరసముచే
సంధించి కాలమేఘము
నంధకు లిచ్చినను దోషహరణ మొనర్చున్.

## శీతభంజనిరసము.

చ. రసవిషతుత్థయుగ్మములు రాజయుగంబులు లోకవార్ధులుం
బొసఁగ నొనర్చి ధూర్తరస పూర్తిని మర్దనఁ జేసి భేషజుల్
వెస గురిజెత్తు యిచ్చినను వెళ్లును శీతజమాజ్వరంబు లిం
పెసఁగను శీతభంజనరసేశ్వర మెన్నఁగ దీనిపేరగున్.

## జ్వరాంకుశము.

ఉ. పారదనాభిగంధకము పాలును యుమ్మెతవిత్తు లొక్కపా
లారయఁ గూర్చి నాల్గిటి సమాంశకటుత్రయ ముంచి మంచిజం
బీరరసార్ద్రసారములు బెట్టి మథింప జ్వరాంకుశం బగున్
ధారుణి వాతజాత మగు తాపము మానను పానయుక్తిచే.

కనకసుందరరసము.

గీ. గంధకంబునుహింగుళకణమురీచ
విషమునల్లని యుమ్మెత్త విత్తనముల
సమముగా తక్కెడాకులసారమున[illegible]
దగమర్దించిన కనకసుందరరసంబు

క. అతిసార మగ్నిమాంద్యం బతులంబగు
గ్రహణులును జ్వరంబులు వంచుఁ
జతురులగు వైద్యులొసఁగిన
కుతలంబున నరుల రోగ గుణములఁణంచుఁ,

మృత్యుంజయరసము,

సీ. సీసభస్మంబు సంసిద్ధ పారదగంధ
కంబులు లోహత్రయంబు కణము
తామ్రంబు మణిశిల తాళకంబును హింగు
ళంబును మైలతుత్తంబు టంక
ణము సమభాగంబు లమరంగనొనగూర్చి
జిల్లేడుబాల కసింద తులసి
వారిజ యుమ్మెత్త నర గుంటకల్గఁర
పల్లేరురసమున పరగనేడు
దినములుమర్దించి తీసి సైకతయంత్ర
పుటమున తగబెట్టి పూర్[illegible]

గీ. నూరిగుళికలుజేయు నఘోరసన్ని
పాత శీతజ్వరంబులు పరఁగనణఁచు
నవనిలో నిది మృత్యుంజయాఖ్యరసము
తత్తదనుపానముల రోగ తతులనణఁచు.

ప్రతాపలంకేశ్వరరసము.

సీ. పారదాభ్రికబలుల్ పాలుపాలొనగూర్చి
మూడుకటుకములును మూడుపాళ్ళు

విషులహా లోహాభస్మము నాల్గుపాళ్ళను,
పాళ్లెన్మిదిగ వంగభస్మమునిచి
పపహారుపాళ్ళు గోవత్సపురీషభ
స్మముగూర్చి మరియును విమలమైన
విసముయెన్మిదిపాళ్ళు పొసగించి యల్లపు
రసముతోనూరిన రాజయక్ష్మ
గీ. సూతికావాయువులు ఘోర వాతములును
దంతబంధంబులును భీమ తాపములును
పైత్యసంబంధశూలలు పంగువాయు
వులును లంకేశ్వరంబుచే సొలయు భువిని

సూచికాముఖరసము.

సీ. సౌవర్చలవణంబు సైంధవలవణంబు
గంధకాభ్రకతాళకములు విషము
మైలతుత్తంబును మణిసిల కపర్ది
టంకణ నేపాళ దరదములును
సమభాగములువీటి సమముగావిషమిడి
యిప్పతైలంబున నొప్పుగాను
మూడుదినంబులు రూఢిగామర్దించి
యొనర డోలాయంత్రమునను జాము
వండి కల్వంబున వడిమీరగానూరి
కృష్ణాహిచేదున కెరలరెండు
దినములుభావించి తీసిన సూతికా
ముఖనామరసమగు మూర్ఛహిక్క-
గీ. బధిరములు కంపములు సన్ని పాతములును
కత్తిచేబ్రహ్మరంధ్రింబుమొత్తినిమ్మ
పండ్లరసమున మర్దించి పైనిసూచి
కాముఖరంబు బూసిన గల్గు గుణము॥

చంద్రహాసరసము.

సీ. రసముహింగుళమును వసనాభి మణిశిల
జాతిఫలంబులు సమము రెండు
పాళ్లు గంధకమారు పాళ్లు నేపాళము
లెనిమిదిపాళ్లుగా యేలకులును
వర లవంగములు జెచ్చెర నొక్కటొకటి వెలి
గారంబు వరసురాకార మబ్ధి
భాగంబుయోషంబు పదహారుపాళ్లుగా
నొనగూర్చిజంబీరముననుగుంట
గీ. గల్గరను వావిలిని తాడి కరక లుసిరి
కలను తాంబూలి రసముతో గలపి నాలు
గేసి గడియలుమర్దింప నెసఁగు చంద్ర
హాస రస మిది దోష జ్వరంబు లణచు.

కాలకూటరసము.

సీ. బలిరసవిషశుల్బ శిలటంకహంరిదళ
త్రికటువైశ్వానర త్రిఫలహింగు
వచములుశరలోక వామ తేవాంబుధి
ఋతుసప్త చతురాస్య పతగనిధుల
దశచంద్రభూముల తగపాళ్ళగావించి
అల్లము వెల్లుల్లి జిల్లెడగ్ని
జంబీర నిగుఁడి తాంబూల ముాడుగ
హంసపాదియు మునగాకురసము
గీ. నీరుపిప్పలిరసముల నూరి శృంగి
బేరరసమున నొనఁగిన ఘోరసన్ని
పాతములు సర్వరోగముల్ బాయు కాల
కూటరసమిది భైషజ్యగురువు దెలియ

శూలకుఠారము.

సీ. త్రిఫల త్రికటుకముల్ త్రిక్షారములు పంచ
లవణము ల్వాయువిడంగ సూత
దరదంబు నాభి గంధకములు మణిశిల
రహితామ్రలోహముల్ రామఠంబు
చింతపండును యోమమెంతయు సరిగూర్చి
చిత్రమూలంబున చేర్చిదినము
మర్దించి గుంజెత్తు మాత్రవావళికిని
వేనీళ్ల గుడమున వేగ మివ్వ

గీ. పదియు నెనిమిది శూలలు పంచగుల్మ
ములు మహోదరములు ఘోర మూలరోగ
ములును శోభలు మాంద్యము ల్దొలగఁ జేయు
చారుతరమైన శూలకుఠారరసము.

వీరభద్రరసము.

ఉ. సూతము హైమమాక్షికము శుల్బము గంధకము న్విషంబు ?
ఖ్యాతిగ తాళకంబు శిల కాంతము నేపళ తీక్ష్ణలోహముల్
చాతురితోడ కాకరరసంబున మూఁడుదినాలు నూరినన్
ఆతతవీరభద్రరస మందురు వైద్యులు దీని ధారుణిన్.

రాజఘండేశ్వరరసము.

గీ. సూతమును గంధకము విష శుల్బములును
వావిలిని యామయుగ్మంబు వడిమథింప
రాజఘండేశర్వంబను రసము గడియ
లోన హరియించు సంతతగ్దానులెల్ల.

అర్ధనారీశ్వరము.

మ. పరిశుద్ధంబగు దంతిబీజములు నాభంబు న్బలిన్ యొప్పగా
హరవీర్యబును గూర్చియుల్లమున విఖ్యాతంబుగా నూరి మే

బ్బిరిగింజెత్తిడ సన్నిపాతచయము ల్గూల్చు న్మహాశూలలుం
హరియించు న్విను మర్ధనారిరస మూహాన్ భేషజుల్ యుంచఁగన్

సూతికాభరణము.

సీ. గగనంబు హేమ వైక్రాంతంబులును తీక్ష్ణ
తామ్రభస్మంబులు తగసమంబు
పారద బలి నాగ వంగ రౌప్యంబులు
సమముగా నిగుఁడి సారమునను
కల్హార గర్జేరు కారవెల్లిని చిత్రి
కనక వాశామృతార్కములు తులసి
జంబీర లాంగలీసార ముండి కుమారి
కారసంబుల నూరి చారుగతిని
గాజుకుప్పెను బెట్టి గడియలర్వదినాల్గు
వాలుకాయంత్రాన వండి దించి
మత్స్య నక్ర వరాహ మహిష శిఖావళి
కృష్ణాహికుక్కుట కృష్ణనాగ
గీ. మానుష మండూక సహితపిత్తంబుల
పనిగొన్న సూతికా భరణమగును
అది సూదిమొననంటినంత యొసంగిన
సన్ని పాతంబులు శ్వాసకాస
ప్లీహ గుల్మోదరంబులు భీతగ్రహణి
కంపవాతంబులును మహా కార్ముకములు
సతత బధిరంబులును యపస్మారములును
హిక్కలును మాను క్షణములో నిక్కముగను.

చంద్రకళాధరరసము.

సీ. పటికొక్కపాలును విటపునవాసాగ
రంబొక్కపాలును రసపుభస్మ

సమరంగముష్టాది యూరుపాళ్లను గూర్చి
ఖల్వంబునను నూరి కాచకుప్య
మునను౦చి వాలుకమున జేర్చి దీపాగ్ని
కలయ గాఢాగ్ని ఘటన జేసి
యొకయామమున దియ్య నొప్పగు చంద్ర
కళాధరరసమన సౌధరిత్రి

ఆ. వైద్యులీరస మనుపానవిధుల నివ్వ
రోగముల నన్నిటిని గెల్చు భోగ మొసఁగు
వాత సంఘాతముల గెల్లి వైరి సుమ్మి
కుష్ఠపులకివ్వ నరులకు గుణము లొసఁగు.

పూర్ణచంద్రోదయము.

సీ. మృదువైన బంగారు మది యొక్క పాలును
పారదం బెనిమిది పాళ్లుగాను
పదహారు పాళ్లుగా పరిశుద్ధబలియును
శోణకార్పాస ప్రసూనములను
కలబందరసమున గట్టిగా మర్దించి
గాజుకుప్పెను జేర్చి గాఢముగను
వస్త్రమృత్తిక మెత్తి వాలుకాయంత్రాన
పచనంబు జేసిన పల్లవారు
బాఁ బగు రజములో నయమగు కర్పూర
జాతిఫలంబుల చపలమింద్ర
పుష్పంబు కస్తూరి పొంగుగా నిడినను
పూర్ణచంద్రోదయము పుణ్యరసము

గీ. క్షయలు పాండువులెల్లను శ్వాసకాస
లురుగదలణంచు తనువంగజోపమాన
మగును వృద్ధత్వ మెడలించు నంగనలను
గూడఁ జేయును పల్మారు గోనిన ధరణి

వాతరాక్షసము

హరవీర్యాభ్రకకాంతభస్మములు సమ్యగ్గంధకంబున్ సమాంశపహింగూళ్ళు పుటనాగామృతత్రివృత్సారంబులన్ మూడునాళ్లరవోల్ప మర్ధియించుచున్ లఘుపుటంబిడి పాగగాచెట్టినన్ సరసం బైతగువాతరాక్షస మగున్ సర్వామయధ్వంసియై.

చంద్రప్రభాకరరసము

సీ. పారదబలిసీస భస్మలోహంబులు
వంగభస్మము తామ్రిభస్మమభ్ర
కంబు శుంఠయు వెలిగారము పిప్పళ్లు
మిర్యాలు సమముగా వరుసకూర్చి
యంతటి కెన్మిదోయంశకం బుంచి
కల్వమునను జేర్చి చెల్వమీఱ
నుమ్మెత్త వావిలియుసిరిక జిల్లేడు
నిమ్మపండ్లరసాన నేర్పుతోడ

గీ. గల్లపురసంబుతోడుత నాలుగ్రోజు
లతిదృఢంబుగ మర్దింప నైనముంచు
వసుధ చంద్రప్రభాకర రసమటంచు
గనిరి విషమజ్వరంబుల గణచునెపుడు.

త్ర్యంబకరసము

క. రసబలితాళకహింగుళ
విషపాషాణములసమము వెసమాక్కన్ వస
ద్రసమునగూరిన త్ర్యంబక
రసమై విషమాహిక జ్వరంబుల గెల్చున్.

చండభాస్కరము

సీ. పారదవైక్రాంత పాషాణబలులుటం
కణమణిశిలతాళకములు పేర్మి

హింగుళలోహంబు లేకైకభాగంబు
లోనగూర్చిరవిదుగ్ధములనుగుంట
కలగరరసమున ఖల్వంబుననుమూడు
దినములు మర్దించి తీసి సైక
తమునపుటంబిడి తెగచతుర్భాగంబు
పరిశుద్ధవిషముంచి పావకాంఘ్రి
గీ. రసముననుకంజహితమూల రసముతోడ
పూర్వగతి నూరి గుంజెత్తు బుధు లొసంగ
పవనవిషమంత్రిదోషదుర్భరగదప్ర
కరమహాధ్వాంత చండభాస్కరరసంబు.

వజ్రాయుధరసము.

మ. రసకర్పూరము హింగుళంబు వెలిశారం బాసురేంద్రంబు సూ
తసహాయంబుగ సాటిగా నునిచి నిద్దం బొప్పగా కల్గరీ
రసమ్మర్దన జేసి సైకతపుయంత్రంబందున న్వాడి యి
వ్వ సమస్తామయకాండచండనగరా డ్వజ్రాయుధం బౌ మహిన్

శీతాంశురసము.

సీ. పరిశుద్ధమగునట్టి పారదంబొకపాలు
నొకపాలుతాళకం బొప్పగాను
మణిశిలయొకపాలు మహనీయగగనసిం
ధురమునాలుగుపాళ్లువరుసగూర్చి
ఖల్వంబులో నిడి గట్టిగా నిమ్మపం
డ్లరసంబుతో నూర ధరణిలోన
శీతాంశురసమున జెల్లున్నుశోషలు
పాండువులను బాపు బలితమైన
గీ. దగ్గు బోగొట్టు జ్వరములుదరము రొప్పు
మాన్పు శూల లణంచును మానవట్టి

మేహాముల నెట్టు గదలను మిగుల ద్రుంచు
హైత్యములఁ గూల్చు నమృతంబు భాతి దనరు.

సౌభాగ్యానంద భైరవి.

క. హింగుళవిపకణమరిచము
సంగతిగా శుంఠి గూర్చి జంబీరముచే
పొంగుచు నూరిన భైరవి
రంగుగ సౌభాగ్య మనగ రాజిలునవని

మహాస్వచ్ఛంద భైరవి.

సీ. గగన భస్మము రస గంధకంబులు తాళ
కంబునాభియు వెలిగారములును
సమభాగములుపీటెసరి హింగుళంబిడి
ఖల్వంబులోనుంచి కడుమధించి
యల్లపురసముతో మొల్లంబుగానివ్వ
పటుమహాస్వచ్ఛంద భైరవంబు

ఆమోఘాస్త్రరసము.

గంధకంబును వెలి గారత్రికటుకముల్
పారదంబును నాభి పరగసమము
గీ. పావిలాకునతులసిన వడిమధించి
యల్లమునవివ్వగాఁ మోఘాస్త్రరసము

బ్రహ్మాస్త్రరసము.

నాభిహింగుళసమములునాగవల్లి
పత్రరసమునసూర బ్రహ్మాస్త్రరసము.

భూతేశ్వరరసము.

సీ. పారదనాభినేపాళగంధకహింగు
ళంబులు చిత్రమూలమున నూరి
వెనుకడోలాయంత్రమునఁనొంటిడిమిానుచే
దునబ్రహ్మజెడ్డుచాలనుమధించి

యల్లపురసమున నసువొందగానివ్వ
భూతేశ్వరరసము పొలుపుదనరు

స్వచ్ఛందభైరవము.

సూతంబునాభియు శుద్ధగంధకములు
సమములునాభితో సగముజాజి

గీ. కాయలన్నిటిలోను కనుసమంబు
గాగపిప్పలిచూర్ణంబు గలిపినూరి
యల్లపురసంబునను నాగవల్లిరసము
పరగనొసగిన స్వచ్ఛందభైరవంబు.

వైష్ణవీరసము.

గీ. కటుకరోహిణినాభిత్రికటుకహింగుళ
ములుసరిగానుచిత్రమూలవుకషాయ
వారిచేనూరిరోలను వండియార్ద్ర
రసముతోసవ్వవైష్ణవీ రసముదనరు.

మేహాంతకరసము.

సీ. కాంతభస్మముపాలుగగనభస్మముమూడు
భాగముల్వంగంబుపరగ రెండు
పాళ్లు, శిలాజితు భస్మమడ్భాగముల్
ఇల్వంబుపను జేర్చి కరము వేప
చక్కరసంబున చక్కగా మర్దించి
మేహాంతకరసంబు యూహనించి
మానవావళికనుపానయుక్తిని వైద్య
సింహంబులొసగిన శీఘ్రముగను

గీ. సకలమేహములనుమాన్పుప్రకటమైన
కాసశ్వాసలంబోగొట్టుకఠినమైన
పాండుశోభలనణచును పైత్యములను
దరముకాత్యాయనీధవుకరుణవలన.

సింహప్రతిపాలనరసము.

సీ. శుద్ధిమొనర్చిన సూతంబు వసనాభి
పరిశుద్ధ బలియురు పాము పిషము
పాలు పాలిడి హంస పాదిరసమున త్రి
దినములు మర్దించి మినుపగింజ
లంతటిమాత్రలు సంతనగా జేయు
సింహప్రతిపాలన సిద్ధరసము
యాశ్వినేయులు కను నాలోచనమొనర్చి
నిర్ణయించిరి దీని నేర్పువిూఱ
గీ. మానుష స్తన్యయుతముగా మనుజులెలమి
గ్రోలి దధ్యోదనము గొన్న ఘోరమైన
సన్నిపాతంబులు త్రిదోష సంకటములు
మాను ప్రాలేయశైలజా జానికరుణ.

ఇంద్రకరాయుధము.

సీ. తాటిబెల్లము మంచి దంతిబీజంబులు
మూడేసిభాగము లొప్పపరచి
చక్కనౌ టెంకాయ చక్కగాల్చినమసి
యేకభాగముగూర్చి ప్రాకటముగ
పరిశుద్ధమైయొప్పు పాదరసంబును
రెండుభాగములుగా నుంచదూచి
పచ్చి కొబ్బరిలోని పాలచే మర్దింప
యింద్రకరాయుధం బిదిధరిత్రి
గీ. పూని గుంజాప్రమాణంబు బుచ్చుకొనిన
సుఖ విరేచనమగు వేకి సోకు మాన్పు
శూల లెన్నిటినైనను తూలగొట్టు
దీని వర్ణింప శక్యమా మానవులకు

మేఘనాధరసము.

మత్తకోకిలము. ధరవిళంగమరీచ సైంధవ దరదనాగరసూతముల్
కరికణము టంకణము లింగువ కనముదీప్యయుగత్రివృ
త్సరి సమంబులు భాగవృద్ధిగ చక్కనౌనే పాళముల్
నరవి యార్ద్రికచిత్రనింబూ సారముల మర్దించినన్.

ఉత్సాహము. మేలుగాను దీనిపేరు మేఘనాధ రసము బల్
శూలలన్ హరించు మిగుల సుఖవిరేచనం బగున్
చాల జంతు రోగతతుల సంహరించు భేషజుల్
బాలచంద్రధరుని దలచి భక్తితో నొసంగినన్.

జ్వరాంకుశరసము

చ. రసబలిటంకణత్రిఫల రమ్యకటుత్రియతాళకంబులున్
విసమును దంతిబీజములు వేసి సమంబులు ఖల్వమందునన్
మసలక భృంగిసారమున మర్దనజేసిన మందుజోగినీ
రసము విరేచనం బగు జ్వరంబుల గెల్చునుపానయుక్తిచేన్

విషామృతము.

ఆ. విషము యొకటి భాగవృద్ధిమరీచము
మంచి తేనెతోడ మర్దనంబు
మహి విషామృతంబు మాషమాత్రంబిచ్చి
పెరుగు వంటకంబు బెట్టవలయు

చంద్రప్రభావటి.

సీ. పారదగంధక పరిశుద్ధలోహంబు
దారదత్రిఫలముల్ తాళినంబు
గవ్వలభస్మంబు గ్రంధికంబునుచిత్రి
మూలము ముస్తలు యాలకులును
నాగకేసరములు రాగిబూదియు శుంఠి
రేణుకల్మిరియాలు నాణ్యమైన

పిప్పళ్ళు యతివిస గొప్పలవంగముల్
నేపాళబీజముల్ నేర్పుమీఱ
సమభాగములుగూర్చి సర్వచూర్ణమునకు
వాఁబెల్లము రెండు పాళ్లుజేర్చి
మర్దించి చణకోపమానవటీగుళికలు
రేపుమాపు నొసంగ బాపుగల్మ
దారుణ శూలాతి సార పాండువ్రలను
కాసల శ్వాసల కర్ణరుజల

గీ. సన్నిపాతంబులను గూల్చు సకలమైన
యగ్నిమాంద్యచయంబుల ఘాతమొనర్చు
భాసురంబైన చంద్రప్రభావటి యను
మందు దీనికి సరి మరి మందు లేదు.

రసానందభైరవి.

సీ. పరిశుద్ధమైయొప్పు పారదగంధక
హింగుళమరిచ లవంగములును
నాభి వెలిగారంబు నయమొప్ప శుంఠియు
పిప్పళ్లు నేపళ బీజములును
సమభాగములుగూర్చి క్రమముగా జంబీర
రసమున మూనాళ్లు వెసమర్ధించ
పారదానందాఖ్య భైరవంబై యొప్పు
ముద్గప్రమాణంబు ముఖ్యముగను

గీ. మానవాళికి నొసగిన మాన్పు వేకి
సన్నిపాతాతిసారాది సకలరుజల
సుఖవిరేచన మగు శూలి మున్ను దీని
యోగివరులకుఁ జెప్పెను బాగుమీఱ.

కవాటకేసరి.

ఆ. రసము నుసిరికయును విసము నేపాళముల్
కటుకరోహిణియును గంధకంబు

కరకతాడు లెలమి కల్గరచే నూర
భాసిలును కవాట కేసరి యన.

సూర్యావర్తరసము.

సీ. కాకబింబీ హేమ కార్పాసములవిత్తు
లభ్రక భస్మంబు శుభ్రమైన
మౌక్తికంబులబూది మంచివెల్గారంబు
తిప్పసత్తును హేమ దీప్తిగల్గు
మాక్షికంబును దివ్యమైన లవంగముల్
సమ భాగములుగూర్చి విమలమైన
యింగిలీకంబును యెనిమిది భాగముల్
పోసఁగించి జంబీర రసముతోను

గీ. నూరి గుంజెత్తు నొసగిన ఘోరపైత్య
ములను ఛర్దుల హిక్కల దొలగఁజేయు
క్షయల గ్రహణుల నతిసార చయము లణఁచు
సూర్యవర్తియగు రస మిది సుజనులార.

క. ఏయేరుజలకు మందుల
నాయా ప్రకరణములందు నలవడియుండఁగా
జేయంగఁ దలఁచి స్వల్పము
గాయిటఁ బల్కితిని వీని గనుఁడీ విబుధుల్.

ఆశ్వాసగర్భము.

చ. నిరుపమకీర్తిసార రజనీచరవిక్రమభంగశూర సుం
దరతరవజ్రదేహ వినుత త్రిదశార్య మహాత్మమూహా భా
సుర మహిమాకలాప పరిశోధిత దివ్యతరప్రతాప వా
నర నిచయానుగమ్య కరుణావన సౌమ్యతరప్రభావనా.

క. శతకోటి వనజహిత భా
వితదీప్తా నిరుపమాన విభవకృశాన్తా
జితకామాద్యుతభీమా
హతవైరిస్తోమ వీర హనుమన్నామా.

మాలిని. కదనమహితధీరా కాంచనాద్రిప్రభారా
మదన రిపు కుమారా మౌని హృత్పద్మచారా
త్రిదశ నుతచరిత్రా దీనభూజాత చైత్రా
కుధరపథ నివేశా క్రొమపూడీపురీశా.

గద్యము.

ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధకవిత్వవిరాజ తుమ్మూరుశరభ
రాజ ప్రణీతంబైన శరభరాజీయంబను వైద్యశాస్త్రంబునందు
నాడీనిదానపద్ధతియు ద్రవ్యశుద్ధి పద్ధతియు భస్మ
సిందూర పద్ధతియు బహువిధ రసపద్ధతి
యుఁగల ప్రథమాశ్వాసము
సమాప్తము.

# శరభరాజీయము.

## ద్వితీయాశ్వాసము

క. శ్రీకోమిరపూడి మందిర
లోకేశ్వరవినుత జలజలోచన దనుజా
నీకభయంకర విపులద
యాకర హనుమంతరాయ యనుపమగుణా.

### పంచమపద్ధతి

(మానపరిభాష)

సీ. ఆద్యమానపరత్నమైన నైదుగుంజలయెత్తు
కరమొప్పగా మాషకములు పదియు
నాలుకర్షంబగు నక్షంబగునుయక్ష
ములునాలుగైనను పలముపలము
లవి నూఱుతులయగు నవి యిర్వదైనను
భారయనంబడు భారలుపది
యాసితింబననొప్పు నదియు శాకటమనం
జెల్లును ధాత్రి ప్రసిద్ధముగను
గీ. తగును కుంచ మనగ సోల దనరునాల్గు
సోలలైనను కుడప మా నాల్గుకుడప
ములును ప్రస్థంబు కుంచంబు దెలియనాల్గు
నాఢకం బన నిదియె తూ మనఁగ నొప్పు.

గీ. ఆఢకమ్ములు నాల్గు ద్రోణాహ్వయంబు
నరయగా నైదు ద్రోణముల్ఖారగు ఖారి

ఘౌరియెన్మిది ద్రోణము ఖారియనేని
వాహమన నొప్పుచుండు నివ్వసుధలోన.

వస్తు వృక్షసంకేతనామములు.

సీ. గుమ్ముడు వెలికలి గొట్టునెల్లియు పెద్ద
మాను మారేడును మానుగాను
పంచమూలము లనంబడును వాకుడు నేల
పొన్న పల్లేరు కోల్పొన్న ముల్క-
బాగుగాను కనిష్ఠ పంచమూలము లిదు
తెగలును దశమూలమగు మనొప్ప
చిత్రమూలము సొంఠిచెవ్యము పిప్పళ్లు
గూడిమోడియు పంచకోలములును
గీ. ఆడియుసిరిక కరకలు లెగ త్రిఫలము
కణమరీచము శుంఠి త్రికటుకమగును
ఆర్ద్రి మతివసము స్త్రిభద్రికమగు
ఘన చతుర్భద్రకము తిప్ప గలసెనేని.
గీ. దాచనీచక్క యాలకుల్తాళిసములు
విను సుగంధత్రయము త్రిజాతకమన
నాగకేసరములు గూడినను ధరిత్రి
లో చతుర్జాతకంబులో లోకులెన్న
ఆ. ద్రబ్బ మఱ్ఱిజువ్వి రావి మేడియుఁగూడి
పంచవల్కలంబు లెంచనగును
మామిడి చింత కలగ మారేడు నేరేడు
పంచపల్లవంబు లెంచనగును.

ఉ. రోగనిదానవేళలనిరూఢముగాఘృతలేహ్యచూర్ణముల్
బాగుగఁజెప్పగావలసి ప్రస్తుతమిక్కడ కొద్దికొద్దిగా
నే గణుతించిచెప్పితిని యిచ్చటమాత్రము వీరుస్వల్పసం
యోగములంచునెంచి తలయాచకుడీ బుధులార వేడ్కదక

కదళీకందఘృతము.

సీ. పౌసగరంభాకంద కుసుమసారంబులు
బటువుగా నాలవ పాలుసల్పి
చిక్కగాదిగగాచి చక్కనౌఘృతము ము
ఘ్గంబులనిడి మంచిగంధరజము
త్రిఫలలవంగముల్ దేవదారువుయేల
కులుజటామాంసియు వెలగపండ్లు
మామిడిలోద్రుగలోస్పిమించకలజువ్వి
యిప్పమేడియురావి యేర్వుమద్ది
మొగలిరేకును ప్రబ్బమోదుగుతుమికియు
మట్టిముచాగేష్టిమధుకములును
గీ. చూర్ణమొనరించి తగినట్లు కూచివేసి
పాకమున వండి సేవింప పాండుయక్ష్మ
శోఫలును మూత్రకృచ్ఛ్రిలు శుక్లమేహ
ములను కదళీఘృతిము మాన్పు నలఘుగతిని.

లవంగాదిఘృతము.

సీ. గోఘృత క్షీరము ల్గూర్చి సమంబుగా
కటుకత్రియంబులు కరకతాడి
యుసిరిక లేలకు ల్వాసగ లవంగాలు
హాస్తి కేసరములు నాకుపత్రి
చిత్రమూలము తవాక్షీరి చూర్ణమొనర్చి
ఘృతపాకమునవండి హితవుమీర
చక్కెర తేనెయు చల్లారగాబోసి
విసువక నిత్యంబు యుసరికాయ
గీ. మానమున బుచ్చుకొన్నను మాను యక్ష్మ
పాండువులు శ్లేష్మములు శోఫ పైత్యవాయు
వులును మందాగ్నిగదలు శూలలు హరించు
నరయ జనులకు నీలవంగాది ఘృతము.

జంబూవల్కలాదిఘృతము.

సీ. చక్కఁగా నేరేడుచెక్క మోదుగుచెక్క
చెరుకు దుంపలు పాలచెక్క రేగు
చెక్క లొద్దుగచెక్క జీడిమానులచెక్క
నల్లుప్పిచెక్కయు నందివర్ధ
నము యుప్ప కొడిస్స వృక్షముల చెక్కలు సమాం
శలుగూర్చి నూరేసి పలములమర
ద్రొక్కి యెన్మందుము నిక్కమా నీటిలో
గలపి యిద్దుము నిల్వగాచి వడియ
బోసిన, నల్లుము పాలుబోసి గోఘృత మిర్య
తుంగ ముస్తలును లొద్దుగయు కొడిశ
యేలకు ల్పిప్పళ్లు యేరుజాజుల పూలు
కలువలగడ్డలు చెలువుమీఱ
మారేడు దానిమ్మ మానుపస్పు సుగంధి
పాల గజ్జేరును పత్తివిత్తు
లరటిపువ్వులు నడ్డసరపాకు నేరేడు
యిరుగుదాసని పువ్వు లెప్టిమధుక
వెలగవిత్తులు చిట్టివేళ్లు కరాంబు
బూరుగబంక గోక్షూరము లిడి
గీ. రుబ్బి యాఘృతమునవేసి రూఢినైదు
దినములెన్నగ ఘృతపాకమునను వండి
పోసగ నరచేతి గుంటెడు పుచ్చుకొన్న
ప్రదరముల్దోలు జంబూభవాది ఘృతము.

రాజరాజేశ్వరఘృతము.

సీ. పెన్నేరు తంగేడు పిల్లిపీసర నెల్లి
వావిలి తిప్పయు వాశలమర
ప్రత్యేక కల్కముల్ పల పలంబులగూర్చి
వదహారు శేర్లు యాపంబులుంచి

భాగాష్టకము చిక్కగా గాచి గోఘృత
క్షీర మూత్రంబుల సారదధియు
జేర్చి పక్కాయర్ధశేశేసి బోసియు
యుసిరికాయలు పిల్లిపిసర లరటి
గడ్డల రసము పక్కా పావు శేర్లుగా
వేరువే రది గలి జేరు చిత్ర
మూలము మరిచంబు లేలకుల్చవ్యము
కోష్టు తాళిసపత్రి యష్టిమధుక
మంచిగంధము ద్రాక్ష మరిలవంగపు
చెక్క యోమపుపొట్టును సామజకణ
ధరణి శర్కర నేలతాడి దీపద్రాక్ష
మహితచూర్ణముకర్ష మాత్రముగను

గీ. తూనికనుబోసి చక్కెర తేనెగలిపి
సేవజేసిన మేహములోర్వు శుక్ల
నష్టములుమాను కృచ్ఛ్రలు నష్టపరచు
రాజరాజేశ్వరఘృతంబు రమ్యముగను.

సంజీవినీఘృతము.

సీ. వినుకొడ్సిచెక్కెదు వీశెలు నల్లుము
నీళ్లతోతూమెడు నిల్వగాచి
సరవిపంచితము కషాయమంతయుబోసి
గోఘృతంబును పాలు కుంచెజేసి
కలియగాబోసి త్రికటుకముల్గంధము
కలువదుంపలును సుగంధిపాల
ములువెంపలియు పస్పు మునుగ వాకుడువేప
చెక్క మధుకములు చక్కగాను

గీ. పొడియొనర్చి ఘృతంబులో బోసి వండి
దించి నిత్యము సేవింప తీవ్రమైన

పాండు శోఫలు కామిలల్ పరగనడచు
నవని సంజీవనీఘృతంబనగనొప్పు.

తండులీయఘృతము.

క. అరయంగ చిత్రివేళ్లను
కరుదూపము నాల్గుపాళ్లు కల్కములో మే
దురమొక్క పాలు నేతను
మరివండిన ఘృతము విషము మానగఁజేయుఁ.

ద్రాక్షాదిఘృతము.

సీ. ఖర్జూరపండ్లు చొక్కపుద్రాక్షపండ్లను
యిప్పపువ్వు త్రిఫలమిాతపండ్లు
తిరమైన పిల్లిపీసర నేలగుమ్మడు
నూరి పక్కాపావు శేరులుంచి
తూమెడునీళ్ళలో త్రొలుతనేపడవేసి
నెరి నాలుగవపాలు నిలువగాచి
యుసిరికకాయలరస మిక్షురసమును
ఘృతమునుసమముగా జతయొనర్చి

గీ. కరకరసమొక్కకుంచెడు కలయబోసి
పక్వముఁ వండి మధువును పంచదార
గలిపి సేవింప పైత్య వికార మేహ
హరణమొనరించు నిదియె ద్రాక్షాదిఘృతము.

నిర్గుండీఘృతము.

సీ. వావిలాకురసంబు కీవిమిారగ దీసి
ఘృతము నాలవపాలు జతయొనర్చి
పక్వముజేసి పిప్పళ్లు చవ్యము కోష్టు
వేలకులును చిత్రమూల దాచి
నలు నాగకేసరంబులు మరి వాయువి
ళంగము ల్మంచిలవంగములును

సమముగాఁ జేర్చి చూర్ణము జేసి ఘృతములో
వేసి వండించిన శ్వాసకాస
గీ. లపహరించును వాయువు లడఁచు నల్ల
వస్త్రగంజని గలిపివ్వ వసుధ శుక్ల
మేహములు మానగాఁ జేయు దేహులకును
కలితపరిశుద్ధ నిర్గుండికాఘృతంబు.

పిప్పల్యాదిఘృతం.

సీ. పిప్పళ్లు నుపిరికపప్పును కోడిశ
పాల మారేడును నేలవేము
నేల పొన్నయు వేము నేలయుస్త్రికగూఢ
పాలచవ్యము దాళ్త్రిఫలంబ్లు కోల
పొన్న బలురక్కసి యెన్నఁగా పల్లేరు
కసివిందయును తుంగ గడ్డ తేలు
మణిచెట్లు యతివస మరిజాజి రేలయు
సమముగాఁ జూర్ణంబు లమరఁ జేసి
గీ. గోఘృతంబున వండి రోగులకునివ్వ
ఘన హలీమక శ్లేష్మరోగములు వమధు
పాండు విషమజ్వరంబులు పార్శ్వగదలు
నరుచు లడగించు నీపిప్పలాది ఘృతము.

గుగ్గులుతిక్తఘృతము.

సీ. పొనగ వాకుడు చేదుపొట్ల తిప్పయు నేల
వేమును పడిపలాఁ బ్వేరు వేర
తూఁచి నీళ్లను వేసి కాఁచి కుంచెడు నెయ్యి
కల్పి ఘృతము చిక్కఁగా నొనర్చి
సిరిబొద్ది పసుపును సురదారు కోష్టువు
వాయువిళంగము వారిజంబు
మిరియాలు శొంఠియు మరి యవక్షారము
లును సదాపయు చవ్య

ములు గజపిప్పళ్లు పుష్కరమూలంబు
ఓమము మంజిష్ట వసయు వోడి
కటుకరోహిణి చిత్రకము పొన్న లతివస
కోడిశ చూర్ణము ల్గూర్చి శుద్ధి
జేసిన మహిసాక్షి వేసి కల్కముజేసి
కలిబోసి నేత పక్వముగ వండి
గండమాలలును భగంధర వ్రణములు
జంతువు ల్గుల్మముల్ క్షయలు మొలలు
మేహంబు లరుచులు దాహరోగంబులు
పీనస ల్దగ్గులు మానవట్టి
గీ. పాండుహృద్దదలు స్మరి బహుళవాత
రక్తము ల్మూర్ఛలు నివారణ మొనర్చు
శక్తిగలిగిన గుగ్గులు తిక్తఘృతము
మానవులకివ్వ నమృతోప మానముగను.

శుంఠీఘృతము.

సీ. శతపలంబులు శుంఠి శకలము ల్గావించి
జలములు నాల్గు ప్రస్థములనుంచి
తగనాలుగవ పాలు దిగగాచి కుంచెడు
గోఘృతం బందులో గూర్చినేయి
చిక్కగా వండి దాచినచక్క పిప్పలి
కట్టె చవ్యము మధుకంబు లేల
కులు లవంగంబు లింగువ గజపిప్పళ్లు
సైంధవ లవణ ముస్థలును పసపు
వాయులవంగము ల్వాకుడు తెల్లని
యావాలు భారంగి యల్లములను
కర్ష ప్రమాణంబుగా చూర్ణములుజేసి
ఘృత పక్వమునవండి చతురులివ్వ

గీ. గ్రహణు లతిసారములు మూత్రగదలు మొలలు
వాయువులు పాండువులు గుల్మ వర్గములును
ధాతునాశనములు మాను ధరణిలోన
డంబు గలిగిన శుంఠీ ఘృతంబువలన.

---

## షష్ఠపద్ధతి.

### (రసాయనప్రకరణము.)

అమృతసంజీవనీరసాయనము.

సీ. వత్సాదనీలత వట్టివేళ్లను పొన్న
గంటి పల్లేరులు కారుపెసర
నేలవేము సుగంధిపాల తంగేడులు
తగ నడ్డసరము శతావరియును
వీటిరసంబులు వేర్వేరుకుంచెడు
గలియగాబోసి నిర్మలజలంబు
లెనిమిదోపాలోబ్బసి ఘనతరాష్టావశే
షముగాచి రెండుకుంచాలనేయి
బోసి చిక్కనొనర్చి యుసిరికపప్పును
చాగ పీసర లడ్డసరరసములు

గీ. నిడిఘృతంబదికడు చల్లబడిన వెన్క
రమణచక్కెర పంచదారయును తేనె
షదిపలంబులను గల్పి పసపు మాను
పసపు ముస్తెలు రెండుదర్భలును యగరు

సీ. భద్రముస్తలవంగ పద్మకేసరములు
కటుకరంబులును మంచి గంధమును త

వాక్కిరి త్రిఫలము ల్ద్రాక్షపండ్లును యేల
కులు కప్పూరములు తక్కోలములును
దాల్చినయును నేలతాడి పెన్నేరులు
కలువగడ్డలు మధుకంబు కోష్టు
దాడిమ పిండిబెండలు శిలాజతువర
గోగు ఖర్జూరము లొక్కతిమరలును

గీ. నొక్కటొక్కటిపావుశేరక్కజముగ
పొడియొనర్చి ఘృతంబులోబోసివండి
దేవగురుపూజ లొనరించి ద్విజులకెలమి
భోజనము బెట్టికర్షంబుబుచ్చుకొనిన

సీ. బహుమూత్రములు ఖండబద్ధమూత్రంబులు
రక్తపైత్యప్రదరంబులామ్ల
పైత్యప్రమేహముల్ శ్వాసకాసలు కర్ణ
శైత్యభ్రమోన్మాద షండములును
వీర్యనాశనలింగ వీర్యము ల్జంతురో
గములును యోనిరోగములు పీన
సలు వంధ్యశోణిత స్రావంబులును ధను
ర్వాతముల్ గ్రహణిసర్వాతిసార

గీ. ములును మానును మానవుల్ ముదముతోడ
బుచ్చుకొనినను నమృతంబు పోల్కిదనరి
యమృతసంజీవనాఖ్యరసాయనంబు
గదల నదలించు నరుల కింపొదవుచుండు

సుకుమారరసాయనము.

సీ. గలిజేరు వకతులగా నెల్లి వాకుడు
నేల పొన్నయు ముల్క కోలపొన్న
మారేడు మరి పెద్దమాను గుమ్ముడు కలి
గొట్టును పలపలాల్గూడపాల
మోదుగ గొబ్బి యాముదము కానుగ రెల్లు
పెన్నేరు దర్భలు పిల్లిపీస

రలుగూర్చి జలములోపల నెన్మిదోపాలు
గాచి ముప్పది పలాల్గాను గుడము
గీ. నందులో వేసి కుంచెడు నాముదంబు
జోకగోఘృతమును పాలు మేకనెయ్యి
గలియగా బోసి మంచిపక్వమున వండి
కణము వావిలి పిప్పలికట్టె శుంఠి
గీ. ద్రాక్షలుయష్టిమధుక సైన్ధవలవణము
కలియగా బోసి యెండలోపలను బెట్ట
యకృతిశోషోదరార్శ గుల్మాదులెల్ల
నడచు నీసుకుమార రసాయనమున.

తలస్ఫోటకరసాయనము-

సీ. తంగేడువేళ్ళ నిద్దపుచెక్క యెత్తెడు
పూని తదర్థంబు దానివిరులు
విరులకు సగముగా విత్తులు కరకకా
యలు నిరువదివాళ్లు జలములందు
పటుగతి నెనిమదోపాలు చిక్కగగాచి
పంచదారయు తేనె పక్వముగను
యుంచి త్రిఫలములు మంచిపస్పును మాను
పస్పురేణుక కొష్ఠ్యెపాల యేల
కులు చిల్లవిత్తులు పువ్వులరటి
పువ్వులు బూరుగ పుష్పములును
నళినసూనంబుల నాళము ల్హారతి
కర్పూర మెచ్చుబంగారు వెండి
తామ్ర మభ్రకము కాంతంబు చిట్టెంబును
పిప్పళ్లు తంగేడువిత్తులపొడి
గీ. గలియగావేసిగట్టించికర్ష మివ్వ
మించుబహుమూత్ర సర్వ ప్రమేహములును

మూత్రకృచ్ఛ్రములుమాను నిక్కంబుగాను
యవనితలపోటకాఖ్యరసాయనమున.

పిప్పల్యాది రసాయనము.

సీ. పిప్పళ్లు సామియు తిప్ప యుగ్రసిక చంద్ర
చిరుబొద్ది కోడిశ చేదుపొట్ల
నేలయుసిరి కిప్పకోల ముక్కనుపాల
మనుబాల కానుగు మద్ది వేప
మాశేడు కన్నెకొమారి శతావరి
కొండగుమ్ముడు నేలగుమ్ముడులును
మానుపసుపు జాజి మంచిపెన్నేరును
నెల్లి దంతియు వట్టివేళ్ళు చిత్ర
మూలము శ్వేతశ్వేర పాలతోడుతవండి
రసమురాబిండి తద్రసము నకును
సమముగా ఘృతముంచి సరిపిల్లిపీసర
రసము మేకలపాలు పోసగగూర్చి
కటుకత్రయ మగరు కటుకరోహిణి గంటు
భాజీ మంజిష్ఠ త్రిఫల కచోర
గజపిప్పలులు రాస్న ఖర్జూర మేలకి
కస్తూరి ద్రాక్ష సుగంధిపాల
నఖము చిప్పలు మోడి నలజీలకర్రయు
మాంసి తాళిసపత్రి మరి కచోర
పత్రాంబువును సరిపాళ్లు చూర్ణముజేసి
ఖండశర్కర వేసి గాఢమైన
వహ్నిచే వండివ్వ వరుసనేకాహిక
ముఖ్యజ్వరంబులు మొదటనడచు

గీ. కఫము కాసయు హృదయరోగమ్ముఛర్ది
పాండువుల్తాప మున్మాద పటుతరాగ్ని

దీపనం బావ నూనెయు తాపరిత్య
జించి కొనినను నరులకు నెంచగాను
నడగు నీ పిప్పలీ రసాయనమువలన.

కదళీఫల రాసాయనము.

సీ. కదళిఫలంబులు కలువగడ్డలు బలు
రక్కసిదుంపలు చొక్కమైన
పెన్నేరు యుసిరిక పిల్లిపీసర యస్తి
తామరతూండ్లును తాడిగడ్డ
లును యిప్పపువ్వు కోష్టను శిలాజిత్తు పెద్ద
దోసవిత్తులు ద్రాక్షతోరమైన
ఖర్జూరములు జీలకర్రలు యోమము
మామిడిటెంకయు మరిసుగంధ
పాంజ్లలు నాగకేసరములు సమముగా
వీటిలోపల తలపోటకముల
విత్తులచూర్ణంబు వెసనగంబునుజేసి
యన్నిటియెత్తుగా నాజ్యమధువు
గీ. శర్కరలు గల్పియిచ్చిన జనులకెలమి
యశ్మరీ కృచ్ఛ్రఘాత మేహంబులణచు
రమణ కదళీఫలరసాయనమని తొల్లి
మునిజనంబులు జెప్పగ దనరె భువిని.

---

## సప్తమపద్ధతి.

### (లేహ్య ప్రకరణము.)

బిల్వాదిలేహ్యము...

సీ. మంచిలేతవిగాను మారేడుకాయలు
ముప్పది వేళ్ళపై నొప్పచెక్క

సమముగావలసిన జలములలో నిడి
యష్టావశేషమౌనట్లుగాను
పాతబెల్లము వేసి పాకమురానిచ్చి
మరిచంబు లద్ది నాగరము మూడు
పలములపిప్పళ్లు పలయుగంబునుచవ్య
మొక్కపలంబును చొక్కమైన
తాళిసపత్రియు తగయష్టి మధుకంబు
ఫలకేసరములు పిప్పలియు చిత్రి
మూల లవంగ మిమ్ముగనొక్క పలమేల
కానుపత్రులుదాచి నసువుమిగిలి
మానుగా కర్షప్రమాణంబు ఒక ద్వి
పలము చూర్ణముజేసి గలిపివేసి

గీ. తేనె తగబోసి సేవించిరేనిపాండు
కామిలాఛర్ది హృదయరోగగ్రహణులు
పీనసారుచి గుల్మము ల్మానజేయు
ధరణి బిల్వాదిలేహ్యాభిధానముగను.

దివ్యమూలాదిలేహ్యము.

సీ. గట్టిఫిరంగిచెక్కలు నూరుపలములు
తెల్లనల్లనియుప్పి నల్లవావి
లియు తెల్లవావిలి నయమైనయులిమిరి
గార నల్లనిబల్సు కారుమునగ
కానుగ నెమలడ్డు ఖదిర చేకొణిదయు
తక్కేడు వరగోగు చొక్కముగను
తోయములిడి యెన్మిదోపాలు దిగగాచి
పాతబెల్లము వేసి పాకముగను
జేసి యెన్మిదిపావు శేర్లు తక్కోలము
ల్చూర్ణంబు మాను వసువును మోడి

కటుకత్రయము చిత్రకంబు త్రిఫలములు
జంతువైరియు చతుర్జాతిములును
జాజికాయలు పస్పు జాపత్రి పెన్నేరు
రాస్న సదాప జీరద్వయములు
షడ్గ్రంధి కోష్టు పుష్కరమూల మొకపావు
శేరులు భల్లాత మారయంగ
పదునాల్గుపలములు పరగచూర్ణముజేసి
బోసియు తేనె కస్తూరమునిది

గీ. కర్షమాత్రంబు వేయు యుషఃకాలమునను
మాపుపూట తదర్ధంబు మానకగొన
వాయువులును సవార్బుద వ్రణము లంఘ్రి
శూలలు గ్రంధి పిటకముల్ షుష్కశూల
లవనిమానును జనులు సత్యమునగొనిన
దివ్యమూలాది లేహ్యంబు దీనిపేరు.

క్షుదాభయాది లేహ్యము.

సీ. పరగవాకుడు నూరు పలములు కరకకా
యలు నూరు నలుతుము జలములోన
నష్టావశేషమా నట్లుగా దిగగాచి
చొప్పడ గుడమందు జొన్పిమరియు
క్వాథంబుననుగల కరకకాయలునూరి
పంచదారయు తేనె పలములారు
కటుకత్రయంబులు కడుమూడుపలములు
కేసరములు యాలకియును దాచి

గీ. నయును వేర్వేర పలమునిడియును లేహ్య
పక్వమునవండి గొనినను పంచగుల్మ
కాస హిక్కలు శ్లేష్మముల్ శ్వాస కాస
లరయ క్షుద్రాభయాదిలేహ్యంబు బ్రిజకు.

కుండల్యాది లేహ్యము.

సీ. ముదురుప్పిచక్క యేబదిపావు శేరులు
సరయవాకుడు నిర్వదై దుపలము
నంతచవ్యంబు ధరామల్క మిరువది
పలములుచిత్రక భార్గీకోల
ము లు వింశతియుదశమూలంబులిరువది
పలములు వేర్వేర బరగగూర్చి
యెనిమిదితూములై దనరునీళ్లను వేసి
యష్టావశేషమా నట్టుగాను
గుడము యేబదిపలా ల్గూర్చి పాక మొనర్చి
పలములిర్వదిగ పిప్పళ్లినాల్గు
పలము తవాక్షీరి బాహ్లీక జాతిత్రి
జాతంబులెల్ల తిసంఖ్య భార్గీ
మరిచ కర్కటక నాగరములు వేర్వేర
మూడుపలాలు చొప్పునను చూర్ణ
మొనరించి భస్మమా నుక్కునుపలమిడి
చల్లనై వెలయు ప్రస్థంబు తేనె
గీ. గలిపిసేవింప పీనస కాసశూల
గ్రహణి హిక్క నిబంధ సంకలితహృద్రయ
రోగ బహుమూత్ర గుల్మాద్యరుచులనడచు
కుండలీయాది లేహ్య మఖండగతిని.

హరిద్రాది లేహ్యము.

సీ. పచ్చిపసుపురసంబు పల్లేరురసమును
యార్ద్రకరసమును యరటికాయ
రసము నరటిగడ్డ రసమును పిల్లిపీ
సర పెద్దగుమ్ముడు సారములును
యిప్పపువ్వురసంబు నొప్పైన టెంకాయ
నీళ్లును కేతకీ నీరములును

కటుకత్రయము చిత్రకంబు త్రిఫలములు
జంతువైరియు చతుర్జాతములును
జాజికాయలు పస్పు జాపత్రి పెన్నేరు
రాస్న సదాప జీరద్వయములు
షడ్గ్రంధి కోష్టు పుష్కరమూల మొకపావు
శేరులు భల్లాత మారయంగ
పదునాల్గుపలములు పరగచూర్ణము జేసి
బోసియు తేనె కర్పూరమునిది

గీ. కర్షమాత్రంబు వేయు యుషఃకాలమునను
మాపుపూట తదర్ధంబు మానకగొన
వాయువులును సవార్బుద వ్రణము లంఘ్రి
శూలలు గ్రంధి పిటకముల్ శుష్కశూల
లవనిమానును జనులు సత్యమునగొనిన
దివ్యమూలాది లేహ్యంబు దీనిపేరు.

క్షుద్రాభయాది లేహ్యము.

సీ. పరగవాకుడు నూరు పలములు కరకకా
యలు నూరు నలుతుము జలములోన
నష్టావశేషమౌ నట్లుగా దిగగాచి
చొప్పడ గుడమందు జొన్పిమరియు
క్వాథంబుననుగల కరకకాయలునూరి
పంచదారయు తేనె పలములారు
కటుకత్రయంబులు కడుమూడుఫలములు
కేసరములు యాలకియును దాచి

గీ. గయును వేశ్వేర పలమునిడియును లేహ్య
పక్వమునవండి గొనినను పంచగుల్మ
కాస హిక్కలు శ్లేష్మముల్ శ్వాస కాస
లరయ క్షుద్రాభయాది లేహ్యంబు బ్రిజకు.

కుండల్యాది లేహ్యము.

సీ. ముదురుప్పిచక్క యేబదిపావు శేరులు
సరయువాకుడు నిర్వదైదుపలము
నంతచవ్యంబు ధరామల్క మిరువది
పలములుచిత్రక భార్గీకోల
ములు వింశతియుదశమూలంబులిరువది
పలములు వేర్వేర బరగగూర్చి
యెనిమిదితూములై దనరుసీళ్లనువేసి
యష్టావశేషమా నట్టుగాను
గుడము యేబదిపలా ల్గూర్చి పాకమొనర్చి
పలములిర్వదిగ పిప్పళ్లనాల్గు
పలము తవాక్షీరి బాహ్లీక జాతిత్రి
జాతంబులెల్ల త్రిసంఖ్య భార్గీ
మరిచ కర్కటక నాగరములు వేర్వేర
మూడుపలాలు చొప్పునను చూర్ణ
మొనరించి భస్మమా నుక్కునుపలమిడి
చల్లనై వెలయు ప్రస్థంబు తేనె

గీ. గలిపిసేవింప పీనస కాసశూల
గ్రహణి హిక్క నిబంధ సంకలితహృదయ
రోగ బహుమూత్ర గుల్మాద్యరుచులనడచు
కుండలీయాదిలేహ్య మఖండగతిని.

హరిద్రాదిలేహ్యము.

సీ. పచ్చిపస్పురసంబు పల్లేరురసమును
యార్ద్రకరసమును యరటికాయ
రసము నరటిగడ్డ రసమును పిల్లిపీ
సర పెద్దగుమ్మడు సారములును
యిప్పపువ్వురసంబు నొప్పైన టెంకాయ
నీళ్లును కేతకీ నీరములును

చెరకురసంబు మంచివిగానుగోవుల
పాలు సమంబుగా బరగ నెనిచి
చవపాలు దిగగాచి నవలబెల్లము వేసి
పాకముగాగ త్రిఫలము లగరు
ముస్త త్రిజాతకములును త్రికటుకము
ద్రాక్షపండ్లను పంచదార తేనె
ఖర్జూరపండ్లను గలిపిపక్వము జేసి
శేరుబండంతగా రేపుమాపు.

సీ. పుచ్చుకున్నను కృచ్ఛ్రములు మూత్రఘర్భ
శుక్లనష్టము మేహము ల్పుష్పరోగ
శోణిత స్రావములుమాను సుఖమొనర్చు
సత్యమగునీ హరిద్రాదిలేహ్యమవని.

---

## అష్టమపద్ధతి.

### (వటుకప్రకరణము.)

యోగరాజగుగ్గులు.

సీ. పంచకోల విళంగ పాఠద్వయ వచ
భార్గ్గి సర్షప జీర బాహ్లికాతి
విష రేణు సామజ కృష్ణ మజామోద మూ
ర్వా మరీచములు చక్రాంగకంబు
సమము త్రిఫలము లెంచను రెండుపాళ్లను
సరియున్నిటికి మహిసాక్షిగూర్చి
ప్రతిపాక మొనరించి ఘృతసంప్లుతంబున
వటుకంబులుగ జేసి వైద్యులెలమి

సీ. మధువుతో నిడ పంచగుల్మగ్రహణులు
సర్వవాతాగ్నిమాంద్య కృచ్ఛ్రవ్రణమ్ము

లరుచి హృద్రోగ కుష్ఠ మేహంబులణచు
కలితమగా యోగరాజ గుగ్గులుధరిత్రి.

తాళీసవటుకములు.

సీ. తాళీసపత్రి నిర్దుష్ట చవ్యమును మిరి
యాలు మూడుపలంబు లసురమోడి
పలములు రెండు పిప్పళ్లు పలద్వితయంబును మూడు పలంబు శుంఠి
ఘనచతుర్జాతముల్ కర్షాంశములు పట్టి
వేళ్లు కర్షంబును వేసి చూర్ణ
మొనరించి త్రిగుణాంశ మొప్ప గుడంబిడ
వటుకంబులుగ జేసి వాతవృద్ధి
గీ. గ్రహణులకు శ్లేష్మములకును కాసపాండు
శోథ సన్తాపములకును శుభము దనర
మానుగానివ్వ గుణమగు మానవులకు
పటుతరంబై న తాళీసవటుకములను.

శంఖక్షారవటుకలు.

సీ. చింతబెరళ్ల భసిత మైదుపలములు
పంచ లవణములు పలము పలము
చూర్ణంబుగా నూరి శుద్ధజంబీర ర
సప్రస్థ యుగమును శంఖభస్మ
మదిదశ పలములు సమువుగా నొనరించి
యేడు దినంబులు నెండలోన
నుంచి యింకిన వెన్క వ్యోషంబు నింగువ
పల యుగళంబును పాదరసము
విషము గంధకమును వేర్వేరుగా శుద్ధ
పలము గూర్చియు నిమ్మపండ్ల రసము
తో మూడు దినములు తోరంబుగా నూరి
బదరీ ప్రమాణంబు వటుకములను

గీ. ఉష్ణజలమున ప్రొద్దున నొకటిగొనిన
ఘోరశూల లజీర్ణముల్ గుల్మములును
మహిత పరిణామయంబులు మానుశంఖ
భస్మ వటుకంబులనగను బరగుధాత్రి.

శంఖ వటుకములు.

సీ. చిత్రమూలము నెల్లి జిల్లేడు కానుగ
భల్లాతములు నాగ బరగుపంచ
వహ్ని సౌజ్జద్దీప్య వచ పంచలవణముల్
క్షారద్వయంబును సామజకణ
పంచకోలంబులు బాహ్లీకములు సమాం
శలుగ శమ్యాక చించా పలాశ
తిలభవక్షారముల్ దెలియ నర్ధాంశము
సమముగా శంఖభస్మము తదర్ధ
ముగను విశంగముల్దగ తదర్ధము దంతి
బీజముల్ సమము సంప్రీతినాలు
గవపాలుగూర్చి త్రికటుకార్ద్రి జంబీర
శిగ్రుసూరణ పూతి యుగ్మకముల
గలిజేసి రసమున గట్టిగా ప్రతిరోజు
మర్దించి బదరీసమానమాన
ముగ గుటికలు జేసి తగ నుష్ణజలమున
నార్ద్రికంబున వావి లాకురసము

గీ. తోటియిచ్చిన వేగమె తొలగు మేహ
పైత్యవాత భవానాహ పటలముదర
ములును విపులాగ్ని మాంద్యము లబలితమైన
గదలు నీశంఖవటుక సంగతిని భువిని.

# నవమపద్ధతి.

## (చూర్ణప్రకరణము.)

### లవంగాదిచూర్ణము.

సీ. కరగ లవంగముల్ పాలును నాగకే
సరములు రెండుపాళ్లరయ యేల
కులు మూడుపాళ్లు త్రిఫలములు పదియూరు
పాళ్లు మరీచము ల్పాళ్లుపదియు
ముప్పదిరెండు పాళ్లొప్పను శొంఠియు
నరువదినాల్గుపాళ్లశ్వగంధి
నన్నిటితో సమం బగునట్లు శర్కర
గలిపి తేనెను నేత నెలమిగుటిక

గీ. లమరఁగాజేసి వెన్నతోనైన యుష్ణ
ధారలతోనైన పాండుసంతాప కాస
యక్ష్మ లణచును జనులకు తక్షణమున
నీలవంగాది చూర్ణంబు నోలిగ్రోల

### తాళిసచూర్ణము.

సీ. మఱియు తాళిసపత్రి మరిచనాగరకణ
ములు తవాక్షీరియు నెలయుభాగ
వృద్ధి దాచినయేల కిద్దర నద్ధభా
గంబునకా చూర్ణముగా నొనర్చి
యిరువదినాల్గుపాళ్లరయ శర్కరగూర్చి
గ్రోలిన రొప్పుదగ్గులును ఛర్ది
లరుచియు హృదయ రోగానల పార్శ్వశూ
లలును జ్వరంబు శోఫలనడంచు

గీ. ఇదియె తాళిసచూర్ణమా నెలమి ప్రత్తి
విత్తు లేలకి పిప్పళ్లు సత్తు పంచ

కార్పాసకీకసచూర్ణము.

చాల నాగ్గుసు రెండును త్రయమువాసు
పదిట్లకై నైదుభాగము లుక్కదురుగాను
యివ్వగా మేహాచక్షుల నెల్లద్రుంచు
చూడ కార్పాసకీకస చూర్ణమవని.

అవిపత్తికచూర్ణము.

మ. ఉసిరికపప్ప సోలకలు వ్యోషపిళంగము గంధముస్త లిం
పెసగినపన్ని చూర్ణములు నేకము జేసి త్రిభాగ త్రివృత్త
బు సమము పంచదార యిడిపుచ్చుకొనం గుదజాంకురంబు
ల్పైపవ కసర్గిమాంద్యవిషజక్షయక్షీ యవిపత్య చూర్ణమై
కొనక కడచించు పైత్యముల గుల్మరుజంబుల వాతసంతతిన్.

షట్పలగంధకచూర్ణము...

సీ. శుద్ధగంధకము ప్రసిద్ధిగా బుతుపలం
బులు చిత్రతండులంబులును శొంఠి
కరక యుసిరికతాడి కణ మరీచంబులు
పస్పిప్ప మొక్కొక్క టున్న గాను
చిత్రమూలము పావుశేరును చూర్ణంబు
గానూరి శర్కర గలపి యొక్క
నిష్కమైనను రెండు నిష్కంబులైనను
గొనిన దీర్ఘాయువు కుంజరేంద్ర

గీ. సత్వము పగలుచుక్కల సక్తినిగాంచు
దృష్టికల్గును మూత్రపురీషములును
ఘనల ఘల్బంబు బంగారమగును దీని
చూడ షట్పల గంధక చూర్ణమనని.

ఖర్జూరాదిచూర్ణము.

సీ. ఖర్జూర ముసిరిక కాయలలోపలి
విత్తులు కొత్తిమిర పిస్తనములు

దోసవిత్తులును మషూకచందనములు
కిణము శిలాజిత్తు గట్టిరేల
కలును పాషాణము గూప్పుచూర్ణము పంచ
దార వేసియు యష్టివాంత్రోట్ర
తగవుచ్చుకొన లింగదాహంబువస్తిదా
హాము మహాశ్మరియు మేహంబుశుక్ల
జంబును గుదవక్షణంబు శూలహారంబు
శుద్ధసత్వంబు ఖజూరచూర్ణ
అష్టచూర్ణము.

క. మునగు కటుకత్రయుం బజామోదజీర
యుగళ సైంధవములు సమంబుగను హింగు
కినిమిదోపాలుగా చూర్ణమెలమిజేసి
ప్రథమకబళంబునేతిలో భక్షణంబు
జేయ గుల్మాగ్ని మాంద్యముల్ జెరచునిదియె
యష్టచూర్ణంబటంచని రార్యులిలను.

---

## దశమపద్ధతి.

### (తైలప్రకరణము)

౧ హస్తికర్ణతైలము.

సీ. ఊరయసమూలంబు హస్తికర్ణంబశ్వ
గంధి ముత్తువపులగంబు భీరు
భద్రిముస్తలు సమభాగము ల్వాలసిన
నీట కషాయంబు నిలువనెనిమి
దవపాలుగాచియు తగనందు తైలంబు
చొక్కపుమేకపాలొక్క సమము

గాఁబోసి మధుకంబు కటుకరోహిణి చంద
నములు లవంగము ల్నఖములేల
కలును మంజిష్ఠ తక్కోలరేణుకలును
దుంపరాష్నయుచాగ దుంపసరళ
దారు ద్వితీయచందనము విష్ణుక్రాంత
సౌరాష్ట్రనాగకేసరయుసిరిక
వరలవంగపుచక్క సరెచూర్ణమొనరించి
దధిమస్తుతోఁగూర్చి తైలమునకు
వేసిపాకముజేసి పిండిన తైలంబు
మానవులకు మేన మర్దనంబు

గీ. జేసిరేనియు కాయంబుచక్కజేయు
జ్వరము లాహికభవములు దురితవిషము
ములుహరించును ధాతువు ల్గలుగజేయు
హస్తికర్ణమహాతైల మవనిలోన.

ముష్టితైలము.

సీ. విషముష్టిపండ్లలో వెలయుగుజ్జును ప్రస్థ
ములురెండు జిల్లేడు మునగరేగు
పత్రములరసంబు ప్రస్థమేకైకంబు
యుమ్మెత్తవావిలి యుల్మిగాకు
జెముడు చింతయు దిరిసెనము తక్కెడులును
సురసాశ్వగంధ చుంచుప్రునునాద్రి
కము వరగోగు నిక్కపురసంబునుదీసి
యొక్కొక్కప్రస్థంబు చొక్కముగ
యాముదంబునుపాలు మాజ్యమొక్కొక ప్రస్థ
ప్రస్థద్వయంబుగా వరగనూనె
కలిపియు ముసిడివిత్తులు రేండునూనికల్
కల్కంబు కణలవంగంబులకును

సకళయష్టిమధూక చందనలాలనీ
సైంధవకణ్ణిషసర్షప కచోర
చిత్రకనఖరాస్న చెలువుమీఱగజేర్చి
వండినతైలం బవశ్యనస్య
గీ. లేపనముసేయ గదలను బాపుమిగుల
భుజగతిమిరాది వాతముల్బొలసిపోను
పక్షపక్షాసిలంబుల పరగనడచు
ధారుణీస్థలి విషముష్టితైలమనగ.

నవనాథసిద్ధతైలము.

సీ. ఆముదతెక్కుడు లష్టసరంబును
జిల్లేడు మోచన సింధువార
లాకుజెముడుమెత్త వావడు వేళ్లువిం
శతిపలంబులులెక్క జలములనిడి
క్వాథంబుగా నాలుగవపాలు దిగగాచి
ఆముదమును నూనె యాజ్యమాక
పాయూన రెండు ప్రస్థంబులు మేకపా
ల్ప్రస్థార్థముగ కలిపాలతోటి
సమముగా నుంచి పక్వముజేసి తొల్లిటి
తొమ్మిదివేళ్ల రసమ్ముదీసి
కుడపంబు కుడపంబు గూర్చిపాక మొనర్చి
లశునవిళంగముల్ రాస్నకోష్టు
సైంధవ నాగర సర్షపచందన
వాలుకత్రిఫలేష్టి వచకచోర
పద్మకాగరుముస్త పలమానములుగొని
చూర్ణమొనర్చి నిస్తులతకల్క.
గీ. ముగను కలియంగ జోసి నేర్పుననువండి
దించి నరులకు నివ్వ ప్రపంచముననను

చెలువు దనరును నవనాథసిద్ధతైల
మిదియె గదలును మొదలంట గడుము హాహా.

అర్కక్షీరతైలము.

క. మేకలపాల్వావిలి చిం
తాకు రసంబులును తైల మర్కక్షీరం
బేకత పక్వ మొనర్చిన
చో కనుకు నశీతవాత జార్తులు ధరలోన్

మహాశ్యామతైలము.

సీ. విషముష్టిగానను వేరొక్క ముసిణియు
తరువు గల్లును గాన దానిపండ్లు
కలిగుజ్జు రుద్రసంఖ్య ఘృతంబు తైలమే
కాంశగా గూర్చి వాతార్కతైల
మొకపాలు క్షీరంబు లొప్పగా రెంటను
జంబీర రసము నిజంబు గాను
రొకపాలు వావిలి రొప్పు గోపతెరంబు
జల్లేడు యుమ్మెత్త పిల్లిపెసర
యు గలిజేరు తులసి యుగమును యుచ్చిత
దిరిసెనల్ తక్కెసు తిప్పకుండ
వియుగము కాకమాచియు జుబిలిక లెన్న
చేకొండ్ర పెన్నేరు చింత నేల
గుంటగల్గర నేల గొల్మిడి పల్లేరు
అల్ల మడవికంద లమర కాంచ
నము చాతరాసి యులిమిడి దుష్టుపు బలు
రక్కసి బందేసు రమ్యమైన
తిక్తకోశాత కీదీప్య చిత్రకములు
మంగబొద్దియు తేలుమణియు చేసి
సార పసుపురసంబు వరుస నొక్కొక్కపాలు
ఆది భాండంబున నమర జేర్చి

త్రిఫల త్రిజాతక త్రికటుకంబులు మోడి
కొతిమల్లి చెంగలి కోష్టురాస్న
వాయువిళంగములోధ్రయుంబు చందన
ద్వయ చిత్రమూల చవ్యము కచోర
వట్టివేళ్లు పసుపు లవంగము ల్కురువేరు
తక్కోల మాంసి ముస్థావరాస్న
ములు జీర జాజికాయలు మానుపసుపును
జాపత్రి చిరుబొద్ది సమముగాను
తగ చూర్ణమొనరించి తైలంబునకు నెన్మి
దవపాలు వేసి మోదముసగాచి
కరపక్వమున దించి నిరుపమంబుగు కొత్త
కోకనుబిండి జేర్చ్కొన్న తైల
మరయ ధాన్యపుటంబు నరునది దినములు
నిలిపి వస్తియు నస్యములు తలంట
నధికమర్దన లేప నాదుల నిత్యంబు
సర్వాంగ వస్తియు జరుప నెలమి
పక్షఘాతంబు తిమిర సర్వాంగరక్త
కంప మండల వామన కాళ్మకాది
వాయువులు మానుజనులకు వన్నెకెక్కు
ధాత్రిలోన మహాశ్యామ తైలమహహా.

కేతకీతైలము.

సీ. సురదారు తగరుకోష్టువులు పెన్నేరును
మాంసిముస్తలు గంధ మధుకములును
జీరచతుర్జాత సింహ మంజిష్టలు
బర్బరిపుష్పము ల్పసపు లోహ
కస్తూరి సురిక్కులు కల్వగడ్డలు రేణు
కలును ముత్తవపులగంబు పిల్లి

పీసవులును వట్టివేళ్లును కురువేరు
సమముగాగ మొగలి చంద్రరసము
గీ. నూనె పాలును సమముగా ఫూసి కాచి
నట్టి తైలము శోణితాంశహానమారు
తములు మాన్పును జనులకు ధాత్రిలోని
ధానమనజను కేతకీతైలమనగ.

మహాపూతికాదితైలము.

సీ. దశమూలములును చిత్రకబలా రాస్నలు
గొల్మిడి యుప్పి నిర్గుండి యనగ
వేళ్లగజ్జెరను పెన్నేరు యుమ్మెత్త
కలబంద నాగయు గంటుభార్గి
యామునపాకు చవ్యము శొంఠి తక్కోలము
వసయును సరివెక్క వాటితోడ
నెమలడుగు కానుగు సమముగా వేసి క
షాయ మిట్టావ శేషంబుగాను
ప్రస్థమాత్రంబు యేర్పడగాచి యవమాష
వర కుళుద్ధక షాయవారి యొక్క
ప్రస్థంబు నాలుగోపాలు నూనెయు గోవు
పాలును నూనెతో పాటుబోసి
యావాలు మహిసాక్షి దేవదారును రాస్న
కటుకత్రయము విళంగంబు హింగు
కోష్టు శిలలము మంజిష్ట చాతుర్జాతి
తగరంబు చిరిబోద్ది దశర మధుక
శారిబ కుంకుమ చందనద్వయము క
స్తూరి సదాప కచోరముస్థ
మాంసియు జీవంతి మానుపసుపును పసుపు
నల్లబోళములు చూర్ణములు జేసి

తైలషష్టాంశము తగ వేసి కాచి నూ
తన వస్త్రమున బిండి జనులకొసగ
గీ. నాక్షయవాతంబు వాత వాతార్దితంబు
బాహ్యాయామ శిరోవాత పంగువాత
హర మొనర్చు మహాపూతికాదితైల
మనుచు నాత్రేయ మునిచే వినగబడియె.

అశ్వాసాంతము.

ఉ. దివ్యతర ప్రభావ యదితీసుత మస్కరిరాజ వర్గసం
స్తవ్య యహార శౌర్య గిరిధైర్య దశానన నందనాసుహృ
ద్భవ్య కరాంబుజాత పరిపంథి నిషూదన యుజ్జ్వలత్ప్రభా
హవ్య వహాసు మోద మిథిలాత్మ భవాశ్రయమాన మానసా.

క. పటుతర నిజసేవక సం
కటహర కుటిలాసురేంద్ర గర్వమహీ భృ
త్పటలాశని హర్షాత్మో
ద్భటభీషణ కువలయ ప్రభాయుతనయనా.

పంచచామరం. సురాసురార్చి తాంఘ్రిపద్మ సుందరారుణప్రభా
కరాతటిత్స మానవాల ఖండితోగ్ర రాక్షసా
పురారివీర్య సంభవా ప్రబోధనీయ సద్గుణా
చరాచరాత్మ కాత్మతోయ జాతమిత్ర ఖాదనా

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధకవిత్వవిరాజతుల్జారుశరభరాజ
ప్రణీతంబైన శరభరాజీయం బను వైద్యశాస్త్రంబునందు ఘృత
పద్ధతియు రసాయనపద్ధతియు లేహ్యపద్ధతియు వటుకపద్ధ
తియు చూర్ణపద్ధతియు తైలపద్ధతియు ననుపద్ధ
తులు గల ద్వితీయాశ్వాసము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

# శ ర భ రా జీ య ము.

—:0:—

## తృతీయాశ్వాసము.

క. శ్రీమత్తురంగ శతసమ
ధామ మహాశ్రీక కలుష దైత్యానిలభో
క్త్రేయసుపతింగాధిప ని
త్యాయుల దివ్యప్రతాప హానుమద్రూపా.

వాతరోగనామములు.

క. సరోగము వాయువుచే
ప్రేరితమై నరుల బాధ బెట్టును శాస్త్రో
ద్ధారు లవి విడిచి తక్కిన
వారంభము జేసి చెప్పి రాగ్రంథములన్.

క. ఎనుబది వాయువులకు గల
ఘనగుణములు నౌషధములు గావించితిమీ
రెను కంపమునను సుజనులు
గనుగొను డాచంద్రతార కాఖ్యయుతముగన్.

క. కొందరు యీవాయువులకు
పొందించిరి సమస్తగదలు భూరితరముగా
నందులు గుణములు జెప్పిరి
యందువిమర్శించి యిచట నభివర్ణింతున్.

సీ. పక్షఘాతంబును పార్శ్వవాతంబును
యనసూర్ధ్వ వాత మర్ధాంగ వాత
మును శిరోవాతంబు ఘనకంపవాతంబు
వాత మూరుస్తంభ వాత మూర్ధ్న
వాతంబు కిక్కసవాతంబు క్షీణవా
తంబును సాధ్యవాతంబు కంఠ

వాతంబు తిమ్మిరి వాతంబు కఫనామ
వాతంబుఘనవధను శ్వాతకాక
గీ. వాతములు శీతవాతంబు ఖ్యాతినయన
వాతమును గర్భవాతంబు వదనవాత
మవయవాంగక వాతంబు నాశ్యవాత
ఘ్రాణ వాతంబు జిహ్వాంగకములు మరియు.
సీ. నరవాతమును చర్మ నామవాతంబును
సూతివాతంబును మూత్రబద్ధ
వాతంబు మలబద్ధవాతంబు గుల్మవా
తంబును ధూమవాతంబు శుక్ల
వాతంబు పాంశుక వాతంబు నంగుళీ
వాతంబు నుః సంధివాత గృధ్ర
వాత నష్టేంద్రియ పాదుక వాత జం
ఘావాత కటివాత క్షుద్రవాత
గీ. పంగు మారుత శిఖివాత భవ్యసుప్త
వాతములు కోష్ఠవాతంబు వస్తివాత
దండవాతా తపంబులు మందవాత
మును విలోమానులోమముల్ఘనత నొప్పు.
సీ. ధరణి విధూత వాత స్కంధ వాతముల్
కంధరవాత మే కాంగవాత
క్షుతము శృంఖళము విస్ఫోట వాతంబులు
స్నాయుక వాతంబు స్వరవిహీన
వాతంబు బాహుకంపంబును భోగవా
తంబును యుదరవాతంబు శుష్క
వాతం బజీర్ణాఖ్య వాతం బనగ నొప్పు
రక్తవాతంబును రమణఖంజ
గీ. వాత కలవాత సుస్థానవాత గుల్ఫ
వాతములు జానువాతాస్థివాత భ్రమణ

వాత వసవాతములు దధి వాతకర్ణ
వాత మున్మాద వాతాఖ్య వాత మజ్జ
వాతక్షతవాతము లన నెన్బదియు గలవు

పక్షఘాతవాతనిదానము...

క. సగము శరీరమునందున
మిగిలిన కష్టమును శూలమెలగి విరోధం
బుగ నొక నేత్రంబుండిన
నగణితగతి పక్షఘాతమను వాయువగున్.

క. దీనికి జ్వరమున్ గలిగిన
మానవులన్ బ్రతుకనివదు మహిని నసాధ్యం
బౌను రస కర్పూరంబున
మానును వైద్యులసమాన మతి నొసగంగన్...

వాతస్మరఘాలానలరసము.

సీ. రస గంధకంబులు వసనాభి టంకణ
కణమరీచంబులు కరకతాడి
యుసిరికపప్పులు నుమ్మెత్త విత్తులు
సరిగతుమికిచక్క సారమునను
వెలిచండగల్గర వెల్లుముల్కలు బ్రహ్మ
మేడి నల్ల మూడుదినము
లిమ్ముగా మర్దించి యెలమి వాలుకయంత్ర
మున గాజుకుప్పెలోనను ద్వియామ
ములు వండి సాంగశీతలమున దీసి సూ
కర ఛాగపిత్తముల్గల్పి రెండు
గీ. దినములు మర్థించియును ఫలత్రితయకటుక
సంభవక్వాథమున గొన జనులకవని
పక్షఘాతాభితంబగు పవనమూడు
వాతములుమాను ముదమున వైద్యులొసగ
నిరుపమ స్మరఘాలానలరసమవని.

పార్శ్వవాతనిదానము...

క. ఒకకన్నును యొకకర్ణము
పరికటితమగు శిరమునొచ్చి భ్రమగల్గియు మే
నకలంక శీతమైనను
నకుటిలమగు పార్శ్వవాతము సంబంధముగన్.

క. తెలియగ నిదియు నసాధ్యం
• బిలవాతగజాంకుశంబు నిచ్చిన భిషజుల్
యలవడిన మానునించుక
బలువైన నశీతివాత పటలములోనన్.

ఊర్ధ్వవాతము

క. ఆకలిలేకను శ్వాసో
ద్రేకంబులు కానగల్గి తెలియు నసాధ్యం
బై కనపడి మలబద్ధక
మై కడునొప్పినను యూర్ధ్వ మారుతమరయన్.

వాతారిరసము.

సీ. పారద గంధకం బారుపాళ్లు సమర్చి
కడుగుగ్గులును చిత్రికంబు లైదు
పాళ్లు నాముదమున బాగుగామర్దించి
మరినేలముల్కయు మంచిముల్క
దేవదారును పొన్న దెలియగచూర్ణము
ల్మొదటి యౌషధతుల్యముగను గూర్చి
గుళికలుగా జేసి కోవిదు లేరండ
తైలంబుననుజేర్చి తగనొసంగ

గీ. వరవిరేచనమగు నూర్ధ్వవాతమడగు
శ్వాసకాసలు గుణమగుసత్వమొప్పు
భోజనంబున్నవస్తువుల్పుచ్చుకొనగ
వసుధలోపల వాతారిరసము వెలయు.

అర్ధాంగవాతము.

క. మేనునగంబును నొచ్చిన
నా నిజమర్ధాంగవాతి మదియునసాధ్యం
బైనను కర్పూరమునన్
మానును మహిమానసుండు మహిలో వెలియన్.

శిరోవాతము.

క. తలనొప్పి రోమకంపము
గలగ శిరోవాతముగ కరమిందిసాధ్యం
బిల రసకర్పూరంబున
నలవడ కాలాగ్నిరుద్ర మైనను సరగన్.

కాలాగ్నిరుద్రరసము.

సీ. బలిరసనాభదీప్యములు నవ్యక్షార
మును యవక్షారాగ్ని మూలజీర
సైంధవ త్రిఫలముల్ సౌవర్చము విళంగ
కటుకత్రియము వెలిగారమొక్క
యెత్తుగా విషముష్టి విత్తులు సర్వస
మంబులు నొనగూర్చి నింబసార
మున నొకదినమున నను వుగా మధియించి
మరిచముపగిదిగా మాత్రలమర

గీ. జేసియిచ్చిన వేగ నశీతవాత
ములును మందాగ్ని గ్రహణులు గుల్మములును
మాను కాలాగ్నిరుద్రాభిధానరసము
పూజ్యపాదోదితంబన పొలుపుగాంచె.

కంపవాతము.

క. కరయుగ చరణయుగంబులు
నరములు కంపంబు మేనునంది భ్రమణం
బు రహిం నిద్దుర బుట్టను
నరయగ నిది కంపవాతమగు సాధ్యమిలన్.

వ. దీనికిని జయపాలవర్తుల నిచ్చెది.

ఊరువాతము.

క. ఊరువుల్లోపలఁగలిగియుండిన
ఘోరంబగు శూలఁగల్గ గురుతరకంపం
బారయ కల్గి నసాధ్యపు
మారుత మిదియూరువాతమై జనుజగతిన్.

ఊరుస్తంభవాతము

క. గుదమును పదములు మేఢ్రము
వదలకశూలించు రక్తవాంతియుఁ గన్బుం
పొడసిన నపుల కసాధ్యం
బది యూరుస్తంభవాతమున జనుధరణిన్.

వ. ఊరువాతోరుస్తంభవాతములకు రసకర్పూర మొసఁగవలయును

వాతగజాంకుశము

క. రసమును విషతిందుకబలు
లసమకటుత్రయ ఫలత్రయంబులు సరిగా
వెస నూరి గుంజ యెత్తిడ
గ సమిత్త గజాంకుశంబు కనుపడినయ్యెన్.

ఆమ్లవాతము.

క. పులితేపులు బరపడఁగా
బలితపు మందాగ్ని శూల బహుతరగతులం
దలకించి బసను వెళ్లిన
నిల దెలియుము నామ్లవాత మిది సాధ్యమగున్.

క. మందాగ్ని కుమారము విష
తిందుక తైలంబులను నతిత్వరగతి వై
ద్యేంద్రుడు లొసంగిన గుణమగు
నిందుకళాధరుని కరుణ నిలజనములకున్.

మందాగ్నికుమారము

మత్తకోకిల. పారదంబును గంధకమ్ పదిపాళ్లు నాభిరసార్థమిం
పారగా నిడి హంసపాదిని వంట నొక్కదినంబునన్
నూరి తోడనె కెంద్రిసమున నూరి యార్చిన మాత్రలిం
పార కుప్పెను బెట్టి సైకతయంత్రమున పద్యామముల్
చారుగతి పక్వంబు జేసి దినంబు తొల్లిటిరీతిగా
కోలెసీనచూర్ణ మింపుగ గుంజమాత్ర మొసంగినన్
ఘోరసన్నిప శ్వాసకాసలు గూర్చు పాండుక్షయగదల్
మాకినలెమందాగ్ని నామకుమార మార్చునువాయువుల్

కిక్కసవాతము.

క. నసుమున నొప్పులు బుట్టుచు
వడిశూలదనర్చి పాద వనజములు శిరం
బుమగక నవరోధించిన
కడు కిక్కసవాతమెన్న కష్టతరంబా.

వ. దీనికి రసకర్పూరమిచ్చేది.

క్షీణవాతము.

క. తలనొప్పి దేహశూలయు
బలువై వడి నేత్రశూల బరికింపంగా
దలపగ నిద్దుర లేకను
యలసినచో క్షీణవాత మనజనవనిన్.

వ. ఇందుకు రక్తవాత చికిత్స జేయవలయును.

సాధ్యవాతము.

క. చెవుడును తలతిరుగుటయును
యవివేకము కోపకంప మవనిగలిగినన్
వివరింపసాధ్యవాతము
యెవరికిబూనిన నసాధ్యమిదియన నొప్పున్.

వ. ఇందుకు సంధివాత చికిత్స జేయవలయును.

కంఠవాతము.

క. మృతిసేయు కంఠవాతం
బతికంపము రక్తవాంతి యగును ప్రలాపో
ద్ధృత మస్తకఘాతం బగు
చతురుల కైనను యసాధ్య సంగతి నొప్పన్.

వ దీనినుపశమింప జేయుటకు వాతగజాంకుశ మిచ్చేది.

తిమ్మిరివాతము.

క. కరిచర్మము గతి తిమ్మిరి
దొరసియు తాపంబు గల్గి తుది శోష్మంబె
మెరసినను తిమిరివాతము
నరయగ సాధ్యంబు దేననైనగుణమగున్.

వ. ప్రభావతి వటుకములు నల్లకాచాకు రసముతో నారు నెలలు సేవించవలయు.

ప్రభావతివటుకములు...

సీ. రసము రెండుగను దరదమష్టసంఖ్యయు
బాహ్లీక మారును వసయునేపు
పాలతుత్థము రెండు బలియు నెన్మిది కణ
మారు గుగ్గులునేడు హంశలుగను
జేర్చియార్ద్రిక హింగుజీర కషాయాజ్య
ములచేత మథియించి గుళికెలుగను
రేగుబండంతయు బాగుగా నొనరించి
ప్రొద్దుటపూటనుం బుచ్చుకొనిన

గీ మాను నెనుబది వాయువు ల్మహితగుల్మ
చయము లడచును ధాత్రి
లో జనులకరయ వన్నెమీర ప్రభావతి వటుకము లని
సంయమీంద్రులు జెప్పిరి శాస్త్రములను.

కఫవాతము.

ఆ. మేనువాపుగలిగి, మిక్కిలి
స్థూలమైహీనవాచకంబు లూనిజ్వరము

మందాగ్నికుమారరసము

పచ్చకోకిల, పారదంబును గంధకమ్ము పదిపాళ్లు నాభిరసార్ధ మిం
పొసగా నిడి హంసపాదిచె వంట నొక్కదినంబునన్
నూరి తోడనె [illegible] రసమున నూరి యార్చిన మాత్రలి
పార కుప్పెను బెట్టి సైకతయంత్రమున షడ్యామముల్
చారుగతి పక్వంబు జేసి [illegible]షంబు తొల్లిటిరీతిగా
కోసి వేసిన చూర్ణ మింపుగ గుంజమాత్ర మొసంగినన్
ఘోరసన్నిపాత శ్వాసకాసలు గూర్చు పాండుక్షయగదల్
మారిపవె మందాగ్ని నామకుమార మార్చునువాయువుల్

కీళ్ళవాతము.

క. నడుమున నొప్పులు బుట్టుచు
వడిశూలదనర్చి పాద వనజములు శిరం
బుడుగక నవరోధించిన
కడు కీళ్ళవాతమెన్న కష్టతరంబౌ.

వ. దీనికి రసకర్పూరమిచ్చేది.

క్షీణవాతము.

క. తలనొప్పి దేహశూలయు
బలువై వడి నేత్రశూల బరికింపంగా
దలపగ నిద్దుర లేకను
యలసినచో క్షీణవాత మనజనునవనిన్.

వ. ఇందుకు రక్తవాత చికిత్స జేయవలయును.

సాధ్యవాతము.

క. చెవుడును తలతిరుగుటయును
యవివేకము కోమకంప మవనిగలిగినన్
వివరింపసాధ్యవాతము
యెవరికిబూనిన నసాధ్యమిదియుప నొప్పున్.

వ. ఇందుకు సంధివాత చికిత్స జేయవలయును.

కంఠవాతము.

క. మృతిసేయు కంఠవాతం
బతికంపము రక్తవాంతి యగును ప్రలాపో
ద్ధృత మస్తకఘాతం బగు
చతురుల కైనను యసాధ్య సంగతి నొప్పన్.

వ దీనినుపశమింప జేయుటకు వాతగజాంకుశ మిచ్చేది.

తిమ్మిరివాతము.

క. కరిచర్మము గతి తిమ్మిరి
దొరసియు తాపంబు గల్గి తుది శోష్మంబై
మెరసినను తిమిరివాతము
నరయగ సాధ్యంబు దేననైనగుణమగున్

వ. ప్రభావతి పటుకములు నల్లకాచాకు రసముతో నారు నెలలు సేవించవలయు.

ప్రభావతిపటుకములు...

సీ. రసము రెండగను దరదమష్టసంఖ్యయు
బాహ్లీక మారును వసయునేప
పాలతుత్థము రెండు బలియు నెన్మిది కణ
మారు గుగ్గులునేడు హంశలుగను
జేర్చియార్ద్రిక హింగుజీర కషాయాజ్య
ములచేత మథియించి గుళికెలుగను
రేగుబండంతయు బాగుగా నొనరించి
ప్రొద్దుటపూటను బుచ్చుకొనిన

గీ మాను నెనుబది వాయువు ల్మహితగుల్మ
చయము లడచును ధాత్రి
లో జనులకరయ వన్నెమీర ప్రభావతి వటుకము లని
సంయమీంద్రులు జెప్పిరి శాస్త్రములను.

కఫవాతము.

ఆ. మేనువాపుగలిగి, మిక్కిలి
స్థూలమైహీనవాచకంబు లూనిజ్వరము

కడు జనించెనేని కఫవాత మగును వా
తాది రసముతో నటి సగును గుణము.

ధనుర్వాతము.

క. చలనము మందాగ్నియు మూ
ర్ఛలును బ్రలాపంబు మరణ సమయపు చిహ్నా
ల్గలిగి విలుకైత్తి నొంగిన
తెలియ ధనుర్వాత మండ్రు తిరుగ దెవరికిన్.

ధనుర్వాతమునకుసిద్ధక్రియ.

క. ఆముదము పల త్రయమును
గోమూత్రము చిత్రకంబు గురుతర విషముల్
యా మాషంబులు ఘృతమును
ధీమంతులొసంగ మాను తెలియగ ధనువుల్.

అగ్నిచికిత్స.

క. ఆపాద మస్తకాంతో
ద్దీపితమా సంధిసంధి దేశంబుల స
ద్రూపశలాకను రక్షలు
జూప ధనుర్వాత మడగు జూడ జనులకున్.

కాకవాతము.

క. కర చరణంబులు వడకును
పరిభ్రమణమును నేత్ర పంకజములు జె
చ్చర శిరమించుక దిరుగును
వరసాధ్యము ధరణి కాకవాతము దెలియన్.

క. గంధక కల్పంబైనను
బంధురమగు నారికేళ ఫలసారముచే
సింధూరమైన గొనినను
దంధంగా దిదియుగుణము దానగు భువిలోన్.

శీతవాతనిదానము.

క. శీతంబగు నవ యవములు
నేత్రభ్రమణంబు మూర్ఛ నెరితలకతికల్
ఘాతములై యది కుదరదు
శీతంబను వాయు వేమి సేవించినచో.

వ ఇందుకు రసాగ్నికుమార మొసంగవలయును.

నయనవాతము.

క. కన్నుల కంపం బూష్ణం
బెన్నగ శీతలము గలిగనేనియు తీవ్రా
పన్నత తల దిప్పినచో
నెన్నుదు రిది నయనవాత మెలమి ధరిత్రిన్.

వ. ఇందుకు ఫిరంగిచక్కగాని రసకర్పూరముగాని యివ్వవలయును.

గర్భవాతము.

గీ. కడుపు శూలించి తలనొప్పి గలిగి నిద్ర
లేకయుండిన నరులకు లీలనొప్పు
గర్భవాతం బనంగను కాలరుద్ర
రసముతో మాను వేగమె వెసనొసంగ.

ముఖవాతము.

గీ. ఉమ్మి పలుమారు జనుదెంచు నెమ్మొగంబు
గండుగా నుండు దేహంబు కండువైన
కాస గల్గిన ముఖవాత గతియుదీని
మాన్పగా వచ్చు లఘువైన మార్గమునను.

క. తుత్థము మణిశిల రాజా
వర్తము రసభస్మ గగనభస్మంబు శిలా
జిత్తును గుగ్గులు సరిపి
చిత్తు మధు వునిచి తిన హరియించు ముఖగడల్

అవయవాంగవాతము.

గీ. అవయవాంగంబులును నొచ్చు ననుదినంబు
మలము మూత్రంబు దేహంబు మంటలొదవు
నిదుర లేకుండు తల నొచ్చు నిదియుపాలు
నాముదము ద్రావ గుణ మగు నవయవంబు.

పంచవక్త్రరసము.

క. సూతము విషటంకణములు
ఖ్యాతి మరీచంబు కణము గంధకము సరిగా
ధూర్తణమున నూరగ పురా
రాతికృపగా పంచవక్త్రరసమగునవనిగా.

వ. దీనినే జిల్లేడువేళ్ల కషాయమునగాని త్రికటుక రసముతో
గాని యొసంగిన ఆమవాతసన్నిపాతగ్రహణులునివారించును

నాఢ్యవాతము.

క. మేనున గాదలుగట్టును
మానుగ పాదములు చెవులును స్తకతలముల్
జానువులు శూల నొందిన
దానమరుననాఢ్యవాయు ధారుణిలోనగా

ఛండినామకరసము.

సీ. రసకర్పూరంబును వెసనొక్క పాల్గంధ
కము విళంగంబులు ఘనత రెండు
పాళ్ళు యాలకులు లవంగముల్జాజికా
యలును జాపత్రి పిప్పలియు శొంఠి
మిరియాలు నాల్గుపాళ్ల రయగాగుడముతో
మర్దించి ముప్పది మాత్రలుగను
జేసి గోఘృతమున చెలువొప్పనిరుపూట
లొసగిన మాంద్యము లసమమైన

గీ. యాఢ్యవాత సముద్భూతమైన గదలు
మానునిది ఛండినామక మహితరసము

మునుధరాతల మందున్న జనులకొరకు
నీశ్వరుడు జెప్పెధన్వంతరీశ్వరునకు.

ఘ్రాణోత్తరవాతము.

క. పిత్తముచే తల దిరుగును
నెత్తురు ముక్కునను గారు నెరి వేదనలం
తత్తరము నొందు ధర ఘ్రా
ణోత్తరవాతంబు సాధ్యమొప్పను జగతిన్.

ఓషధి.

మత్తకోకిల. నరులుకొందరు మఱియూడల నస్యమైనను నూనె శ
ర్కరయు నాఘ్రాణంబులైనను కల్కమైననుగుడమునా
గరము కోష్టువు తోయమైనను కటువు కర్పూరసారముల్
శిరము లేపముజేసి నస్యము జేయ బాగగు ధారుణిన్.

జిహ్వాంగవాతము.

గీ. రసనబంధించి తృష్ణ జ్వరంబుగలిగి
బధిర మూకత్వములుజెంది బహుళమైన
తాపమొదవిన నీవసు ధాతలమున
ఖ్యాతిమీరంగ జిహ్వాంగ వాతమండ్రు.

గీ. శిరము సూతంబు బలియును శశియు తామ్ర
భస్మమును తోరమగు నిమ్మపండ్ల రసము
నాగవల్లిని మధియించి నయముతోడ
లఘుపుటం బిడి వటుకంబులను నొసంగ.

నరవాతము.

క. మేనున గల నరములకును
పూనికగలనొప్పి గలిగి పొరి బాంధునిభం
బైనను నరవాతం బగు
దీనికి కర్పూర మివ్వ తీవ్రిత గుదురున్.

చర్మవాతము.

క. ఒడలెల్ల బగిలి మంటలు
దొడరి కరాంఘ్రులకు మొదలదోచిన తీపుల్

వడి చర్మనామ వాతం
బుడుగక కర్పూరమివ్వ నుర్విని మానుర్.

వ. మరియు బోడతర రసముచే వాతారిరస మొసంగవలెను

సూతికావాతము.

క. తనువున నర్ధజ్వరమును
ఘనకంపము దాహగుణము గాత్రము గడునై
జనుశోక శోఫ సంతం
బున గల్గిన సూతివాతమును నొప్పభువిన్.

బడబాగ్నిరసము.

సీ. తగ శుద్ధసూతంబు తామ్రి భస్మమును
పాలు గంధక మొకపాలు కటుక
ములు మూడుపాళ్లను వెలయంగ చిత్రమూ
లముపాలు కోష్టుపా లమరగూర్చి
నెమలిచక్కను నూరివిపులంబుగా
రేగుబండ్లంత గుళికలు వెసను జేసి
మినుపకట్టునసైన ఘనమైన వెల్లుల్లి
రసముతో నైనను పరగ తీట

గీ. కోకిసవువేళ్ల రసమైన గురిగముంటి
వెలగచక్క రసంబుతో నిలనొసంగ
సూతికా వాతములు మాను సుదతులకును
విమలబడబాగ్ని రసమని విబుధులెన్న.

మూత్రబద్ధవాతము.

క. మేహమున మేఢ్ర ముడుగక
దాహించును గుదమునొచ్చు తద్ధయుగళముల్
దేహము హృదయము నొచ్చిన
నూహింపగ మూత్రబద్ధ మొప్పను ధరణిన్.

చ. రసము నభంబు లోహమును రాగియు తాళక గంధకంబులున్
విసువక గంటుభార్జీయును విశ్వమునన్ కొత్తిమెర్లు పథ్యముల్

వసయును పెద్దగుమ్మడును వారక పాటియొనర్చి పర్వటీ
రసమున నూరి యిచ్చిన తిరంబుగ మానును మూత్రబద్ధముల్

మలబద్ధవాతము.

క. కొంచెము మూత్రము గట్టిన
యించుక తలనొప్పి మందమెప్పుడు గలుగున్
చంచలత నొందు హృదయము
గాంచగ మలబద్ధవాత గతి భువిలోనన్.

చ. అలయగ మేకపంచితము నందున నుప్పులు కాలగంజవి
త్తులు పెదమాను చెక్కయును దోషహరంబగు గూడపాలవే
ళ్లులునివి నాననిచ్చి చణకాకృతి మాత్రలు చేసి యివ్వగా
మలముబిగించువాయువులు మానును మూడవనాటి కిమ్మహిన్.

గుల్మవాతము.

క. ఎప్పు డజీర్ణంబై కడు
పొప్పగ శూలించు శిరము నొచ్చును కాయం
బుప్పతి తీవులు బుట్టిన
చెప్పుదు రిల గుల్మవాత చేష్టలటంచున్.

మ. మృత సూతంబును తామ్రతాళక శిలల్ మేలైనవిశ్వంబు శో
ధితమౌ గంధక కోష్టుపథ్యములు ఖ్యాతి న్గూర్చి యేకంబున
త్యత చూర్ణంబు బిడారి చూర్ణమును.........

ధూమవాతము.

చ. జ్వరమును తృష్ణవాంతు లతిసారము పిత్తము మూర్ఛ మంటలున్
తిరుగుడు హిక్క గల్గినను దీనికి ధూమ సమాహ్వయంబగున్
చిరతర పంచవక్త్రరస సేవయొనర్చిన నాముదంబునన్
పరగవి మాత్ర చిత్రవచవారి పలత్రయమొక్క మాసమున్
సురభులనేతితో[illegible]నిడగ జూచిన ధూమసమీర ముక్తమౌ.

శుక్లవాతము.

క. అంతరమున శీతము వలి
లంతంతకు శుక్లహీన మగుచుండినచో

వింతయగు శుక్లవాతము
కాంతయు పురుషుండు గాక గనపడునవనిన్.

శుక్లవాతహరభస్మరసము

చ. గగనము లోహభస్మమును గంధకసూతము తామ్రభస్మమున్
సొగసగు నిమ్మపండ్లపులుసున్ యిది నూరియు గాజుకుప్పెలో
తగ సికతాఖ్యయంత్రమున దప్పక నొండి యొసంగ మాను నిం
పగు నిది శుక్లవాతహరభస్మరసంబు మునీంద్రు లెన్నగన్.

సాంకువాతము.

ఉ. ఇంతులు కూడ వేగమున నింద్రియభంగము గల్గి మేను బ
ల్వింతగ చల్లనై చమటబెట్టి యొడంకుచు కాళ్లుచేతులం
తంతకు తీపుబుట్టి వడదాకిన రీతిగ మూర్ఛబోయినం
భ్రాంతిని సాంకువాత మనిబల్కుదు రార్యులు ధారుణీస్థలిన్.

క. వాతారిరస మొసంగిన
వాతగజాంకుశ మొసంగ వడి జబిలిక వే
శ్లాతత రససింధూరము
చేతనులకు నొసగ సాంగ చేష్టలు మానున్.

అంగుళీవాతము.

క. అంగుళములు కుబ్జములై
భంగం బొందియును హస్తపాదంబులు బా
హాంగీకారము లైనను
యంగుళీవాతం బటంచు ననిరి మునీంద్రుల్.

గీ. కణము పాంచాలి చరణసత్వాథమునను
రమణతోడ గజాంకుశ రసమొసంగ
నీరు గొలిమిడి రసమున జీరవేడ్క
నొసగ గుణమౌను నంగుళీ శ్వసన మవని.

సంధివాతము.

గీ. సంధులెల్లను నొచ్చిన సంధివాత
మగును గర్భంబు శూలించు నవయవములు

పీడనొందించు రోగములౌ భృకుటినిక్కు
నురువిలాపంబు బుట్టించు నరులకవని.

సీ. సూతంబు విషము:ను శుద్ధ గంధకమును
హింగుళ కటుక రోహిణియు లోహ
శుల్బా యసంబుల శుద్ధభస్మంబులు
తాళక మణిశిలల్ దగ సమంబు
జిల్లేడు బాలను చెలు:వొప్ప మర్దించి
గురుతుగా తగుగాజుకుప్పెనుంచి
వాలుకా యంత్రాన వడి మూడుఝాములు
యొండి మృద్వగ్నిని యొనరదించి

గీ. గురిజగింజె త్రొసంగిన నరుల కవని
సంధిసంధులు నొచ్చేటి సంధివాత
మపుడు గుణమగు శంకరు కృపనటంచు
యసమశంకర పాదాబ్జరసమనంగ.

గృధ్రవాతము.

చ. భ్రమయును మూర్ఛ తృష్ణ కరపాదవిదాహము వీర్యముక్తముః
జెమటయు శోఫ గల్గినను జెప్పగ గృధ్రపమీరణం బగుః
క్రమమున ద్రాక్ష కేసరము ఖర్జూర యష్టియు పత్రివాలుకం
బమరగ నేలతాడియును యష్టిమధూకము మంచిగంధముః.

గీ. వరుసతంగేడు విత్తులు మొరుడు బంక
సమముగా గూర్చి పిక్కెత్తు జాతి ఫలము
లష్టభాగంబు సిందూర మవనినుంచి
వెన్నతో పుచ్చుకొన్నను వీర్యవృద్ధి.

నష్టేంద్రియవాతము.

క. జను:లుష్ణద్రవ్యంబులు
నవలయము దిన నష్టవీర్యమగును గణింపఁ
గనునందు మేహ మొదవును
గనుకను నష్టేంద్రియ ప్రకంపన మయ్యెః.

వాతాంతకరసం.

సీ. కనకపారద లోహకాంతార్క గగనవై
క్రాంత విద్రుమ తార గంధకములు
తాళకంబు సమంబు దనర ముహూర్తంబు
ఖల్వ మధ్యంబున కడుమర్దించి
చిత్రమూల రసంబుచే చతుర్యామముల్
మర్దించి యాతపమందు శుష్క
మందు కుక్కుటపుటమందు పాకముజేసి
స్వాంగశీతల మగు సర్వచూర్ణ
మునకు సగంబుగా ఘనసూత భస్మంబు
తాళక భస్మంబు తగసమంబు
గా గూర్చి యేడేడు ఘడియలు చిత్రక
నిర్గుండివారుణీ నింబనీర
ములను మర్దించి నిమ్మగ గుంజయెత్తుగ
కణమధు వాజ్య సంకలితముగను
భక్షించినను గాత్రభంగవాతంబును
సూతివాతంబును సుప్త మారు
గీ. తంబు తిమిరంబు పక్షఘాతమును మూర్ఛ
వాతములు బోవుగర్భవహా వంధ్యలకును
నష్టవీర్యంబు గుణమౌను యుష్ణ మణచు
వసుధ వాతాంతకం బను రసముదనరు.

పాదవాతము.

చ. జ్వరమును శూల కంపమును చక్షులు కర్ణయుగంబు గుహ్యముల్
శిరమును జానుజంఘలును సిద్ధముగాగను శూలనొందిన౯
ధర నిది పాదమారుతము తాళకమాక్షిక పథ్యలోహ భా
సుర మృతసూత గంధముల శుద్ధవిషంబును టంకణాగ్నియు౯
తిరముగ నెల్లిచక్కయును తీవ్రితవావిలి ముండియార్ద్రివం
బరయుగ నుంచి నూరి యిడనౌను గుణంబులు పాదవాయువుల్

వ. రసకర్పూరమునుగాని ఫిరంగిచెక్కగాని యొసంగవచ్చును.

జంఘావాతము.

సీ. కనుబొమలును శూల గనుపించి రోమముల్
నిక్కబొడిచియు భయం బక్కజముగ
నొంది మూర్ఛజరింప నొందు జంఘావాత
మనజను దీనికి నౌషధంబు
పరిశుద్ధగంధ నేపాళ హాలాహల
పారద దరదము ల్పరగ సమము
గా గూర్చి చిత్రక క్వాథంబునను నూరి
దినము డోలాయంత్రమునను వండి
గీ. చేపచేదును తెగనూరి చెలువు మెరయ
జెముడుకాడల నొక్కనా డమర నూరి
బోడతర పాకులసంచు తోడ మరిచ
సారముల మాను జంఘాఖ్య మారుతంబు.

కటివాతము.

చ. నడుమున శూలబుట్ట కటినామ సమీరణ మాను హింగుళం
బిడి కటుకత్రయంబు వస యేర్పడ నాభియు మంగచెక్కయుం
సడలక చిత్రమూలపు కషాయమున న్మధియించి డోలనం
బడు ఘనయంత్రమం దునిచి బాగుగ నిచ్చిన మాను ధారుణిన్.

క్షుద్రవాతము.

క. ముక్కున నెత్తురుగారును
హిక్కలు పాండుజ్వరంబు లేప్రొద్దుండుం
మిక్కిలి నసిమిరి గలుగును
చిక్కను నిది క్షుద్రవాత చేష్టలు ధరణిన్.
గీ. మోడి పిప్పళ్లు మైసాక్షి నాణెమైన
హింగుళంబు శిలాజిత్తు లేకముగను
గూర్చి జలమైన మధువైన గుడములైన
గాచి యిడమాను క్షుద్రాశుగంబు భువిని.

### పంగువాంతము.

క. చరణంబుల నడుమను భుజ
కర యుగములు చచ్చుగుణము గనుపించినచో
నరుల కిది పంగువాయువు
జ్వరమొదవిన బ్రతుకనియదు సంయమి నైనన్.
వ. ప్రభావతి వటుకము లివ్వవలయును.

### శిఖివాతము.

క. మేనున మంటలు గల్గియు
మానుగ దాహంబు మూర్ఛ మనుజుల కున్నం
దానికి శిఖివాతం బిది
మానును యొకకొన్ని యెడల స్మరహరు కృపచేన్.
మ. రసభస్మంబును తామ్ర భస్మమును సారంబైన సత్కాంటకీ
రసమం దర్వదియొక్క మారునిచి యారన్నిత్య మెండించి గం
జసమానం బిడ మాను నేత విషమున్ స్వర్ణాఖ్యయా పావకా
రసము న్గాచిన లేపనంబులను మానం బౌ శిఖివాతముల్.

### సుప్తవాతము.

క. కన్నులు మబ్బును గమ్ముచు
కర్ణాంతములందు శోఫ కన్పించియు కం
ఠోన్నతి చెమట జనించిన
నెన్నుదు రిది సుప్తవాత హేతువటంచున్.

### కోష్ఠవాతము.

క. ఆకలి లేకను శోఫా
ద్రేకం బతిసార మొదవి దేహము తెలుపై
కాక చెడి హరిణమూత్రం
బైకనుపట్టినను కోష్ఠవాతం బవసిన్.
సీ. పారదగంధనేపాళదరదములు
నిరిఃషంబును సమం బుర్విగూర్చి

జిల్లేడు వేళ్లను చిత్రమూలపు వేళ్లు
ఘన కషాయంబుగా గాచి నూరి
యామంబు డోలికా యంత్రంబునను బెట్టి
గుంజా ప్రమాణంబు కోష్ఠవాత
మున కివ్వ గుణమగు ఘనసూతి విష నభో
గంధహింగుళ తాళకముల సరిగ

గీ. దినములను రెండు హంసపాదిని మథించి
కుక్కుటంబున పుటమిడి కూర్మమత్స్య
క్రోడ పిత్తంబులను నూరి గుంజ యెత్తు
దనర నొసగిన వస్తివాతంబు మాను

వస్తివాతనిదానము.

క. క్రిగడుపు నొచ్చి యాకలి
దాగలుగక నిద్రలేక తాపం బొదవన్
రోగు లిది వస్తివాత స
మాగమ మని యనిరి భేష జాధీశనకున్.

దండవాతము.

సీ. మేను గుదుబడ్డ మానిసికింబలె
నొచ్చుచు వడిసిదిరివచ్చుచుండు
శూలతంద్రయుపాండు జాలంబుగల్గియు
దండంబువలెనున్న దండవాత
మగును దీనికి నాభి హారవీర్య గంధక
మరిచ నాగరములు వరుససమము
క్షారముల్ లవణముల్ సారార్ద్రికంబున
వెస నూరి గాజుకుప్పెలను జేర్చి

గీ. సరస మృద్వగ్ని చేవండి సాంగశీత
లమున దశమాంశవిషమిడి విమలమైన
గురిజసాటియొసంగిన గుణముసేయు
అర్ద్రికంబున దండవాతాహ్వయంబు

ఆతపవాతము

సీ. కాయంబు బెరయుండ కాక సహించక
కన్నులు తెల్లనై ఘనవికార
ముగ మేను ద్రిప్పిన దగను నాతపవాత
మపని నసాధ్యంబు భవునికైన
పారదచాంద్రాభ్రకము గంధకవస
హింగుళకణములవంగసైంధ
వంబు మోడియు సమత్వంబుగాగొని హంస
పాదిని మర్దించి భవ్యమైన
గీ॥ చూర్ణ మనుపానమున నివ్వ తోర్ణముగను
మాను నాతపవాతంబు మానవులకు
మానకుండిన నిక లేవు మందులవని
వైద్యులూహించి గనుపెట్టవచ్చు వేడ్క.

మందవాతము

సీ. పాండురంబును మూర్ఛ భ్రమయు స్వేదముతంద్ర
వాంతి వికారమ్ము భ్రాంతి దనరి
మందశూలించిన మందవాతంబగు
పారదగంధకాభ్రకము విషము
తామ్ర తీక్షణములు తగహంసపాదిని
మథియించి కుప్పెను బుధులు జేర్చి
సైకతంబునబెట్టి షడ్యామములువండి
మానుగ గురిజెత్తు మాత్ర మినుప
గీ. కట్టుతో నైన వెల్లుల్లిగడ్డ రసము
తోడనైనను ఇచ్చిన దూరమగును.
మందవాతంబు బోవును మానవులకు
సాధ్యమిది దేనినైనను నిశ్చయముగ

విలోమవాతము.

సీ. ఎగరొప్పుతందరహిక్కవాంతియు నేత్ర
శూల చెమ్మటలును చాలగలిగి

లోవంగశ్రీసిన భాషింపగాను వి
లోమవాతము లీపులును జెలంగ
చంపును గంధవిషంబు సూతము మణి
శిలకర్పూరి శుద్ధి జేసితులగ
దంతిబీజంబులు లేగసమంబున బెట్టి
కాళవెల్లిని మూడు వారములును
౧. మర్దనము జేసి నేర్పున మహితమైన
మాత్ర గుంజెత్తొసంగిన మానవులకు
భీమమైబూనిపట్టి విలోమవాత
మణచునని యెను శంకరుండశ్వినులకు

అనులోమవాతము

౨. పాండురంబును ఛర్ది భ్రమయు చెమ్మటమూర్ఛ
ధాతుశోషము నిద్రదనరి శ్వాస
గల్గి వెన్కబడీసి కడుపులోద వెనా
చంపునని దియు నసాధ్యమవని
గగనంబు రసవిష గంధక త్రికటుక
వెలిగార సైంధవం బులును ధూర్త
బీజము లనుమముగా బెట్టి మర్దన జేసి
వజ్రమూసను జేర్చి వాలుకమున
౩. రెండుజాములు వండియుగండుచాప
పిత్తమున నూరి మినుపగింజెత్తొసంగ
మహిని ననులోమవాయువుల్ మాను నరుల
కనుచు బల్కెను శంకరుం డశ్వినులకు

విధూమవాతము.

౪. గాత్రము మంటలుమండు ను
నేత్రంబులు మంటలగును నిరుపమ సంతా
పోత్కటముగ శూలించును
ధాత్రిపధూ మాహ్వయంబు దగిలిన ప్రజకున్

సీ. పారదంబెనిమిది పాళ్ళును విషతిందు
కంబులెనిమిదిపాళ్ళు గానుగూర్చి
గంధకంబును రసక్రమమున నిడి కటు
త్రయమును ధర పలత్రయము వహ్ని
పత్రికీ ముస్తలు వసకోష్ఠు రేణుక
లశ్వగంధియు మోడి హాలహలము
ప్రత్యేక మొక్కొక్క భాగంబు లొనరించి
పాపర వేళ్లను పరగనూరి
గీ. యిరువదియు పైన నాల్గు పాళ్లరయ గుడము
వేసి చణకప్రమాణమై వెలయుమాత్ర
లావునేతను మిర్యాల నమరనివ్వ
నావిధూమంబునడచు వాతారిరసము

స్కంధవాతము.

గీ. కన్నులకు యెండ గనరాదు కంపమొదవు
శిర మొకించుక దిరుగును జ్వరము శూల
కల్గి కంఠంబు నొచ్చిన స్కంధవాత
లక్షణంబులు దెలియుడీ లాక్షణికులు

కంధరవాతము.

గీ. మేనుకుప్పించి శోషించి మిగుల తంద్ర
నిద్ర చిత్తభ్రమంబును నిరతముండి
జ్వరముతృష్ణవికారంబువరుస నొదవు
కంధరాహ్వాయ వాతలక్షణములవని.
సీ. రసమును మణిశిల వసనాభి బలి టంక
ణములును ధూర్తబీజములు సమము
హంసపాది రసంబు ననుమర్దనము జేసి
ప్రమిదెలతోడనే పరగపుటము
నను జేర్చి జెముడుపాలనుమథియించియు
చేపచేదున నూరి సిద్ధమైన

మందొక గుంజాప్రమాణంబొసంగిన
స్కంధవాతంబును కందరాహ్వ
గీ. యంబు మానును కణము గుడంబుతోడ
నింద్రవారుణికా చూర్ణమివ్వ కర్ష
మాత్రి మాను కంధర మారుతంబు
యిలను వైద్యశిఖామణుల్ దెలసియిడగ.

ఏకాంగవాతము.

క. ఒడలెల్ల మంటలుమంటను
కడుపడకను మేనునొచ్చు కంపంబొదవుగ్
కడుపున మలముబిగించును
వడితున్మేకాంగవాత వశమగు గుణముల్.

స్వర్ణారిరసము

సీ. ఇలనసాధ్యంబగు నేకాంగవాతంబు
బలిరెండు భాగము ల్పారదంబు
భాగముల్ పంచౌరెండు భాగముల్మోదుగ
పిత్తులుకడుముష్టి విత్తనములు
కలినిదినత్రయంబుల నానవిచ్చియు
చూర్ణంబుజేసి తచ్చూర్ణమెలమి
తేనెతోడుతగల్పి మానుగామంచికుం
డనుబెట్టి ధాన్యపుటంబులోన
గీ. వేసి మాసార్థమునదీసి బేర్మిరెండు
గురిజ యెత్తిడ నరులకు గుణముసేయు
వసుధలోపల స్వర్ణారి రసముదీన
మాపవచ్చును యెనుబదిమారుతములు.

తృతవాతము.

గీ. కడుపుకొంచంబు బలహీన గుణముతృష్ణ
ఆకలొక్కించుకైనను లేకజ్వరము

తుమ్ములునుగల్గు స్తంభవాతమిమ్మదనరు
మానువాతాంకరసమున మానవులకు.

శృంఖలావాతము.

గీ. పాండుశుష్కంబు నిద్రలేకుండు శిరము
నొచ్చు నెక్కిళ్లు వాంతులు హెచ్చుగల్గు
కణతులల్లుగ మేనున గానబడును
శృంఖలంబను వాతంబు సిద్ధముగను.

సీ. రసము గంధకమును వసనాభి రసమూల్లు
వేకసంబును కడు వేడ్క రెంట
దినములు హంసపాదిని మర్దించియు
గాజుకుప్పెను జేర్చి కుక్కుటంపు
సాంజ్ఞపుటమిడి మత్స్యపుచేదునను నూఁది
రెండు గుంజెలమెత్తు రేపుమాపు
వసకషాయంబున వరగోగు చెక్కను
మిరియాల నేతను వరుసనొసగ
గీ. ఆవుపాలను నన్నంబు నవని నారి
కేళజలపానపథ్యమా క్రియను దెలసి
యివ్వసరులకు గుణముగు హితవుమీర
శృంఖలావాత హరమను సిద్ధరసము.

స్ఫోటవాతము.

క. శిరమును కాయము దిరుగును
బరతెంచును హిక్క నేత్రపద్మద్వయముఁ జా
చిరతరముగ శూలించియు
మరుధన విస్ఫోటమనెడి మారుతగుణముల్.

క. మేనునమంటలు కణతులు
మానుగవిస్ఫోటమనెడి మారుతమయ్యెన్
దీనికిశృంఖలమను వా
తానికి జెప్పినచికిత్స తగసేయవలెన్.

స్నాయుకవాతము.

క. విరిగిన కణతులు గలిగి, శి
రము నేత్రములుశోఫ లేచనవైనకా
ధారుణిస్నాయుకవాతం
బారయ నాథ్యంబు నౌషధాంతరములచేకా

సీ. హరవీర్య భస్మంబు నభ్రకభస్మంబు
తామ్రభస్మంబు మాక్షికంబుగంధ
కంబును కాంతంబు ఘనశిఖి తుత్థంబు
సమముగానమరించి చంద్రచక్ర
చూర్ణంబు నిర్గుండి చూర్ణంబు కల్గర
చూర్ణంబుదగజేసి చూర్ణములను
రెండు మూడునుమూడు దండిగాపావుశే
రులుదూచి వేసియు కలితమైన

గీ. భాండమందుంచి యిరుపూట భక్షణంబు
సేయగాదగు నిష్టార్థ సిద్ధికొరకు
లవణ మామ్లంబు వర్జించి గవిమథితము
బోనమును దిన్న స్నాయుకంబౌనుగుణము.

స్వరవిహీన వాతము.

గీ. కర్ణములు శూలనొందియు కంపమొదవి
గాత్రమెల్లను శుష్కించి గళమునందు
స్వరము హీనంబుగాబల్కు స్వరవిహీన
వాతమని జెప్పుచుండెరు భూతలమున

సీ. గంధకంబును తాళకంబును మణిశిల
ఘనపారదంబునుకలిని నూరి
గుడ్డను బట్టించి గురుతైనవర్తిగా
నమరించి తైలంబు నందు ముంచి
కొన కాల్చజారిన నన్నువైన తైలంబు
పాత్రలోనిడి నెయ్యి పరగగల్పి

తమలపాకునఁగాచి తగభక్షణమునుజేయ
స్వరవిహీనంబును శ్వాసమణచు.

బాహుకంప వాతము.

గీ. దినము రాతిరి దేహికి తీవ్రముగను
హెక్కబాహువునొచ్చియు నిక్కమైన
కంపమొదవిన నది బాహుకంపవాత
మనుచు జెప్పిరి మునులెల్ల నార్యులకును

సీ. ఈ బాహుకంపంబు నెవరికిసాధ్యంబు
గూడపాల సదాప నాగ్నెమైన
కటుకత్రయంబును కషుమధూకము దుంప
రాస్న సైంధవములు రాజితముగ
వినగ రోకటిబండ విత్తులు పావుశే
రేసియు చూర్ణము చేసి మునప
కట్టు నాలుగుశేర్లు కట్టంత నూనెయు
నావులనెయ్యి పదారుశేర్లు

గీ. నూనె దిగగాచి మర్దన మేనజేసి
వెలయగా నుల్వలను బ్రత్తి విత్తనములు
గాచి వార్చిన నీళ్లను గవులపాలు
వన్నె సైంధవముల నూనె వడిముధింప.

క. ఈతాకు మేక పాలును
యాతతముగ గాచి యివ్వ నణగును గదని
వ్వాతంబు బాహు కంపము
చేతను నేడాదిపాటు సేవించినచోన్.

భోగవాతము.

చ. తల కనుదోయి శూల దగి తద్దయు దేహము శోభ నొంది పే
రలసట గల్గి కాయమున నంతట పొట్టునురాలెనేని భూ
వలయమునందు భోగ మను వాయువు దీనికి కాలచుద్రమున్
జలమున చితిరికాంఘ్రుల కషాయమున న్వడి మాను ధారుణిన్.

ఉదరవాతము.

క. ఉదరముశూల శిరోవ్యథ
మది నైనను నిద్రహీన మైనను వాతం
బు దగుఁ యుదరాహ్వాయ
నదహారులు కాదరిరసము కను నోసంగవలెఁ.

శుష్కవాతము.

చ. భ్రమయును మూర్ఛ కంపమును పాంశువు తృష్ణయుపాగ్రతాప
జెమటయుగాత్రశుష్కమును నేతలుదోచినశుష్కవాతమా [ముం
సుమతులు నాథ్యవాతమున సొంపుగ జెప్పిన మందొసంగ నం
దమునగనుమాను శుష్కపుగగంబులు ధారుణి నెంచి చూచినన్.

వ. వాత గజాంకుశమైనను యివ్వవలయును.

అజీర్ణవాతము.

క. అవయవములు గను నొచ్చును
జవసత్వములేక నమర జన్మించినవో
భువిని నజీర్ణం బనియెడి
పవనము రసభస్మమునను బాగగుమగదా.

రక్తవాతము.

క. ఎక్కిళ్లు మూర్ఛ రక్తము
గ్రక్కుట కంపమును జెమట గల్గిన భువిలో
నిక్కముగ రక్తవాతం
బక్కజముగ మాను నరుల కౌషధములచేఁ.

చ. అరయగ శుద్ధిజేసిన విషాభ్రి రసంబు కటుత్రయంబులున్
సరసపు చిత్రమూలపు కషాయము నడ్డసరంబు నిమ్మ భా
స్కర వరపత్రి సారముల చక్కగ మూఁడుదినాలు నూరి చె
చ్చెరనొక యామమాత్రమున సిద్ధిగ డోలికనుంచి తేనె మే
ల్గురిజ సమంబు నివ్వ తగు గొల్మిడినైన కషాయ మిచ్చినన్
ధరణిని రక్తవాతములు తత్క్షణమాత్రను మాను నుద్ధతిన్.

ఖంజావాతము.

సీ. తెలియకే నిద్రలేకను దినమునందు
నిద్రగల్గియు జీర్ణంబు నిరుపమాగ్ని
మాంద్యమును దేహవికలత్వ మమరెనేని
ఖంజవాతంబు దీనికి గలదుమందు.

ఉ. మోడిపిళంగ చిత్రికప్ర మూలము సైంధవ హింగులంబులుగ్
వాక్షిరసంబు గంధకము వారహాలాహల మభ్రకంబులుగ్
నాగపు సస్మ కీచ కణ నాగక వావిలి హంసపాదములగ్
గూడ మథించి యివ్వ జనకోటికి మాన్పును ఖంజవాతముల్.

ఖలవాతము.

క. మొగమును కాయము తెలుపై
దగకన్నులు యెఱ్ఱగించు దనరిన జింహ్వా
ల్పగిలిన నల్పను శూలయు
మగటిమి ఖలవాత సాజ్ఞ మహివిలసిల్లున్.

గీ. తెలియ రేలవేళ్లు తిప్పవేళ్లును నక్త
సరపువేళ్లు గాచు జలములోన
నాముదంబుగల్పి నమున్నగా గొన మాను
ఖలసమీరణంబు దెలియనవని.

స్నానవాతము.

చ. చెమటజనించి మేను నిరసింపుచు నెప్పను శూలగల్గి వి
భ్రమముగ సంధిసంధులను పట్టిన నొచ్చిన స్నానవాతమా
నమటిని గంధసూతములు నన్నిటితో విషమూర్త బీజముల్
సమముగ పంచకోలపు కషాయముతో దివసద్వయంబు సాం
గమున మథించి మూసనిడి గాఢపుటంబున బెట్టి మానుచే
దమరగ నూరి యిచ్చినను యానుగుణంబు మనుష్యజాతికిన్.

గుల్మవాతము.

గీ. మేను పాండురవర్ణంబు బూని కడుపు
మంటనొందుచు తలనొప్పి జంటనేత్రి

శూలయును చీలమండలు వ్రాలనొప్పి
గలిగినను గుల్ఫవాతంబు దెలియుడనని.

వాతగజసింహరసము.

సీ. రసము నిర్విషమును వసనాభి నభ్రముసు
గంధకి మణిశిలల్ కనకమంబు
పర్పటిరసమున బాగుగా మర్దించి
వజ్రమూసను బెట్టి వరుస భూమి
ధరపుటంబిడి తీసి వరఖల్వమున నుంచి
అజశిఖర్షుష పిత్త మమరగల్పి
యామమాత్రం బవార్యంబుగా భావించి
గుంజాప్రమాణంబు గోనిన నవని

గీ. గుల్ఫవాతోద్భవం బైన గుణములెల్ల
మారు నఖలంబు లైనట్టి మారుతములు
నణచు ననుపానములతోడ నాఘ్యలివ్వ
వాతగజసింహమనగ విఖ్యాతిదనరు.

జానువాతము.

క. జానువులు యొండి కంపము
బూనుచు శూలించి మూర్ఛబొందిన వాంతు
ల్దా నమరియుండె నేనియు
జానుసమీరణ మనంగ జనునిది ధాత్రిన్.

వ. వాతగజాంకుశము గాని రసకర్పూరము గాని యివ్వ
వలయును.

హస్తివాతము.

క. చెవుడును కంపము మూర్ఛయు
యవివేకము చెమట దాహ మాకలి యెంపుం
వివరింప గల్గెనేనియు
భువి హస్తిసమీరణంబు బొందదిదేనన్.

గంధకకల్పము.

సీ. త్రిఫలవిడంగమరీచ నాగర కణ
ములు నిష్క షట్కముల్ పలములాఱు
గంధకంబును చిత్రకంబు పలంబును
కృతసమస్తంబుగా ఘృతముపాలు
శీతలోదకముగ గల్పి సేవమొనర్చిన
గుణ మహాను వాయువుల్ కుష్ఠువులును
యతిసార గ్రహణీమందాగ్ని గుల్మంబులు
జ్వరమును దివ్యకుంజరబలంబు

గీ. ఖేచరత్వంబు తనుకాంతి వాచకంబు
లమరు మూత్రపురీషంబు లంటు కల్గ
మిడిన బంగారమగు దీసి నెన్న దరమె
ఘనకషట్పలగంధకకల్పమనగ.

భ్రమణవాతము.

ఉ. కాయము నొండి గుల్మములు గర్భము వాలి వికారరూపమై
వాయువు శీఘ్రమై తగ జ్వరంబును లేకను మూర్ఛ జెందుచో
నేయెడనైన దిగ్గవడ యేపున నీభ్రమణాఖ్య మారుతం
బై యిది యొప్పు గంధము వత్సరముల్ గొనమాను ధారుణిన్.

వ. దీనిని కుందేటి వెఱ్ఱియనిఁ జెప్పుదురు.

విష్ణుపరాక్రమరసము.

సీ. రసబలి టంకణ వసనాభములు సరి
క్షారత్రయంబును సైంధవంబు
తుల్యంబు సర్వంబు దుత్తూరు రసమున
మర్దించి గుళికలు మహినొనర్చి
పరగ కుక్కుటపుట పాకసం బొనరించి
ఖల్వమధ్యంబున ఘనత జేర్చి
మత్స్యసూకర పిత్త మర్దనం బొనరించి
మాష ప్రమాణంబు మాత్రలివ్వ

గీ. సన్నిపాత జ్వరంబులు శ్వాసదోష
మెన్న విపరీత మూర్ఛలు హిక్కకంప
మారుతంబులు తను వపస్మారములును
మాను విష్ణుపరాక్రమ మహితరసము.

వ. గంధక కల్ప మైనను సేవించ వలయును.

వసవాతము.

క. కాయంబు వాచి నిద్దుర
రేయి బవ ల్లేకయుండు రేతోహరణం
బై యుండి శిరమునొచ్చు ని
దేయగు వసవాతమనగ దెలియుడి జనముల్.

వ. వాతరాక్షస మైనను వాతగజాంకుశ మైనను యొసంగ వలయును.

దధివాతము.

గీ. కర్ణయుగ మక్షులును నాసికా యుగంబు
శూల తల్రదిప్ప హిక్కలు చాలగల్గు
ఘోరతరమైన యతిసార గుణము నిండి
వసుధ జనులకు దధియను వాత మొదవు.

గీ. పారదంబును బలియు నేపాళములును
సమముగా చిత్రమూల కషాయమునను
నూరి డోలనువండి సన్నుతులుగాంచు
గురిజమాత్రంబొసంగిన గుణము సేయు.

కర్ణవాతము.

క. శోత్రిద్వయశూల నహో
రాత్రంబులు దుఃఖ మొదవి రమ్యతరంబౌ
గాత్రము జిక్కియు బధిరము
నత్యుత్కటమైన కర్ణవాతము ధరణిన్.

క. ఛాగక్షీరముదరమూ
లాగతక్వాథంబు నూనె నటుగాచియు ను

ద్వేగమె చెవిలో నిడినను
బాగగు కర్ణాఖ్యవాత బధిరము లెల్లన్.

ఉన్మాదవాతము.

క. మేదిని దేహం బెరుగక
వాదించుచు బట్టవిడచి వైచుచు భ్రమసా
పాదన నొందిన నది యు
న్మాదసమీరణ మనంగ మహిలో వెలయున్.

క. దీనికిని పర్పటీరస
మైనను విజయాఖ్య గుళికలైనను యొసగన్
మానును యతివేగంబున
మానుగ నున్మాదనామమారుత మవనిన్

విజయభైరవగుళికలు.

సీ. తాళక రససీస తగర హింగుళములు
మణిశిల త్రిఫలేప్టి మధుకములను
కటుకత్రయమును పర్పటక చతుర్భద్ర
కాకిదొండ యడవి కందనక్క
దోసలు సమముగా దూచి మర్దించిన
మాత్ర బదరుప్రమానముగను
మధువును నేతన మనుజులు ప్రొద్దున
గొనిరేని పైత్యము ల్గుదజములును
గీ. కీకస శ్రావవాత సంకేతములును
ఘనత రోన్మాదములు మూర్ఛలును సమస్త
కామిలలు మహారోగ సంఘముల నడచు
గురుతర విజయభైరవ గుళికలనఘ.

ఆమవాతము.

క. మేనున మూత్రము పాండుర
మై నేత్రయుగంబు పీతమగుచును యుష్ణం

బాని ఘనతృష్ణ ఛర్దివాయు
దా నమరిన నామవాత తత్వోగుణంబుల్.

వ. పంచవక్త్రి రసముసుగాని అమృతతో వాతారిరసముగాని వాడవలయును.

మజ్జావాతము.

క. మేనెల్ల రాచికంపము
బూనుచు హిక్కలును వాంతి బొడమియు శూలా
న్యాసత భ్రమణము జెందిన
దా నగు మజ్జాసమీరతత్వంబవనిన్.

వ. వాతారి రసమైనను వాతగజాంకుశమైన నొసంగవలయును.

క్షుతవాతము.

క. కడుపుబ్బి మూత్ర మించుక
బడుచును కంపంబుశూల బలువగుమంటల్
బొడమిన క్షుతవాతం బను
నుడుగక వాతారిరసము నొసగిన మానున్.

మణుగువాతము.

క. రతిభంగ గాత్ర భంగము
లతిఖేదము గలిగి కంపమైనను ధరలో
సతులమగు మణుగువాతము
గతి తిందుకతైలమునను కడువడిమానున్.

వ. విషతిందుక తైలముగాని గజాంకుశముసుగాని యివ్వవలయును.

విషతిందుకతైలము

సీ. ముసిణి పండ్లరసంబు మొగినొక్క పాలును
నాలుగు పాళ్లార నాళములును

జంబీరఫలముల జలమొక్క పాలును
మునిశివిత్తులచూర్ణము తగనొక్క
పాలాముదంబొక్క పాలును తిలనూనె
పాలొక్కటిడి తైల పక్వముగను
వండి నూతనమైన వస్త్రంబుపై బోసి
వడిచిన తైలంబు వసుధలోన

గీ. నరులకును లేపనముసేయ నగును గుణము
కఫము ధనువు విలోమంబు ఘనతరాస్థి
సంధి సర్వాంగమవిలోమ సంతతాఖ్య
వాతములు వాతశూలలు వదలి దనరు.

క. నరవాతము త్వగ్వాతము
ధరభేదముగాదు క్రమత దగ చెప్పుటచే
పరికింప గర్భముదరము
లరయగ నొక్కటియె గుణము లన్నియుసమమే.

క. ఈయెనుబది గాకను వ్రణ
వాయువును ... ... ...
బాయత్త శిశువాయువు లను
మేయంబున గలవు నాల్గు మేదినిలోనన్.

సీ. శీతవాతం బూరువాత మూరు స్తంభ
వాతమేకాంగాఖ్య వాతకంఠ
వాత ధనుర్వాత పార్శ్వ వాతార్ధాంగ
వాత పక్షాఘాత వాత సాధ్య
వాతార్ధవాతాగ్ని వాతాను లోమాఖ్య
వాతవిలోమ చాజ్ఞాతపాఖ్య
మునుగు వాతంబులు ననగను పదియారు
వాతము ల్మానవు వసుధలోన

గీ. నారుపదులకు పైనినాల్గరయ సాధ్య
మగును తత్తస్థలంబుల నమరజెప్పి

నట్టిదోషధి జాలము బ్బెట్టిరేని
భేషజులు తన్నిదాన విశేషమెరిగి.

జ్వరయుతవాతములు

ఘనతరపాదవాతమును కంధరవాతము కంపవాతముం
వినగ విధూమవాతమును విష్కృతకక్షత్వగస్థివాతముల్
జను రసనాంగమేకభుజ సంధిసమీరణముల్ జ్వరంబులా
నని యనుపానముం దెలసి నట్టుగ వైద్యము సేయగా దగుం

వాయువులకగ్నిశిక్షలు

క. అనులోమవిలోమములకు
కనుబొమ్మలనడుమ చెవుల కడపటనడిమి
వున గొండ్లనడుమ మొదురొ
మ్మున రక్షలు వేయ వాతములుమానునొగిం.

గీ. తనగ రొండ్లను పంగువా తంబునకును
అల ధనుర్వాయువుల కెన్నొనన్ని గీళ్ల
నగును శిశువాయువులకు కళునొబ్బమలనడుమ
పక్కలనురొమ్మునను వేయ బాగు గాంచు.

క. వడిగలయర్ధాంగమునకు
మెడనుమాను స్రంసమునకు మిక్కిలి దవడం
కడుచెవుల గూబమొదలం
దిడి గడ్డముమీద గుంట నిడినగుణమగుం.

క. ఘనతరజిహ్వాస్తంభం
బనుదానికి చెవులకణత లందున ఖంజం
బను వాయువునకు కీళ్లను
మునుకొని మోకాళ్లగుల్ఫ మునకిడగవలెం.

గీ. దనరనరచేతకీలు ముందటికి నైన
వెనుక నైనను రక్షలు వేయవలయు
హస్తవాతంబు మోకాళ్లయందు ఖలశ్వ
సనము మోచేతులకు ముందుగనుచునిడుము

వ. ఇదిగాక దండవాయువునకు వ్రణవాయువునకు యూరు
స్తంభోరువాయువులకు బుట్టినచోటనే రక్షజేయవలయును.

గీ. శరభరాజీయ మనువైద్య శాస్త్రమందు
వాతములు నెన్బదిటగల్గు వరగుణములు
నౌషధంబుల జెప్పగా నయ్యె భువిని
కమల భవవైరి తారకార్కంబుగాగ.

పథ్యములు.

సీ. కాకరకాయ వంకాయలు లేతవి
ములుగ కాయలు మినుములును పండు
గుమ్మడి కస్వింద కొయ్యతోటయు చిర్రి
గజ్జేరు నల్లయుల్వాలను చేదు
పొట్లకాయలు కందమున్లంగి గోధుమల్
తక్కలిపువ్వులు మొక్కలంపు
కాయనూనె కొడిశకాయ దుందిలపు కా
యలు నింగువయు సదాపలును జోడె
గీ. తరము జీరయు తలయంటుటరయ పాత
బియ్యపన్నము జనులకు బెట్టవలయు
వాత రోగాపహములివి వైద్యులెల్ల
దెలసి సౌఖ్యము లివియని దెలుపవలయు.

అపథ్యములు.

సీ. పొర దోసకాయలు సురుగురుత్వ ద్రవ్య
ములును చన్నీళ్లనుములు పెసలును
ఆవాలు వెలగపండ్లడవికందయు క్రొత్త
ధాన్యంబు లుపవాసతతులు వేప
పండ్లను తామరతూండ్లను చాతరా
శాకుకూర కరివేపాకు మట్టు

పైరయు నలసేతి బీరయు కీబీక
దోసంబు గలచేదు దొండకాయ
గీ. లరయమారుత రోగుల కవనిలోన
శత్రువు లటంచు బలికిరి శాస్త్రములను
యశ్వనులు గాన నావిధు లాలకించి
వీటి వైద్యశిఖామణుల్ విడువ వలయు.

---

(పన్నెండవ పద్ధతి)

క. శ్రీలలనా రమణాంఘ్రి వి
శాల కుశేశయమరంద సంగ్రాహమనో
రోలంబ కోమిరె పూడిపు
రీలలితనివేశ వానరేశ మహేశా.
గీ. సన్నిపాతంబునకు ఘోరశమను నకును
భేద మెంతయు లేదు యీపృథ్విలోన
గాన మరిదాని గెల్వగా బూనవలయు
శమన హారభక్తిలెలమి నౌషధముతోటి.
సీ. కడుసూక్ష్మ చపలసంగతిని నాడిదనర్చు
నుష్ణమై శీతమై యుభయమగుచు
నలుపు నెరుపు తెల్పునై దేహమొప్పిన
డంబును నధిక హీనంబుగాను
స్వరము విన్పించిన పరిపీత వర్ణమై
నరుణమై నేత్రంబు లమరియున్న
మల మూత్రము తెల్పు నలుపు నెఱ్ఱగనున్న
మిశ్రమైనను జిహ్వామిళిత మగుచు
గీ. నన్ని వర్ణంబు లమరిన నెన్నగళము
నుదుట చెమటలుబుట్టిన మదముతంద్ర

విగ్రహంబున శిరమున వేదనభ్రమ
జ్వరము మిక్కుటమైనచో సన్నియగును.

సన్నిపాతసాధ్యగుణములు.

సీ. కన్నులుః వికసించు కల్వలగతి నొప్పి
వదనంబు చంద్రుని వలెను దనరి
నాడి సమ్యగ్గతి నడచుచు స్వరము కో
కిల సన్నిభంబుగా వెలసితుమ్ము
లొకటిరెండు జనించి యురుతర క్షుధగల్గి
తలను నస్మిరిమీఱి తనులఘుత్వ
మొందియన్నపు వాంఛజెందిదంతంబులు
వెన్నెలవలె కాంతివెలసి జిహ్వా
తడి గలిగి జలము ద్రావినపిమ్మట
జమటలు కడుబుట్టి శ్రవణయుగముః
సమముగా వినిపించి చందనాది సుగంధ
చయము నాసికము వాసనలెరింగి
యురచేతు లరికాళ్లు కనురెప్పలును గోళ్లు
పెదవులు రక్తము నొదవెనేని

గీ. జనులకును సన్నిపాతంపు సముదయములు
మరణభయమేమి లేదన్ని గురుతు లెరిగి
సరసగతిగాను మందులు సల్పవలయు
వైద్యసింహాంబు లెలమితో హృద్యముగను.

సన్నిపాతప్రకరణము,

సీ. తీవ్రజ్వరంబును తెలియ శీతంబైన
సల్పజ్వరంబును సంక్షిపాణి
తలములు గోళ్లు కన్నులు వెన్కకొల్కులు
రక్తవిహీనమై రమణనున్న
వీక్షణంబులు కాంతి వెలయక యుండిన
చెవుడు జనించిన స్వేదమెపుడు

లేకున్న ... తెలమి దొలంగిన
నేత్రముల్ భగ్నముల్ కృశములైన
నాభియు హృదయంబు నాసికపాదముల్
కరములు శైత్యంబు గ్రమ్మియున్న
యెక్కిళ్లు గలిగిన నెగరొప్పు బుట్టిన
వణకిన పిచ్చెత్తు వానివలెను
కూసిన కఫమెల్ల కుత్తుక నిండిన
ముక్కుల వాసన చిక్కకున్న
కపిల మలంబైన కడు శిథిలంబును
కుటిలంబు సూక్ష్మంబు కొంచరుమిగిలి
గీ. నాడి పైత్యంబుగా నాడి తోడతోడ
వాత గతిదొర్లి శ్లేష్మమై ఖ్యాతినమరె
వేని యారోగి బ్రతుకడు నిశ్చయముగ
వేగమున వైద్యమొనరించ విడువవలయు.

త్రియోదశ సన్నిపాతములు.

పంచచామరం. సన్ని సంధిక సన్నితాంద్రిక సన్నిరుగ్దాహం బనే
సన్నిజిహ్వక సన్నియంతక సన్నిగళ కుబ్జంబనే
సన్నికర్ణిక సన్నివిభ్రమ సన్నిరక్త ష్ఠీవమనే
సన్ని శీతము భగ్ననేత్రము సన్నిప్రాలాపంబనే
సన్నభిన్యాసంబు లనగా జనుత్రయో దశరూపమై
నెన్న నేడును సాధ్య మారును నెవరికైన నసాధ్యమా.

సన్నిపాత ముఖ్య గుణములు.

సీ. సంధులు నొచ్చిన సంధిక సన్నియాతాపముగ .
లిగిన తాంద్రికంబు
కర్ణమోలము లుబ్బ కర్ణకసన్నియా
గళ మునించిన కంఠకుబ్జమగును
చిత్తచాంచల్యంబు చిత్తవిభ్రమ మగు
తలవిప రంతక మెలమియగును

తడి లేకములుకీతి దగుల జిహ్వకయగు
తాపముత్తృష్ణయు రుగ్దాహమగును
గీ. లోచనంబులు గుంటలై లోని కరుగ
భగ్ననేత్రం బనర్థక బాధగలిగి
సప్రలాపంబు శీతాంగ మొప్పు సర్వ
శీతమైనను నెత్తురు నోటనుమియు
గాను రక్తోష్ఠమగా మూటకట్టినట్లు
ముణుచుకొనిన నభిన్యాస మొప్పుచుండు.

సాధ్యములు. (ఆరు)

గీ. కర్ణికము జిహ్వకము సంధికంబుతాంద్రి
కంబు ఘనచిత్తవిభ్రమ కంఠకుబ్జ
ములు గణింపగనారు నిమ్ములను గుమరు
తన్నిమిత్తంబు దివ్యౌషధము లొసంగ.

అసాధ్యములు (ఏడు.)

గీ. అంతకము భగ్ననేత్రి సీతాంగము ప్ర
లాప రక్తోష్ఠిరుగ్దహ లనగనారు
నయ్యభిన్యాసతో నేడు నరయ జనుల
బూనెనేనియు కుదరవు భూస్థలమున.

సన్నిపాతదశావస్థలు.

సీ. అరయ దశావస్థ లన నొప్పు మొదట న
పస్మారమును రెంట బరగు పిత్త
భూషణంబులు మూట భ్రమ నాలుగింటను
యుశ్వాస మూర్ఛైదు తోర్ధ్వదృష్టి
యారిట జ్వరదుర్వికారంబు లేడింట
నంగ విదాహంబు నష్టమమున
వదన ... ... తొమ్మిదిటను
స్వేదాంగము పదింట సిద్ధముగను

గీ. మరణమగును త్రిదోష సంబంధమైన
సాధ్యహీనంబు లేకను జనులకౌదవె
నేని క్రమమున గుణములు బూనువైద్యు
లతని వేగమువిడిచి పోనగును మహిని.

సీ. ముఖమునందా శ్లేష్మమును శూల శోషకా
సయు వేదనలుగల సంధికంబు
యేడుదినంబుల కెలమి సాధ్యంబగు
జ్వరము తందరయును శ్వాసశూల
దాహాతిసారముల్ దనరి నాలుకనల్పు
ము ... ... ... ...
... కం బను సన్నిదా సప్తరాత్రిము
లకుగుణమగు నవలను గణింప

గీ. యిరువదైదింటసాధ్యమా జ్వరము చెవుల
శోణతలను వాపు శోషయుకుతి
కేచమట రొప్పు వణకు ప్రలాపంబు కర్ణిక
మనగ నతికష్టమణగు మాసములు మూట.

సీ. మదము మోహ భ్రమ మాటలు తాపంబు
హాస్యగీతము చపలాక్షి యుగము
కంఠము వడి క్రుంగి కంపప్రలాప మూ
ర్ఛ జ్వరదాహముల్ చరణహస్త
ములు నొప్పి చల్లనై వెలసిన కంఠకు
బ్జము కష్టకష్ట సా ధ్యముపదింట
పైన మూటను గుణమగు బధిర
... ... ... ...

గీ. నొప్పుతడిలేక జిహ్వాక యొప్పుకష్ట
సాధ్యమగును పదారింట జనులకవని,

అసాధ్యసప్తకము.

సీ. తలద్రిప్పుటయు మోహదాహకా సాంగకం
పమును హిక్కలును తాపంబుగ

లుగ నంతకసన్నియగు నాయుషంబు పదింట
తాపప్రలాప వేదనలు రొప్ప
భ్రమదాహమును శూల పరగ రుగ్దాహంబు
యిరువదింటను జంపు నెవరినైన
కన్నలుభగ్నమై కంఠము ల్వీగ రాక
శ్వాసప్రలాపముల్ జ్వరముగలుగ

గీ. భ్రమయు కంపంబు గలిగిన భగ్ననేత్ర
సన్ని యెనిమిది దినముల చంపునరుల
నగ్నిమాంద్యము బలహీన మఖిల దేహముల
ను స్వేదములేకను ముడ్చుకొనుట.

గీ. తోడతోడనె జ్వరము త్రిదోషజముగ
ముఖమును నిద్రలేక నతిసార
నష్టవాక్కులుగల యభిన్యాస సన్ని
పదియునైదింట జంపునే ప్రాణినైన.

సీ. మంచు ముంచినరీతి మైచల్లనై వాంతి
ఘన విరేచనములు గలిగిహిక్క
కంపము యెగరొప్ప గళము హీనస్వర
స్వేదము గల్గిన శీతసన్ని
కుదర దెవరికినై పదిహేను దినముల
చంపును చిత్తచం చలప్రలాప
కంప తాపంబులు కాయము వాచిన
నెన్న ప్రలాపసన్నియగు పదిట

గీ. నైననాల్గింట చంపును నరులవాంతి మూర్ఛ
దాహ జ్వరమును విరేచనములు
కాపరక్తంబు రక్తేష్ఠీఘాత సేయు
పదిదినంబులలోన భూపాలునైన.

## త్రయోదశ సన్నిపాతముల కౌషధములు

సంధిక సన్నికి త్రిదోషానంద భైరవి.

సూతము గంధహింగుళము శుల్బము నాగము వంగతాళకం బాతితయుక్తి గూర్చి త్రిఫలాంబువునం మధియించి పర్పటి క్వాథమునందు డోలికను గట్టిగపక్వము జేసి శేష పి త్తాత్మక భావనం గుళికలైన త్రిదోషజ భైరవం బగున్.

భూపతి కుమారము.

సీ. బలిసవత్సనాభంబులు సమముగా
తీక్ష్ణతామ్రంబులు దెలియమూటి
తోటి సమంబుగా తూచి హంసపదిని
మర్దన రెండుయామములు జేసి
పదిరెండుయామముల్ కుదురుగా గాజుకు
ప్పెను సైకతమున యింపెసగవండి
మేకచేదున నూరి మిసపగింజలబోలు
గుళిక లల్లపువారి గూర్చియొసగ

గీ. శ్వాసలును సూతివాతముల్ సప్తవిధము
లైనసంతాపములు నభిన్యాసముఖ్య
సన్నిపాతంబు లాహికజ్వరము లణచు
నవని భూపకుమారమీ యౌషధంబు.

నారాయణాస్త్రము.

సీ. హారిదళహింగుళ హాలాహలాగ్నిటం
కణమాషకద్వయ కఫరిసూత
తుత్థముల్సమముగా తూచికల్వమునందు
మున్నిభృంగిని శిగ్రుమూలములను
రవిమూల జంబీర రసముల వేర్వేర మర్దించి
మాషప్రమాణముగను
మాత్రలు చేసియు మానవాసలికివ్వ
పదమూడు సన్నులుకుదురు కాన.

గీ. లణచు శోఫలు జ్వరములు గుణము
జేయు పోగొట్టు పృథుల మైన
సంకటముమాన్పు సంధిక సన్ని ద్రుండుబో
నవనినెన్నగ నారాయణాస్త్రరసము.

తాంద్రికసన్నికిభూత భైరము.

క. బలిరస శుల్బము చిత్రక
జలములమర్ధియించి మూసన్ సైకతపుటమి
మ్ముల వేసి నక్కపిలిచే
దుల భావన జేసి కరక తోయంబులతోన్.

క. ఒసగిన తాంద్రికమణచును
వసగత యీభూతభైరవము చేతనులో
కసమితికిన్ దధ్యన్నము
నొసగియు శొంకాయనీరు బోయగవలయున్.

నవలోహాగ్నికుమారము.

సీ. పారద నవలోహ భస్మగంధకములు
సమముగా రవిమూల సారమునను
పంచరాత్రంబులు బాగుగామర్ధియించి
గాజుకుప్పెపదారు గడియలుగను.
సైకతపుటమిడి సాంగశీతలమైన
పంచపత్త్రంబుల భావనంబు
జేసి గుంజసరి జేసి సన్నులకివ్వ
గుణమగు నాహికా గణములణచు

గీ. జ్వరములెల్లను హరియించు క్షయలద్రుంచు
కాసలును శ్వాసలును పాండు కామిలాది
ఘోరములు మాన్పు నగ్నికుమారమిదియె
భూమిని గణింప నవలోహ నామ మగుచు.

గరుడాస్త్రము.

సీ. పారద మ్లేచ్ఛముల్ భాగద్వయంబును
కటుకత్రయంబు టంకణము రెండు

భాగము ల్మణిశిల పరగ తివాక్షిరి
నాల్గుభాగంబులు నాభి పదియు
భాగముల్ హరిదళ బలులొక్క భాగంబు
జేర్చి శిగ్రుత్వక్కు చిత్రమూల
ఫణివల్లి లాంగలి కణసారములరెండు
దినములు మధియించి తీసిడోలి

గీ. కామహాయంత్రమున వటుకములు జేసి
గంజితో సన్నిపాతసంకటములెల్ల
మాను విబుధు లొసంగిన మానవులకు
అమల తరమైన యీ గరుడాస్త్రరసము.

కల్యాణభైరవము.

పంచచామరం. పురారివీర్యనాగ బ్రహ్మపుత్రవంగసత్కణా
సురారినిర్విషంబు లొక్క చొప్పు చిత్రమూల పు
ష్కరంబు బోసి యొక్కదినము గట్టిగాను నూరి స
ద్ధరాపుటంబు మూససైకతంబునందు వేసి తీ
వరానదీసి మత్స్యపిత్త వారితోటి నూరి దు
ష్కరంపుకణికా కాసమాఖ్య గలుగు సన్ని కిచ్చి శ
ర్కరామధూదధిప్రసక్తిగాను యోదనం బిడ
కరంబు మాను భైరవంబు కల్యాణనామ మయ్యెడిన్.

ప్రాణాగ్నికుమారము.

గీ. గగనహారవీర్య విషశుద్ధగంధకములు
సమము పర్పటిరసమున సమర నూరి
మేదినీపుటమిడి శిఖమీను చేదు
మాత్రప్రాణాగ్ని నామ కుమారమగును.

సుదర్శనాస్త్రము.

మానిని. మదరిపువీర్యముహారిదళతాళకమణిశిలహింగుళటంకణముల్
సడమలగంధకసమము తదర్ధకృశానము నన్నిటి సరిగనుదా

రద మిడి దుత్తురలాంగలిరవిత్రిఫలాగ్ని సుశిగ్రుకషాయముతో
పదపడి మర్దన జరుపుచు డోలను పక్వ మొనర్చిన మాత్రలుయిం
పొదవగ నల్లపురసమున నిచ్చిన బోవుత్రయోదశసన్నులు దు
గ్గాదలుజ్వరంబులుశ్వాశనముకాసలుకామిలశోఫలుపాండులు గ
కుదురు సుదర్శనయస్త్రము తోడను కుంజరవరదుడు చెప్పనచో
ముదమున మానులుదెల్పిరివసుధనుముఖ్యమటంచు గణించుమ వే.

చిత్తవిభ్రమకు మదనభైరవము.

మానిని. పారదమణిశిలసైంధవగంధక పటుతరతామ్రముసుభస్మము లిం
పారగ వాకుడుఫలజరసంబున బాగుగ నూరినమాత్రలు వీ
ధారుణిపుట మిడి మూసను గవిపిత్తంబునె భావనచే గుళికల్
గూరిచి దెప్పున త్రిఫలరసంబున గ్రోలిన మన్మథభైరవ మౌ.

మహాదగ్నికుమారము.

సీ. గరళభుగ్వీర్యంబు గంధకాభ్రకపిప
హింగుళతాళక మేకభాగ
ముగ శుల్బభస్మంబు తగసమంబుగ గూట
కల్గరరసము నక్కరమధించి
గాజుకుప్పెను వాలుకా యంత్రమున
వండి సాంగశీతలము నెరిగి దీసి
అనుపానయుక్తిని యదిచణమాత్రంబు
జనుల కొసంగిన సర్వరోగ
హారణమొనరించి సంజీవ కరణిమించి
సన్నిపాతంబులణచు పసన్నమైవ
మగుచు సకలజ్వరంబుల నణచునవని
నిదియె మహాదగ్ని కౌమార మెలమిదనరు.

కాళికాస్త్రము.

మానిని. దారదగంధకతాళకములు సూతంబును మణిశిలటంకణ ము
త్తూరపు విత్తులు మ్లేచ్ఛంబును త్రికటూద్వయకపర్దతుల్యముగా
గూరిచి యష్టిమధూకము నమముగ గొని సిద్దుండినిశిగ్రుశ్వ

క్సారము లర్కరసాన దినంబుల చక్కగనూరియు డోలిక నిం
పారగ వండి శితానను మధువున బాగుగ మాష సమానముగా
ధారుణి నొసగ త్రిదోషభినం బగు త్రాసపు కాసల శ్వాసలతీ
సారముపాండువుఘోరతరాహికజ్వరములుబోవునుయామములో
ఘోరితరంబగు కాళికాస్త్రమిది పూర్వము గౌరీవాచ్యముగన్.

కంఠకుబ్జకు బ్రహ్మానంద భైరవము.

సీ. గంధకాభ్రక తాళకంబులు టంకణ
విషము రసంబులు వెససమంబు
పరగ నన్నిటితోటి సరిహింగుళంబిడి
ఆర్ద్రికజనిత రసాననూరి
చణమాత్ర మొసగిన సన్నిపాతంబులు
కంఠకుబ్జముమాను ఘడియలోన
భవ్యబ్రహ్మానంద భైరవంబైజను
తాళక నాభి సూతము మణిశిల

మహేంద్ర భైరవము.

గీ. గౌరిపాషాణమును సమగతిగ ధూర్త
పత్రరసమున వెసనూరి భాండమునను
డోలికనువండి గుంజల బోలుమాత్ర
లివ్వ శీతాంగమణచు మహేంద్రరసము.

లఘువహ్నికుమారము.

పంచచామరము. రసంబు తాళకంబు వైద్యరాజ నాగజిహ్వికన్
వెసన్ త్రిలోద్భవంబు సరిగవేసి హంసపాది త
ద్రసంబుతోటి నూరి సైకతంపు గాజుకుప్పెచే
త సర్వమూరు ఝాల్పుటంబు సాంగశీతమైనచో.

క. లఘువహ్నికుమారంబున
నఘుతరమై రోగములను నణచును సన్నుల్
తగుగుంజా మాత్రంబిడ
దగసౌఖ్యమొసంగు రోగ దశములబాపున్.

### ఆగ్నేయాస్త్రము.

సీ. కర్పూరియును తాళకంబును తుత్థంబు
పారద మ్లేచ్ఛ నేపాళములను
మణిశిలల్ సమభాగమైయొప్ప విషమష్ట
భాగముల్ తిగనుంచి భవ్యటంక
ణం బొకభాగంబు నమర వినిగుండి
దుత్తూర బాహ్లీక చిత్రమూల
కల్హర వెల్లుల్లి ఘనశిగ్రుసారము
తోడుతమర్దించి డోలికందు

గీ. పక్వమొనరించి గుళికలు పరగ మాష
మాత్ర మల్లపురసమున మానవులకు
నివ్వ జంతుజ్వరంబులు నిఖిలసన్ని
లణచు నాగ్నేయనామాస్త్రమనురసంబు.

### జిహ్వాకసన్నికి సిద్ధభైరవము.

సీ. రసము తాళకమును వసనాభి సమముగ
కలబందరసమున కలియనూరి
ఘడియలెన్మిది డోలికా యంత్రమునవండి
పాఠీన పిత్తభావనము జేసి
సెనగలవలెను నేర్పునమాత్రలొనరించి
మధుకణంబులనొక మాత్రగొనిన
జిహ్వాకసణగించు సిద్ధభైరవమిది
బలిహింగుళంబును పారదంబు

### అమోఘాస్త్రము.

గీ. సమము పదిపాళ్లుగా విషమమర వైచి
వావిలినినూరి డోలనువండి మినుప
గింజలంతటిమాత్రలు గీలుగొల్ప
నణచుసన్నుల నీయమోఘాస్త్రరసము.

రసభూపతి.

సీ. రసగంధకం బుక్కురాబోడి సమము ఖ
ల్వంబున నిడి హంసపాదిరసము
తో రెండుదినములు నూరిన గుళికలు
గాజుకుప్పెనుబోసి గంధకంబు
తో సరిపల్లంబు వేసి మృత్తికమెత్తి
సైకతాగ్నినివండి సాంగశీత
మువదీసి వేదాంశ ముగ నాభివేసి మి
ర్యాలచూర్ణంబొక్క పాలుగల్పి

గీ. నాగవెల్లినిగురుజల నాగ నొప్ప
మాత్రలొనరించి దారుణమైనసన్ని
లకును దగ్గులకును కామిలకును నొసగ
మేలు నీ రసభూపతి లీలదనరు.

పాశుపతాస్త్రము.

సీ. పాషాణయుగ్మ నేపాళ తుత్థద్వయ
గోదంతవిషములు గూర్చిసరిగ
అన్నిటిసాటిగా పారవీర్యమునిచియు
నక్క దుగ్ధంబుల నమరనూరి
డోలాఖ్యయంత్రంబు తోవండి కృష్ణాహి
పిత్తభావన గురిజెత్తుమాత్రి
లొనరించిగొనగ నైనను బ్రహ్మరంధ్రంబు
కత్తిచేతనుకడు వత్తియించు

గీ. కంతయిడనైన నతిభీకరాంతకోప
మానసన్నిలుకడు వేగ మానునాహి
కజ్వరంబులుబోవు. సిక్కముగణింప
నవనిజనులకు పాశుపతాస్త్రమిదియె.

అంతకసన్నికి విజయభైరవము.

సీ. నాగవంగము రస నాభి కృష్ణాభ్రక
భస్మంబులును సమభాగములును
కటుకత్రయరసాన కడువడిమర్దించి
వజ్రిమూసను జేర్చి వాలుకమున
రెండుఝాములువండి దండిగా సాంగశీ
తలమైన శుకపిత్త మెలమిగలపి
మర్ధియించి చణక సమానమాత్రలుజేసి
అంకాయనీట ఘుటిగనొసంగ

గీ. నంతకంబను సన్నిదా నపుడుగుమరు
నాహికంబులడంచు మైదాహమెడల
జేయునిది విజయభైరవ సిద్ధరసము
కడిగి పదమూడుసన్నిలు గుణముజేయు.

రత్నాగ్నికుమారము

సీ. పాదరసంబును పంచలవణములు
రతనములతొమ్మిది జతెయొనర్చి
సమముగా వరుణాగ్ని సారంబులను రెండు
దినములునూరి కుప్పెనుఘటించి
ఆరుఝాములు సికతాఖ్యయంత్రంబున
వండిశీతలమైన పంచపిత్త
భావనచేసుంజ పరిమాణముగనివ్వ
నంతకసన్ని దురంతమైన

గీ. రోగములు పాండుగదలు విరుద్ధతాప
కసనములుమాను రత్నాగ్నికాకుమార
మిదిగిరీశుడు మానిసంపదలదెలపె
మహిగణింపంగ నమృతోపమానమగుచు.

సూర్యప్రభాకరము.

సీ. నాగాభ్రరసవస నాభిగంధక తుత్థ
కర్పరములు పరిగాను గూర్చి
తామ్రహింగుళమును తగనారు పాళ్లను
ఖల్వంబునను వైచి ఘట్టిగాను
జంబీర దుత్తూర తాంబూలిభానుల
రసములమర్ధియించి యిసుకపుటను
నొకదినంబుడికించి నుభయము మునుపట
వలెను రసంబుల గలియనూరి

గీ. మినుపగింజెత్తు తేనెతో గొనిన పాంశు
వాత మంతకసన్ని విఖ్యాతిబోవు
శ్వాసకాసలు స్నుహీపత్ర సారముననుU
వదలు సూర్యప్రభాకర వరరసంబు.

రుద్రాహసన్నికి స్వచ్ఛంద భైరవి.

సీ. గగనభస్మము తాళకంబు విషంబు టం
కణములు పారద గంధకములు
సమముగావీటితో సరిహింగుళంబిడి
ఆర్ద్రికమున పెసలంతమాత్ర
గ్రానరించియిచ్చిన గుణమగుభైరవి
స్వచ్ఛందరుద్రాహ సన్నిజ్వరము

చంద్రరాజరసము.

అతిసారములమాన్పు మృతమూరు దరద నే
పాళగంధకములు పాలుపాలు

గీ. త్రికటు గోదంతముల్కాణ త్రికటుసమము
రవిపునర్నవి సింధు వారాగ్నివాళ
శృంగిరసముల మర్దనజేసి డోలి
కను నొకదినంబువండి త్రిదినము లవల.

క. వెనుకటిరసములతో మ
ర్దనచేతు వరిప్రమాణతను రుగ్ధాహం
బణగు మలబద్ధశూలలు
గుణమగునీ చంద్రరాజగురురసమియ్యన్.

సిద్ధాగ్నికుమారము.

క. రసగంధక టంకణ విష
ము సమముగా భానుదుగ్ధములనూరిసుకన్
వెస భూపుటమిడి రుగ్దా
హసజయ సిద్ధాగ్నికాకుమారంబయ్యెన్.

వ. బ్రహ్మాస్త్రరస మల్లపురసముతో నొసంగవచ్చును.

భగ్ననేత్రసన్నికి పరిసన్నభైరవము

చ. మరిచము లారుపాళ్లు సమ మవ్విషటంకణ హింగుళంబులున్
వరుసను యార్ద్రనింబఫలవారిని నూరియు తద్రసంబునన్
నరులకు కన్నులందిడ దినంబును లోపలికివ్వ దాహముల్
జ్వరములుమాన్పు భైరవిప్రసన్నము గెల్చును భగ్ననేత్రముల్.

దివ్యాగ్నికుమారము.

సీ. మహిని దివ్యాగ్ని కుమారంబు భగ్ననే
త్రాహ్వయసన్నికి నగునుసూత
గంధక విషతాళకంబులు మణిశిల
రవిదుగ్ధ చిత్రమూలపుకషాయ
ములను స్నుహీ క్షీరములనూరి వాలుకా
యంత్ర భూపుటమున నమరవండి
సాంగశీతలము నెరింగి త్రికటుక త్రై
లానభావనజేసి దానివిషము
గీ. నాలుగవపాలుగూర్చి నీలియార్ద్ర
క రసమున నూరిగుంజలుగాను మాత్ర

లమర కాసలకొసగగ నౌనుసన్న
లకును గుణమిచ్చు ధారుణి ప్రకటగతిని.

రామపూజితము.

సీ. నాభితాళక టంకణం బుల్లిపాషాణ
తుత్థ ముమ్మెత్తవిత్తులును గంధ
కంబును సరిగ రసంబు నెన్మిదిపాళ్లు
రవిశిగ్రుజోడతరంబువట్ట
వేళ్లడ్డసరము జంబీరరసామలక
రసముల మథియించి యిసుక నొండి
సాంగశీతమ్మున విషంబు నెనిమిదిపాళ్లు
గలిపి మునుపటివలె కలియనూరి

గీ. మినుపగింజంత నార్ద్రకమున నొసంగ
పాండువులు శ్వాసకాస శోభజ్వరంబు
భగ్ననేత్రాదిసన్నల భయమువెట్టి
అణచునిది రామపూజిత మనురసంబు.

అభిన్యాససన్నికిరసభైరవము.

సీ. బాహ్లీక త్రిక్షార పంచలవణములు
కటుకత్రయంబును గంధకంబు
పంచామ్లలును నాభి పారద త్రిఫలముల్
సరిగ జిల్లేడు కషాయమునను
దినములుమర్దించి దీసి సైకతయంత్ర
పుటమిడి శశపిత్త ఘటనజేసి
నారికేళజలంబుతో రేపుమాపును
గుంజాప్రమాణంబు గొనిన నరుల

గీ. కెన్నగా నభిన్యాస సన్నిమాను
దగ్గుశ్వాసలు తీవ్రసంతాపమడచు

అరయ రసభైరవంబన నగు ధరిత్రి
పెరుగునన్నంబు పత్యంబు బెట్టవలయు.

రాజాగ్నికుమారము.

సీ. తాళక నాభి గంధకరసమాక్షిక
కాంతలోహమును నాగమును వంగ
హేమ తామ్రాభ్రక హింగిలీకంబులు
రజత వైడూర్య వజ్రములు మౌక్తి
కము విద్రుమంబులు సమముగా జిల్లేడు
పాల వావిలి హంసపాది చిత్ర
మూల జంబీరము బోడతరంబున
నడ్డసరంబున నావుపాల

గీ. నూరి గుళికలుగా జేసి యారనిచ్చి
మూడుదినములు వాలుకమునను వండి
శీతమైనను విషమందు పాతికయు మ
రిచము పాతిక వేసి నూరినది తిరుగ.

ఆ. పంచపత్త్రములను భావనజేసియు
ఆర్ద్రకంబుతోడ నౌషధంబు
గుంజమాత్రమొసగ గుణములు దగ్గ రా
జాగ్నికాకుమార మనగ జనును.

భద్రకాళీరసము

సీ. తాళక వంగసూతములు దారద తామ్ర
నాగగంధక టంకణములులోహ
నిర్విషంబులుసాటి నిగుడాండి జంబీర
శిగ్రు ... ... ...
...కుంచెడును చేమార్చి సారముదీసి
కడునూరి ... ... యాకు

జముమురసంబున నమర భానుపుత్రంబు
బెట్టిపూర్వప్రకీర్తి బట్టినారి
గీ. యులిమిరిరసంబుతో నివ్వ నొప్పుభద్రి
కాళికానామరసము ప్రఖ్యాతిమీర.

క. దాహాశ్వాసలు కాసా
నాహనభిన్యాసనన్ని నానాగదలుం
మేహాశ్వయథులు శోఫ
వ్యూహములణగించు జనుల కుర్విగణింపఁగ.

శీతాంగసన్నికి ప్రతాపాగ్నికుమారము.

ఉ. సూతము రాగిభస్మమును శొంఠి మరీచము క్షారముల్ త్రయం
బాతతినుప్పు లైదును సమాంశల నార్ద్రి రసాన వాలుకా
చేతను కుప్పవండి యది చల్లగుచో దశమూలచూర్ణసా
పేతముతోడ నార్ద్రకము బెట్టియొసంగ గుణాం బగున్మహా
శీతతనుత్రిదోషము పసిద్ధ ప్రతాపకుమార మెన్నగన్.

సన్నిపాతదావానలము.

సీ. కషదిహార్ద్రళ తాళకంబులు టంకణ
మొకొక్క కపాలును నిక్కముగను
పాలతుత్థంబును పాదరసం బెన్మి
దెనిమిదిపాళ్లు నాభేమపాళ్లు
బలి మూడు పాళ్ళంట కల్గర వావిలి
జిల్లేడు యుమ్మెత్త శిగ్రుగొబ్బి
సారముచేత వేర్వేర మర్దనజేయు
గుళికలార్ద్రికమున గొనినజిహ్వా
గీ. కలును శీతాంగసన్ని శోఫలును దాహ
జంతుసంతాపములు మాన్ప జాలు సన్ని

పాతదావానలము పరంజ్యోతిభజన
చేత నజ్ఞానమణగిన భాతిధరణి.

ప్రలాపసన్నికి కారుణ్యభైరవి.

సీ. హరవీర్యమును విష మభ్రకంబును గుంట
కల్గరాకురసాన గలియనూరి
సికతాఖ్యయంత్రంబుచే మూసనుతుణ
మాత్రమిచ్చియు సాంగసీతమైన
వారాహిశిఖిపిత్త భావనజేసియు
మాష ప్రమాణమా మాత్రనారి
కేళజలంబున కేవలముగనివ్వ
పరగతక్రోదన పథ్యమిడిన

గీ. కోపఘూర్ణితమైన ప్రలాపసన్ని
మాని సకలజ్వరంబుల పూనిద్రుంచు
గణ్యసంపూర్ణమైన కారుణ్యభైర
వంబుగాని రేని మరిసంశయంబులేదు.

లీలాగ్నికుమారం.

గీ. గంధకమునాభి రస వెలిగారములు స
మంబు రవిదుగ్ధ మరిచ కల్కంబుతోటి
నూరి వాలుకమున మూసనొండి మాష
మాత్రలిడగ ప్రలాపంబు మానునవని

క. లీలాగ్నికుమారం బిది
వాలాయముగా త్రిదోష వర్గము దగ్గుల్
కాలుని శంకరుడడచిన
పోలిక నవలీల నణచు బుధులునుతింపన్.

సుశ్రుము

సీ. దరదపారద పారదములు లోహము గంధ
కమును తామ్రంబు టంకణము వృల్లి
పాషాణములు సముపాళ్లు దుత్తూర ని
ర్గుండి చిత్రక శిగ్రు మోడి వాశ
రవిభృంగి వారుణి రామఠకోకిలా
ద్రాద్రికాంకోల రసాంబువులును
తెగనూరి సైకత స్థితివండియును హింగు
ళంబునై దైదుపాళ్లమర వేసి

గీ మొదటిరసముల వెసనూరినదిగురింద
గింజయెత్తివ్వ శోఫ ప్రభంజనములు
కాస పాండుప్రలాపముల్ శ్వాసలణచు
అరయగాను సుశ్రుమర్ వరరసంబు.

రక్తోష్ఠసన్నికి సన్నిపాతభైరవము.

నాగమటంకణంబు వసనాభిరసంబు నభంబుపాటిగా
భాగలు మ్రరిపాల త్రిదివంబు మథించియు డోల వండి యి
చ్ఛాగతి బర్హి పిత్తమున చాపలచేదున నానచిచ్చి సం
యోగకణాకషాయమున నొప్పగమాష సమానమిచ్చినన్.

గీ. జనులకెన్నగ రక్తోష్ఠ సన్నిమాను
పరమయోగ్యము యీసన్నిపాతభైర
వంబు వాయువులణచును సాంబశివుని
కంటిమంటల తుంటవిల్ దంటపగిది.

ఉత్తమాగ్నికుమారము.

సీ. తామ్రమభ్రకము కాంతంబును నుక్కును
తాళక నాభి నేపాళలోహ

మణిశిలల్ తూచి సమాంశలుగా వేసి
హంసపాదిరసాన సమరసూత
రాజుకుప్పెను వాలుకాయంత్రమున రెండు
ఝూములుయుడికించి సాంగశీత
మున పంచపిత్తంబులను భావనయొనర్చి
మాషపరిమాణమా మాత్రయొసగి

గీ. నారికేళోదకము పంచదారనీళ్లు
దాహమొసగిన రక్తోష్ణదానణంచు
సకలగదలును వదలును జనములెన్న
ఉత్తమాగ్నికుమారమీ యుర్విలోన.

జ్వాలాగ్నిరసము.

సీ. గంధక సూత టంకణ తాళకంబులు
హింగుళమునుసరి విషముమేను
భాగలు లశునంపు భానుజంబీర ని
ర్గుండి చిత్రక శిగ్రు గురుతరార్ద్రి
సారము నాల్గువాసరములు మర్దించి
మినుపగింజలవలె దనరమాత్ర
లొనరించి శర్కరలోబెట్టియిచ్చిన
జ్వరములు రక్తోష్ణసన్నిమాను

గీ. సకలదోషగుణంబుల ప్రకటమణచు
విపులసంగమదోష సంతపముద్రుంచు
వసుధ జ్వాలాగ్నికామహారసమనంగ
జనులకిది శంకరునిచేత జెప్పబడియె.

త్రయోదశసన్నిపాతములకు సన్నిపాతగజాంకుశము.

పంచచామరం. ఎన్నగా హారవీర్యభస్మము హింగుళంబును మాక్షికం
బున్నతీగదగు తాళకంబునువ్యోమభస్మముతుల్యముల్

సన్నిటక్ సమమైననాభియు నగ్ని మూల పటోల సౌ
వర్ణ లాంగలి పాశభృంగని వావిలిక్ చిరునిమ్మలక్.

సీ. బలుగొడ్డుగాకర పాలమూలరసంబు
తోమూఁడుదినములు తూఁగనూరి
క్షారత్రయంబుల సైంధవవాయుపి
ళంగాతి వసలు బోళంబు మధుక
సారముల్ సమము విషంబువాటిసమంబు
పొడిఁబోసికలఁబోసి పూర్వరీతి
మర్దించిగుళికలు మాషమాత్రంబుగా
నొసగినజనులకు నసమమైన
గీ. సప్తవిధదోష సంతాపచయములణఁచు
సన్నిపాత త్రయోదశ సమితిద్రుంచు
ఆహికంబులుఁబోగొట్టు నవనిలోన
సన్నిపాతగజాంకుశం బెన్న నగును.

సన్నిపాతదావానలము.

సీ. నాగవంగము టంకణంబు త్రిక్షారముల్
శంభువీర్యంబు పాషాణయుగము
తాళకంబుసమంబు తగవీటితోపాటు
హాలాహలంబు నిమ్మామ్లముసను
దినములుమూఁడు మర్దించి సైకతమున
వండిశీతంబగు చుండువిషము
వేదాంశమేసియు విడువకనూరి మ
యూరాజపిత్త సంయోగమునను
గీ. మాత్రలొనరించి యొసగిన మానవపుడు
తగత్రయోదశ సన్నిపాతములద్రుంచు
అరయనిది సన్నిపాతదావానలంబు.
పెరుగున్నంబు వెంటనే పెట్టవలయు.

## సన్నిపాతకషాయములు.

### సంధిసన్నికి.

గీ. వావిలులిమిరి కలిగొట్టు నాముదపువేళ్లు
దురదగొండిని శొంఠిని తోటిసమము
చేదుపొట్లాదిక్వాథంబు సేవగొనగ
సంధికపుసన్నిమానును సరసగతిని.

### తాంద్రికసన్నికి.

గీ. మించిగృహధూమ గుగ్గులు పంచకోల
నేలవేము యవక్షారనిచ్చికాచి
మిరపగండ్రికషాయంబు లెలమిగొనిన
తాంద్రికము సన్నిమానును ధరణిలోన.

### చిత్తవిభ్రమమునకు.

గీ. కరక మిరియాలు వావిలి కలగరేళ్లు
మోడి వెల్లుల్లి పిప్పళ్లు నాడ్దమైన
శొంఠి వెల్లికషాయంబు సుగుణమగును
చిత్తవిభ్రమసన్నికి సేవగొనగ.

### కంఠకుబ్జను.

గీ. క్షుద్ర తక్కోడు కలిగొట్టు శొంఠిసమము
కొండగుమ్మడు పెదమాను కోష్టువిత్ర
మూల మారేడు క్వాథంబు చాలగొనిన
కంఠకుబ్జములణచును ఘడియలోన.

### కర్ణికసన్నికి.

గీ. నేలవేమును తక్కోడు నింబ శొంఠి
వాము పర్పాటపిప్పళ్లు వసయు చేదు

పొట్లసమము కషాయంబు బుచ్చుకొనిన
కర్ణికపుసన్నిమానును గాంచజనులు.

జిహ్వాకకు.

గీ. వాకుడును శొంఠి కలిగొట్టు పాలపెద్ద
మాను గొంతెమగోరులు మారెడేళ్లు
సమము బెట్టి కషాయంబు సన్నికివ్వ
జిహ్వాకంబులుమానును క్షితితలమున.

అంతకసన్నికి.

గీ. చిత్రమూలంబు పల్లేరు చేదుపొట్ల
వావిలియు నూడ్గు మోడిని వాకుడేళ్లు
త్రికటు కావాలు సమముగ దెచ్చిక్వాథ
మొసగనంతకసన్నికి విసముడించు.

రుగ్దాహసన్నికి.

గీ. కటుకరోహిణి ముస్థ త్రికటుకముంత
పలుగుడేళ్లను సర్పాక్షి బోడతరము
సమము బెట్టి కషాయంబు సరిగనొసగ
పరగ రుగ్దాహసన్నులు భస్మమగును.

భగ్ననేత్రముకు.

గీ. వావిలియు ముల్లుగోరింట వాకుడేళ్లు
గుంటగల్గర చిరుబొద్ది శొంఠి చేదు
పొట్ల బలునడ్డసరములు బెట్టి ధార్తవ
భగ్ననేత్రంబులునుమాను ప్రకటముగను.

అభిన్యాససన్నికి.

గీ. పంచమూలంబు వాకుడు వసయు త్రిఫల
ముంతపుల్లుడు చిరుబొద్ది జువ్వియుగము

గాచి క్వాథము ద్రావిన గండడంచు
ఘోరమైన యభిన్యాస గుణములవని.

శీతాంగసన్నికి.

గీ. మోడి దశమూల చిరుబొద్ది ముంతపుల్గి
దేళ్ళు వావిలి వాకుడు రెండుములక
లను సమంబుగ క్వాథంబు గొనినవేగ
నణచు శీతాంగసన్నల సన్నిబట్టి.

ప్రలాపసన్నికి.

గీ. ఉల్మిరి పస్పు మోడిని యూడుగేళ్లు
తిప్ప త్రికటుకములు కలు దేవదారు
క్వాథమునుగాచి ద్రావినవాతములును
సుప్రలాపంబు సన్నియు సుగుణమగును.

రక్తోష్ఠసన్నికి.

గీ. వావిలీ ముల్క వాకుడు పాలమోడి
యడ్డసరమును గోరింట నవిసమూల
క్వాథమునుగాచి ద్రావిన కాసనన్ని
నణచు రక్తోష్ఠసన్నిని నద్భుతముగ.

భైరవాంజనము.

గీ. చవ్యమరిచంబు యింగువ సైంధవంబు
శొంఠిసమమున గోమూత్ర మెంటవెంట
బోసినూరియు కన్నుల వేసిభైర
వాంజనంబున సన్నులణంగి జనును.

బాలసూర్యోదయాంజనము.

గీ. సైంధవము మరిచ మింగువ సమముబెట్టి
గోవు మూత్రంబుననునూరి కోలకులందు

వేయ నస్సులుమానును యెంచకీవి
బాలసూర్యోదయాంజని జల్కిలను.

సూర్యాంజనము.

గీ. నాభి మిర్యాలు నాముదపప్పునమును
మూడుదినములు గోమూత్రమునను యుంచి
నూరి నయనంబులకు వేయ నుర్వి నన్ని
మానను సూర్యాంజనంబిది మనుజహితము.

పథ్యక్రమము.

సీ. రోగంబులనునన్ని రూఢిగాలంఘన
పక్వంబుగావించి పత్యమిడగ
నొప్పువాతశరీరకులు వకట్టావేళ
మరునాడు కొఱ్ఱన్న మరియమేలు
గను మేహదేహికి గునుగులజావయు
మరునాడు శొంఠిచే మిరియమొప్పు
నన్నంబు బెటింప నగుపైత్యదేహికి
కొట్టులజావ నాకొన్న నాడు
మరునాడు కొతిమురల్ మాడ్పుకారముతోడ
నన్నంబుబెట్టుట నాణ్యమండ్రు

గీ. రాత్రిపత్యంబు బెట్టంగ రాదుగాన
పరగశోషించెనేని పిప్పళ్లు తేనె
వాము శొంఠియు ఖర్జూర ఫలముగాని
ద్రాక్షలైనను సేవింప ధాత్రినొప్పు.

గీ. నాల్గురోజులుపథ్యంబు నమర కంది
కట్టు తియగూర గోత్రక మష్టదినము
నెలలొవంకాయ గుమ్మడి తిలల నావ
మాంస దధి మాష స్నానంబు మరియువద్దు.

కర్మవిపాకము

సీ. దేవాలయ విఘాత దేవతోత్పాటన
విప్రవృత్తిచ్ఛేద నపరిముఖ్య
స్త్రీహత్య గోహత్య శిశుహత్య దేవద్వి
జాబద్ధములు వివాహఘ్నములును
దేవతా దూషణాధికమహాపాతకో
ద్ధతిబుట్టు సన్నిపాతంబులనెడు
దీనిప్రాయశ్చిత్త మేనెరిగించెద
నరయ గాయత్రిత్ర్యయంబకంబు
శ్రీసూక్తరుద్రముల్ చెలువుగాపఠియించి
హోమాతర్పణముల నేమమొప్ప

గీ. విప్రులకు సర్వదానముల్ విధినొనర్చి
యిలనవగ్రహ జపముసేయించి ధాన్య
నవక దానంబు లొనరించి శివునిపూజ
సేయ రోగంబులయ్యెడ జేరవెరచు.

---

పదమూడవ పద్ధతి.

(జ్వరరోగ ప్రకరణము.)

క. శ్రీకేసరితనూభవ
కాకోదర హారశౌర్య కమలోద్భవ నా
కాక ప్రభుముఖవిబుధా
నీకస్తుత కొమిరిపూడి నిలయహరీశా.

జరోత్పత్తికారణము.

క. పరిమధాఘ్న్యుడు దక్షాధ్వర
సమయంబున నుదిటికన్ను చక్కగ దెరువన్
దుమికిన జలకణమున త్రా
సముదోప జ్వరము వేగ సంభవమయ్యెన్.

౭. జలపానంబున నామమ్ము వ్రష్టియగు నెంచ సంధు మందాగ్ని ని
చ్చలు గన్పించు నజీర్ణామందమనకు సంజాతంబగుఁ దీనిచే
నెలయుఁ ఘోరతరంబుగా జ్వరము నుర్వి౯ దీనినేకాదెపరా
నులు దా మర్వదినాల్గు రూపములుగా నూహింతు రెల్లప్పుడుఁ.

క. ఘరరోగజాలమందున
జ్వరము బలత్కారమంద్రు సంయమి జనముల్
పరికింప తద్విముక్తి
స్ఫురణలు తత్తన్నిదానములు రచియింతుఁ.

జ్వరవివరములు.

సీ. వాతజ్వరంబును పైత్యజ్వరంబును
శ్లేష్మజ్వరమును అజీర్ణనామ
మును సకంపజ్వరమును సన్నిపాతజ్వ
రంబును నున్మాదజ్వరమును శీత
జ్వరములెన్మిది సహజంబులు వాత పై
త్యజ్వర వాత శ్లేష్మ జ్వరమును
పైత్యశ్లేష్మములన బరగు ద్వంద్వంబులు
చర్మగతంబులు శల్యగతము
మాంసగతంబును మజ్జాగతంబును
రక్తగతంబును శుక్లగతము
మేదోగతంబుల నాదగు సప్తధా
తుజ్వరంబులును భూతజ్వరంబు
ఆమజ్వరంబు నిరామజ్వరంబభి
చారజ్వరము త్రిదోష జ్వరంబు
కామజ్వరంబభి ఘాతజ్వరంబును
పంచమాసజ్వర షణ్మాసాంజ్ఞ
యాగంతుకజ్వర మామ్లజ్వర రజస్వ
లాజ్వరంబును దైవదజ్వరంబు

తరుణజ్వరము సంతతజ్వరము స్ఫోట
కజ్వరంబును త్రిదోషజ్వరంబు
మారిజ్వరంబును మాహేశ్వరజ్వర
మును వైష్ణవజ్వర మూర్ఛకములు

గీ. శస్త్రఘాతజ్వరంబున సంకరములు
యిరువదియు రెండు ధరణిలో బరగుచుండు
నాల్గుపదులని తన్నిదానంబులమల
గతిని శాస్త్రోక్తరీతిగా జతయొనర్తు.

గీ. అరయ నేకాహికంబు ద్వ్యాహికంబు
కనగ త్ర్యాహి చాతుర్థికంబు పంచ
పక్ష మాసాహికమును సంవత్సరంబ
నగ నెన్మిదియాహికా లగణింప.

క. వాత కఫ పిత్తయుత వి
ఖ్యాతిని యిరువదియునాల్గు క్రమమునసయ్యో
చేతనులకు యిరువదినా
లైతగు సంతాపములను కడువర్ణింతున్.

క. ఇపుడు నిదానముజెప్పెద
నుపమున రసచూర్ణములను నురులేహ్యంబుల్
అపమృతికి వెతకిసేయుడి
నిపుణత తత్పద్ధతులను నేర్పొప్పంగన్.

## సహజజ్వరములు.

### వాతజ్వరము

చ. అరయగ కృష్ణవర్ణముఖ మంగము కండువు మేను నొప్పి ని
ర్భరతిమిరాలసంబు మలబద్ధము దాహము చాలనూష్ణవి
స్ఫురణము వక్రరీతిగను దోచిన నాడియుగల్గెనేని యా
జ్వరము గణింప వాతగుణజంబనిగాంచుడి వైద్యులిమ్మహిన్.

### పైత్యజ్వరము.

మ. అతిసారంబును రక్తమూత్రమును నిద్రాధ్యత్వమందు ప్రలా
పితమౌభాషణ దాహమూర్ఛనుదముల్ వాంతిత్వపాలాప సం
ధితచాంచల్యము నాడియందు దగనేని దీని పైత్యోల్బణాం
చిత సంతాపముగా నెరుంగదగు దానిన్ వైద్య లీధారుణిన్.

### శ్లేష్మజ్వరము.

ద. వదనమునంత తెల్పు తగువక్షమునందున దగ్గురొప్పు పెం
పొదవజనించు గుంభనము నుష్ణతరంబగు తృష్ణహిక్కయున్
వదనగు కంధరంబునను బంధురకండువ గల్గి నాడి బ
ల్గుదురుగనుండెనేని గనుగొంద్రుకఫంబని వైద్యులిమ్మహిన్

### అజీర్ణజ్వరము.

క. తేపులును మెడలునొచ్చుట
దీపన మింతియునులేక ద్విరద ముగతిగా
దీపింప నాడినడచిన
దా పరికింపగ నజీర్ణ తాపంబయ్యెన్.

### కంపజ్వరము.

క. తలవణుకు భ్రమ ము రోమం
బులునిక్కుట తాపమోహములు కటియున్ యూ
రులు పార్శ్వంబులు నొప్పులు
కలిగిన కంపజ్వరంబుగా నెరుగనగున్.

### సన్నిపాతజ్వరము.

సీ. నిశిజాగరము దివానిద్ర నిద్రాధిక
దాహార్తియతిశీత తనువు ఘర్మ
మెచ్చునేత్రములు లోహితపీతవర్ణముల్
శీర్షహృత్సంధి పార్శ్వములునొప్పు

లతిగతి వృత్తి విన్యాసవైకృత మద
హాస ప్రలాప తృష్ణార్దహీన
జిహ్వాకర్కశము కూజితము కంఠాకుంఠి
తమును కించిజ్జ్వర భ్రమయు నాడి

గీ. సూక్ష్మమును చంచలము నతిస్ఫూర్తి కుటిల
గతియు దనరిన హానిశోకములుదీని
సన్నిపాతజ్వరంబని యెన్నుచుంద్రు
కాలునకు సన్నికిని వేరుగాదుచూడ.

ఉన్మాదజ్వరము.

క. మదమోహభ్రమ శీర్ష
వ్యథ వక్త్రము చేదునీరు వడచును కనులన్
వదరుమనోవైకల్యము
గద యున్మాదజ్వరంబుగా నెరుగనగున్.

శీతజ్వరము.

క. తనుభంగం బతిశీతం
బును తలనొప్పియు నరోచమును కొంచంబై
జనుసంతాపము హరితం
బనయము శీతజ్వరంబు ననునిద్ధాత్రిన్.

దోషజ్వరప్రకరణము

గీ. జ్వరము కొంచెము గనుపింప నరుమతిక్త
కటుక మధు రామ్ల సకషాయకలితవాస
నోదనముశోకవ్యాయామ ముదకపాన
సంగమములను సప్తదోషంబులాదవు.

గీ. విషమదోషంబు మరి శీతవిషమదోష
సంగదోషంబు జిహ్వాదోషంబు పథ్య

దోషము త్రిదోషజము భుక్తదోషమనఁగ
నేఁడువిధముల వేశ్వేర నేర్పరింతు.

విషమదోష లక్షణము.

క. వేఁకియుదాహము మంటలు
దాకుటవేలంబయిన తీవ్రతరమైన మహా
వ్యాకులపునాడిమూర్ఛలు
కాకలునఁగ విషమదోషగత గుణములగున్.

శీతవిషమదోషము.

ఉ. క్షామముఁ దుష్టామము కార్శ్యముగు శైత్యము తీవ్రతరజ్వరంబు జి
హ్వామృదుహీనమై కఠినమై యతిగంటుకమై శిరార్తి మూ
ర్ఛా మదమోహదాహములు సంభవమై వెసఁ గెందుమూఁడు నా
ళ్లామని సేయు శీతవిష మాహ్వయదోషము ధారుణీస్థలిన్.

సంగదోషము.

చ. తెరుణపు వేఁకిగల్గ వనితన్ గవయన్ జనించుదోష మే
నరునకునైన పాదచరణంబుల శీతము విభ్రమంబు కం
ధరమును మేనునొచ్చుటలు తాపము దాహము సుప్రలాపముల్
గురుతగు సంగదోషమని కోవిదులెల్ల గణించుఁ డిమ్మలన్.

జిహ్వాదోషము.

ఉ. నాలుక నీలపీతమరుణంబగు భాతిదనర్చి పాదముల్
కేలుగవల్ హిమంబు చిలికించినరీతిని చల్లనై ప్రలా
పాలసశోషమూర్ఛ విపులానలకీలల బోలు వేఁకి చే
చాలతపింపజేయు మనుజప్రకరంబుల జిహ్వాదోషముల్.

అపథ్యదోషము.

క. హృదివేదన మూర్ఛ భ్రమ
మదమోహ ప్రలాపభయము మనుజులకొదవన్

గదవేగమపథ్యగుణా
స్పదమైనను సకలరోగ భవహేతుకమై.

త్రిదోషము.

మ. అతిపైత్యంబగు శీతముగ్భ్రమయు సర్వాంగవ్యథాశోషవి
శ్రుతసంతాప పిపాసకాస తనుభిచ్ఛ్వాలా మహాత్య ంప ని
ష్కృతికంఠస్వరసాతిసారవమహాకీర్ణంబుసంధిల్లు ను
ద్ధతి పృథ్వీంగనగా త్రిదోషజనితాంతంబం్రను వైకిత్సకుల్.

అన్నదోషము.

ఉ. భూమిని నన్నదోషమునబుట్టును దాహము శోషహిక్కలుఙ్
మోముసవారి పాదకరమూలములఙ్ నెఱలేని మంటలుఙ్
భీమతరజ్వర భ్రమ లభేద్యతనువ్యథ శీతలాంఘ్రులఙ్
కోమలహీనజిహ్వయును కుత్సితభాషలు దుశ్శిరోరుజల్.

దోషసాధ్యాసాధ్యములు.

క. పరికింపగ సప్తవిధ
జ్వరములను త్రిదోషజంబు సాధ్యముగా వె
వ్వరికినదివిడచి యారిటి
కిరువుగ వైద్యములు సేయు కెలమినిభిషజుల్.

వాతపైత్యజ్వరము.

గీ. అంగవైకల్య కృష్ణాభమైనముఖము
చెమట మలమూత్రబద్ధముజెంది నిద్ర
సంతతానర్థక వచనసమితిగలుగ
వాతపిత్త జ్వరాకృతి వసుధవనరు.

వాతశ్లేష్మజ్వరము.

గీ. గగురుపొడుచును నిస్సత్వకాస లంగ
వికలమును కుత్తుకయుమోము వెలయుచెమట

పిక్కలును నొప్పిగల్గిన పృథ్విలోన
వాతశ్లేష్మ జ్వరంబం్రదు వైద్యులెపుడు.

పైత్యశ్లేష్మము.

ఆ. కొమ్మునననునొప్పి సంతాప రోమహర్ష
ణంబు మిక్కిలినిద్ర యనర్థకమగు
వచనములు గల్గెనేనియు వసుధలోన
పైత్యశ్లేష్మజ్వరంబని పల్కబడును.

## సప్తధాతుజ్వరములు.

చర్మగతజ్వరము.

ఆ. కొంచమౌజ్వరంబు గురుతరదాహంబు
చెప్పనించుకంత నొప్పిగల్గి
జీర్ణమేమిగాక జిక్కిన చర్మగ
తజ్వరంబనాగదగు ధరిత్రి.

శల్యగతజ్వరము.

క. వెలుపలశీతము లోపల
బలుకూతలు కుటిలనాడి పాండు క్షయులై
వెలయునిది సంతతజ్వర
మలసట యస్థిగతమనగ నగునుధరిత్రిన్.

మాంసగతజ్వరము.

క. దగతీవ్రజ్వరమును మై
గగురింపును రొప్పు మంట ఘర్మము మూర్ఛల్
మిగులన్ తెందర ధర మాం
సగతజ్వరమనుచు దెలియజను వైద్యులొగిన్.

మజ్జాగతజ్వరము.

క. జ్వరమొకతరి శీతంబొక
తరి తనుభంగం బరోచితము ఘర్మము మ

ర్భరమగు నతిసారమగుఁ
జ్వరమే రసగతమనంగ జను నరులకొగిఁ.

రక్తగతజ్వరము.

క. ఆకలి కాయవ్యథ లతి
కాక మతిభ్రమయు మూర్ఛ కన్నులనొప్పుల్
వైకల్యం బతిసారము
నైకరమిది రక్తగతమనంగను జెల్లుఁ.

శుక్లగతజ్వరము.

ఆ. తొడలునొప్పి శోష దుర్భమారోచకం
బులు ప్రలాపవచనములును మంట
లెలమిగలిగెనేని నిదిశుక్లగతమౌజ్వ
రంబునాగ నగుజనంబులకును.

మేదోగతము.

క. పాదము లూరులు శిరమును
వేదన శీతమును చిత్తవిభ్రమకలదో
వేదన నాడిదనర్చును
మేదోజ్వరమునను సెగలు మిక్కిలిబాడముఁ.

సంకరజ్వరములు.

భూతజ్వరము.

క. గీత ప్రలాప మస్తక
ఘాతము తీవ్రజ్వరంబు ఘనతరహాస్యా
పేతభ్రమ రోదన రద
నాతతదంశనము భూతనామజ్వరమౌ.

ఆమజ్వరము.

క. తినినది వేగిరమరుగక
కనులన్నిరొదవి రొమ్ము కలకలు బలువుఁ

ఘనమూత్రము బామజర
మునకు న్గలననిది వైద్యమును సేయుమునుల్.

విరామజ్వరము.

ఆ. కడుపునొప్పి లఘువుగా దేహముండుట
చెమట కాయమందు నమరియుండి
దోషమలమువిడువ భేషజుల్దినిని
రామనామకజ్వరం బటండ్రు.

అభిచారజ్వరము.

క. కించిజ్జ్వరమును మానస
చంచలమును జాడ్యమును విచార మరుచియున్
మించిన యభిచారజ్వర
మం చందురు తజ్ఞులెల్ల నవనీస్థలిలోన్.

త్రిదోషజ్వరము.

క. అలవాతపిత్తకఫముల
గల గుణములు సంభవించి కడు వేగైనన్
వెలయు త్రిదోషజ్వరమన
నిల జనులను బాధపెట్టు నెప్పుడు కడిమిన్.

కామజ్వరము.

గీ. జ్వరముతీవ్రంబు తలనొప్పి చాలదప్పి
సంగమాసక్తి యంబుజాస్యప్రియోక్తి
లేపనప్రాప్తి సత్క్రియాలింగనాప్తి
కామనామజ్వరంబుకై కానిగలవె ?

అభిఘాతజ్వరము.

క. దూరమునడిచిన మోచిన
భారము దాహమునుగాత్ర భంగము చలువల్

మీఁరిన కాకల్గలిగిన
నారయ నభిఘాతతాప మనజను నవనిన్.

వంచమానజ్వరము.

క. జ్వరమధిక మనర్ధకవా
ఘ్వరి దాహము మలప్రవృత్తి చాలావ్యసనం
బరయగను వంచమాన
జ్వరమందురు దీని వైద్యశాస్త్రజ్ఞులిలన్.

పంక్తిజ్వరము.

ఆ. కడుపునొప్పి మిగుల కక్కుట రేబగల్
నిద్రలేకయుంట నిలువకెప్పు
డామమే ప్రవృత్తియైన పంక్తిజ్వర
మనిరి మునిమతంబులను ధరిత్రి.

ఆగంతుకజ్వరము.

క. కరపాదంబులశీతము
శిరమునబలునొప్పి నాడి సింధురగతి దు
ర్భరమగు తీవ్రజ్వరమును
నరయగ నాగంతుకజ్వరాభిధమయ్యెన్.

అమ్లజ్వరము.

క. మూత్రము మిక్కిలితొందర
గాత్రగురుత్వం బరోచి కడుపునమంటల్
చిత్రముగా నామ్లజ్వర
మిత్రులటంచనిరి మునులు మేదినియందున్.

రజస్వలాజ్వరము.

క. మొదటను నడుమను వేకియు
తుదనేమియులేక విరుత తోయ్యలికి రజో

స్వదకాల మిల్లు జేసిన
నదికష్టమునుమీఁ రజస్వలాభిఖ్యనుగుఁన్.

ఐకతజ్వరము.

క. కలలో నలువనుచూచుట
వలచుట భ్రమపడుట నవలవణకుట నిదురల్
జెలిమియుటయు కీళ్లనొచ్చుట
యలసటలుం దైవత జ్వరాఖ్యకుఁ జెల్లున్.

తరుణజ్వరము.

క. సన్నముగా జ్వరముండును
కన్నులు వస్త్రాభమగును కసనము భ్రమల
త్యున్నతిగలుగు ప్రలాపము
లెన్నగ తరుణజ్వరంబు నెవరికినైనన్.

సంతతజ్వరము.

క. బండవలె కాలుచును మే
నెండును దగ కొంచెమగుచు నెప్పు డజీర్ణం
బుండును కన్నుల గోళ్లను
పాండువలగు నిత్య సంతతపంబున కెలమిన్.

స్ఫోటకజ్వరము.

క. తనువైకల్యము దాహం
బును తలనొప్పియును వారి పూజ్యంబగుచున్
గనుగవ లొప్పగ స్ఫోటక
మనెడిజ్వరంబగు ప్రవృత్తమకానరులకొగిన్.

స్త్రీదోషజ్వరము.

గీ. చెలిని తరుణజ్వరంబునగలయు దోష
మొదవి విభ్రమమును కరపదయుగముల

శైత్యమును గాత్రవైకల్య చపల తాప
ములునుగలిగిన స్త్రీదోష మెలమిదనరు.

మారిజ్వరము.

క. హీనప్రాణము దగ్గును
కానిస్వప్నములు కంపుగల్గు ప్రవృత్తుల్
మానసి మంటలు మూర్ఛలు
బూనిన మారిజ్వరంబు భువినెన్నఁగదగున్.

మహేశ్వరజ్వరము.

క. జ్వరమతితీవ్రముఁ గనుగవ
లెరుపును దాహంబు శీతమెచ్చుటనైనన్
దొరగదు మాహేశ్వరమన
జ్వరమునకున్ సకలశాస్త్రసమ్మతమగుచున్.

వైష్ణవజ్వరము.

క. జ్వరమంతర్గతమై దు
ర్భరశీతము నిద్ర తీవ్రబాధలుగలుగన్
ధరలోన వైష్ణవజ్వర
మెరుగందగు దీని వైద్యులెలమిగణింపన్.

మూర్ఛజ్వరము.

క. దేహము మంటలుమండును
దాహము ఘర్మమును చలియు దగ్గుత్తికయున్
మోహాకము మూర్ఛ శోష స
మూహము కాలజ్వరంబు మొగినెన్నదగున్.

శస్త్రఘాతజ్వరము.

క. జగడము శేసిన తనువున
మిగిలిన శీతంబు నిదుర మేల్గనకున్నన్

తగని యజీర్ణము శోషయు
దగిలినచో శస్త్రఘాత దానగునవలిన్.

అష్టవిధ ఆహికాది జ్వరములు.

సీ. గాత్రంబు శీతంబు కాస దాహంబును
సంతాపమును నతిసారశూల
తలనొప్పి పచ్చనై వెలసిన నయనముల్
రమణ నఖాక్షులున్ రక్తహీన
మఱిగ వైకల్యంబు లతిపాండువర్ణంబు
లతిసారజాడ్యంబు లంఘ్రిహస్త
ములును మంటలుగల్గి ముఖమును పాదముల్
హృదయంబు నాభియు గదిసి వాపు

గీ. వెలసి మిక్కిలినిద్దురగలిగి శీత
మైన కాయం బపథ్య వాంఛాత్మగలుగ
ఆహికంబులుగలుగు వాతాదికముల
మూఁటిగుణములు వీటిలో మొనసియుండు.

జ్వరముక్త లక్షణములు.

క. తలయును దేహంబును కడు
చులకనయై ముఖముకనులు చూడఁగ బాగై
తెలివిగ చెమ్మటగ్రిమ్మన
నిలలో జ్వరముక్తమనుచు నెన్నుదురార్యుల్.

అసాధ్య గుణములు.

క. ఎగరొప్పు దగ్గువాకర
దగహిక్కలు చెమట లరుచి తనుభంగము నే
పగుకోపం బతిసారము
దగును దశోపద్రవములు తాపంబునకున్.

### జ్వరముపుట్టగూడని నక్షత్రములు.

గీ. శతభి షాశ్లేష పూర్వ పాషాఢ మూల
స్వాతి పూర్వపుభాద్ర విశాఖ భరణి
పుబ్బ పితురార్ద్రి శని రవిభూమిపుత్ర
వారముల రుజగల్గిన వదలదతని.

## జ్వరసముదాయచికిత్సలు.

### జ్వరచింతామణి.

క. జ్వరచింతామణి టంకణ
హరవీర్యము గంధకము సమాంశ ద్విగుణం
బరయగ నేపాళము క
ల్గర రసమున పెసరగింజ గతినెన్ని యిడన్.

### తరుణజ్వరకేసరి.

చ. ఘనశిలి కంఠవీర్యమును గంధక తాళక వత్సనాభ టం
కణ కటుకత్రయంబు సరిగాగను హింగుళ మన్ని యొత్తి నే
పుణనిసీ కాకరాకురసముల్ మృదులార్ద్రిక వారినూరి వెం
టనుగొన తాపమార్చు తరుణజ్వర కేసరి ధారుణీస్థలిన్.

### తరుణజ్వరమురారి.

సీ. తామ్రభస్మంబు తుత్థంబు రసంబును
తుల వీటివొత్తు హింగుళముగూర్చి
మరిచనాగరములు వరుస ద్విభాగముల్
పాషాణములు మూడు పాళ్లుగాగ
నొనరించి పెరుగునీళ్లనునూరి శర్కర
తోనొసంగ జ్వరంబు మానుతీవ్ర
మన్నంబువేడ్క పథ్యంబుబెట్టిన నిది
తరుణజ్వరమురారి బరగు రసము

జ్వరవిధ్వంసిని.

గీ. తామ్రవిషనాగ కనకట గంధకము ఘూర్త
బీజములు చిత్రమూల వావిలిని యార్ద్ర
సారములనేడురోజులు నూరియివ్వ
గా నగుం జ్వరధ్వంసినీ ఘనరసంబు.

ఉదయభాస్కరము.

ఆ. విషము హింగుళంబు వెస సమంబుగ వేసి
చిత్రమూలరసము జేర్చినూరి
గురిజయెత్తొసంగ హరియించుజ్వరము ర
యంబు నుదయభాస్కరంబు యనఁగ.

జ్వరఫణిగరుడము.

క. జ్వరఫణిగరుడము రసబలి
గరళంబును పాలుపాలుగా నేపాళాల్
దరదం బెనిమిదినాలుగు
మరిధూర్తరసంబుతోటి మర్దనసేయుఁ.

జ్వరమురారి.

సీ. కటుకత్రయము తాళకము గంధకము మాక్షి
కము యవక్షారము కరకకాయ
లును రసంబును విషమును చిత్రమూలము
సైంధవలవణ కాంచనఫలంబు
లోనివిత్తులు సరిగాను వావిలిరస
మును మూడురోజులు ఘనతనూరి
గురిజెత్తు వెలిజీలకరతో నొసంగిన
జ్వరమురారియనంగ దనరుభువిని

జ్వరదంతిదర్పదళనరసము.

గీ. తామ్ర రస విష మరిచ గంధకము లేక
చంద్రలోచన శిఖిగుణ సాటిభాను

మూలక్వాథంబునను నూరి తాళమివ్వ
జనును జ్వరదంతిదర్పదళనరసంబు.

జ్వరదంతిపంచాననరసము.

గీ. గంధకము లోహనాభి ప్రచకాంగి హింగు
శరస పాషాణయుగము తాళకము చిత్ర
మూల శితకార వేల్లిఫలములను గూడ
ధరణి జ్వరదంతిపంచాననరసమగును.

జ్వరహరమూలములు.

సీ. తిప్ప పర్పాటక దేవదారులు నేల
మulకలు వాకుడు ముస్థయుగము
కురువేరు కోతాడి గొంతెమగోరును
మంజిష్ఠయును పెద్దమాను చంద్ర
ఉంద్ర కచోరముల్ యుచ్చిత ల్వల్లేరు
కర్కాటక శృంగి గంటుబార్జీ
కటుకరోహిణి నెల్లి కామంచిపూరియు
వాయింట తక్కెడు వట్టివేళ్లు
మారేడు పసపులు మనుబాల పాలలు
కారుపెసర మంగ కారుమినుము
కాకోళియుగమును కాసరుల్ రెండును
పొన్నలు చెంచలి బోడతరము
లును దూలగోవెలలును నడ్డసరములు
కలజువ్వి నులిదడ ద్రాలుగచ్చ
కాంచనంబులు రేల కానుగ లీశ్వరు
లూడుగ గలిజేర్లు యుత్తరేణు
గీ. తెగడలు స్జైదుసార వుల్లదీగె కరక
తాడి యుసిరికలును యాముదములు కొడిశ
పాలవారిజములు వస పాపరులును
మెలికజముడును ముత్తువపులగములును

సీ. కొండగుమ్ముడు వరగోగు సదాపలు
కొతిమెర్లు చిరుబొద్ది గోరటయును
చన్నడాక ఫరంగిచెక్క పిల్లడుగును
దగనావురును రక్తతాడి రాచ
ముసిడిక శ్రీతాడి యోబిలింత మరాటి
మొగ్గ తాసళిపత్రి మోదుగులును
వెర్రిపుచ్చయు నేలవేము గాకిజడ
లడవిమరిచి తాడి లకలక్ర
గజపిప్పలియు రాస్న కాచయుగంబును
చిత్రమూలంబును చవ్యకోష్టు
పిప్పళ్లు శొంఠయు పిప్పలికట్టెయు
వామంబులును నంది వర్ధనంబు
యారె క్రేంకణ మిరియాలు జటామాంసి
చందనంబును వీరజడగురింద
కాసరయును రజనీసలి మధుకంబు
నాగకేసరములు నారదంబు

గీ. దొండలును యొద్ది బూరుగ పుండరీక
మరవకంబులు రేణుకల్ మంచిగంధ
ఘంటకల్గర మహిసాక్షి గుగ్గిలములు
పోక జిల్లేడు కూతురుబుడమ చిత్రి

సీ. సీకాయ నేలయుశిరిక దవనములు
సాంబ్రాణి మునుగలు సంబరేణి
నీలి వాలుడుపిట్ట కాలుగ గగ్గెర
తులశియు దింటెనల్ కలిశ వృద్ధ
దారు యుమ్మెత్తలు తంటెము కశివింద
చెన్నంగి వెలమ సంధెన్న చీకు
వెలగ భూసాంబ్రాణి యులిమిర కలిగొట్టు
పులిచింత వావిలి బుడ్డబుసర

అంఘ్రాళమీఁదుగు లరటులు లొద్దుగ
లందుగు తుమికియు హంసపాది
జీడియును మయూరశిఖ మాంసరోహిణి
యత్తపత్తియును సర్పాక్షి తుమ్మి
తుమ్మలు సోమింద దుందిలంబులు మిర్ప
గంద్ర శీతాఫల గబ్బసమును
దూసర మంకెన టూకు టేకును యొద్ది
మద్ది విర్గుడి చిటిమాను ప్రబ్బ

గీ. కొరవి మొల్ల సరంగియు గొట్టుపరికె
బలువురక్కసి చిల్లయు బట్టకణపు
కడిమిమొక్కము బూజాల గచ్చ వెలుమ
దాసనము నేలతంగేడు ద్రాక్ష పొగడ

సీ. పొన్నలు వెణుతురు పొణుకులు చేకొద్ది
కోలముక్కును యేపె గున్నగుత్తి
జిట్టకంచియు గొట్టెజిడ్డు భూశర్కర
కొండరావియు గార గొల్లజిడ్డు
కోరింద నెరవింద కుంకుడు విషగండి
కలు చప్పటట్టాకు కట్టకట్టె
కుక్కపాలయు మూరుగొండ నుర్గుడు ముష్టి
గాడిదగడప రకట్లతీగె
జీలుగు పచ్చారి చిటికేశ్వరంబును
బండెడ చిటిముట్టె ప్రాచితీగె
నేలసావరమును నీరుడి బాదము
తాండ్రచెట్టు చిరంచి దంతె గొబ్బి
పనసలపువ్వులు ప్రత్తులు మొసలియు
కుసుమ సరస్వతి కొండజువ్వి
భద్రాక్ష రుద్రాక్ష పాషాణభేదియు
నల్లరేగును కొమ్మి నక్కతోక

గీ. పెరుగుబుడ్డియు యిరుగడల్ పెక్కచెట్టు
మేకమెత్తని తుత్తురు కాకెదొండ
భూతరాకాసి బరివెంక పులుగుపులును
జానసామియు మొగబీరచక్రవర్తి

సీ. కరివేప దిరిశెన కనకామ్రము బిల్లుకు
సహదేవి గొర్మిడి చాతరాసి
పుత్రజీవి విషార్తి పొల్లుగాడియు కుప్పి
భూతాంకుశంబును పూలపుటికి
నేరేళ్లు నక్కేరు నిమ్మ రేగులు జమ్మి
పాలమానును వాక బ్రహ్మమేడి
ఖర్జూర జివ్వియు గంగరావియు మేడి
నల్లమామిడియును మర్రి త్రిఫల
జెముడులు బెండలు చేదుపొట్లయు కల్వ
వెంపలు జిబిలిక విష్ణుక్రాంత
నీరుపిప్పలి పుల్లు లొకై దొండ వావాలు
మండూకబ్రహ్మియు మదనచెట్టు
చిచ్చొంటయును నీరుచిచ్చు గోకటిబెండ
కొయగూర యులవలు గుడ్లనల్లె
చుక్కన పిప్పలి నక్కవెంటయు తెడ
కాజగడ్డలు దేశకారిరుద్ర

గీ. జడయు మునిభేది మూలారి జమ్మి భూత
తులసి యాడంబరియు లింగదొండ ధూమ్రి
పర్ణి సర్వాది భూతాడి భద్రజడయు
నేలతులసి సురస్థాని నేలమర్రి.

సీ. నేలమారేడును నేలబోడతరంబు
నేలబారుదమును నేలమల్లె
నేలపాల సురంగి నెమలడ్గు దాసన
కుక్కమల్లామడ కూర్మకూరి

బ్రహ్మదండియు తీగెబచ్చలి వేములు
నడవియోమంబును యడవిశనగ
లడవిగన్నేరును యడవివీచియు జాజి
కాయ లక్ష్మణఫంజి కలపుదంటు
రేగులు దొండ ద్వీలేములు చిక్కుడు
కాశి పుష్పంబును కంఠస్త్రాలి
అంబాళ మూర్వాణి యడవితుమ్మయు తూర్వ
బెండలు బీరలు రెండు నేల

గీ. రావి విషముష్టి వాయువిళంగములును
యత్రపా ల్మల్లెలును జ్వరహారములైన
మూలములటంచు ధన్వంతిరి మున్ను దెల్పె
గుణముగాంచి కషాయంబు గూర్పవలయు.

శీతజ్వరధూపము.

క. వెల్లుల్లిపొట్టు యింగువ
వల్లగ నారణ్యతులసి వోమంబులు రం
జిల్లగ ధూపము వేసిన
మెల్లగ శీతజ్వరములు మొదలకతొలగుఙా.

పథ్యములు.

సీ. కొయ్యతోటయు చిత్రికూరయు లేతవం
కాయలు నలపొట్లకాయ పండు
గుమ్మడికాయలు కోమలంబగునల్ల
కాచకూటయు పథ్యకరములౌను

తరుణజ్వరములకు

తరుణపు వేకులు దగిలి లంఘనముల
జేసినచోనంజు కాగపడిన
జనులకు మూడవఝామున పథ్యంబు
బెట్టగా మేలది విడచిరేప

గీ. కడను దెలియక భోజన మిడినపాండు
యక్ష్మముఖరోగములు బుట్టునవియుదప్పె
నేనిచంపునుగావున దీనిదెలిసి
తరుణమగు వేకివారల నరయశుభము.

పురాణజ్వరపథ్యములు.

సీ. పిదపరాజనముల బియ్యపుబోనంబు
పొట్లకాయలు చిక్కి పొన్నగంటి
కూరలువండిన గుమ్మడి లేతవం
కాయలు కోడిశకాయ లేత
యరటికాయలు నయమైన లఘుద్రవ్య
ములును జాంగలమాంసములును పెసర
కట్టావునెయ్యి మేకలవెన్న ధనియాలు
పులిచింత జీరకల్ పొల్పుమిగుల

గీ. పాతవేకులవారికి పథ్యమిడగ
వలయునిదిశాస్త్ర పద్ధతి దెలిసి వైద్య
సార్వభౌములు మనసు లుత్సవమునొంద
శివునికృపచే చికిత్సలు జేయవలయు.

ఉభయజ్వరాపథ్యములు.

సీ. నెలలారిటను బండియిలనొప్పు బియ్యప
న్నము పచ్చనగు కూరలు మినుములును
యత్యుష్ణమైన ద్రవ్యంబులు పగలు
నిద్రించుటయును తలంటించుకొనుట
నీరుమిక్కిలిద్రావ గోరుట రతికేళి
నడచుటకోపంబు తోడరనెండ
బడలిక పసరు గుమ్మడికాయ కంద నూ
నెలు వెన్న యరటిపండులు నపథ్య

గీ. వస్తువులటంచు దెల్పిరి వైద్యమణులు
పాతవేకులవారికి లేతవేకి

వారలకు శత్రువులుగాన వాటివిడిచి
తగినపథ్యంబు పెట్ట నింపగునుధరణి.

ఆశ్వాసాంతము

మ. పురజిద్వీర్యసముద్భవప్రముద కృద్యూథజాతపాత కపా
చరసంఘాత ప్లవంగనేత మునిరాట్సంస్తూయపాదాబ్జ భీ
కరలాంగూలనిబద్ధచేలజనితోగ్రహాగ్ని సందహ్యతా
సురసాధాంగణ పఙ్క్తికంఠ భయదాత్ముద్రప్రభావోన్నతా.

క. సురగణనుతపరినరకృత
శరణాగత విక్రమాద్రిజావల్లభ స
త్కరుణాధృత చరణాయుధ
వర కేతు సదృశశౌర్య వరగాంభీర్యా.

భుజంగప్రయాతం. మహద్దివ్యనామా మణిస్నిగ్ధధామా
దహాత్యాసురౌఘా ధరాజావిలోకా
గుహానంతశౌర్యా కుభృద్రాజధైర్యా
సహాయార్కజాతా సదారామదూతా.

గద్యము.

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధకవిత్వారాజ తుల్జాజి
శరభరాజ ప్రణీతంబైన శరభరాజీయంబను వైద్య
శాస్త్రంబునందు వాతప్రకరణంబును దోష
జ్వరప్రకరణంబును సన్నిపాత ప్రకర
ణంబును జ్వర ప్రకరణంబునుం
గలతృతీయాశ్వాసము

———

# శరభరాజీయము.

—:o:—

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరామాక్షుఁమాణి
క్యారూఢ స్తగితపేటికాకృత వదనా
కారుణ్యా పూర్ణలోచన
సూరిస్తుత కోమిరపూడి శుభహనుమంతా.

### పదునాల్గవపద్ధతి.

(ప రి భా ష)

సీ. జనులభుక్తద్రవ్యజాత దోషంబుల
కై విరేచన ఛర్దికంబు లనగ
రెండుపచారంబు లుండును తద్భేద
మెరిగింతు వైద్యధీవరులుమెచ్చ
మేహాశరీరికి సాహసంబున నారు
నెలలకు వాంతికి నెలకుభేది
యిల పైత్యదేహికి నలరెండుమాళ్లు వి
రేచనంబునకొక్కరోజు పిత్త
వాతశరీరికి వాంతికివ్వగరాదు
మాసత్రయంబున మలవిముక్తి
భావింపదగు వాత పైత్యదేహికిమాస
మునకు విరేచనంబునకు మూడు
నెలలకు వమనంబు వెలువడసేయంగ
నగు మేహపైత్యదేహంబువాని

కొకసారి నెలకు భేదికి నాల్గు నెలలకు
వమనంబునకు నివ్వ వలయునింక
మరివాతదేహికి మిరియాలచారు న
నన్నంబు నిడ మేను తిన్ననగును
మేహశరీరికి మేదినిపై జీల
కఱ్ఱ చారన్నంబు జఱ్ఱనగును
ధర పైత్యరోగికి ధనియాలచారును
నన్నమొండించుక గొన్న మేలు

గీ. వాతపైత్యశరీరికి వట్టిచారు
నన్నమొప్పును మేహపైత్యునికెందు
కోరినన్నంబు కరివేప చారుగూర్చి
నరులు సేవింపదగు భిషగ్వరులనడిగి.

కాలవిశేషము.

సీ. ఘనవసంతము గ్రీష్మ లనుత్కృష్టవర్షము
శరదృతు హిమవంత శ్వశనశిశిర
ఋతుపైత్యమును తెల్లవారుఝామునుదయ
మైనఝాముదనుక పైత్యగుణము
మధ్యాహ్నమౌననుండి మాపటిఝామున
మేహగుణంబులు మెలగుచుండు
సంధ్యకాలమునుండి సరస మూడవఝాము
వాయువగుణవశాచు వరలుచుండు

గీ. ఋతువులందును లంఘనమితమునందు
జేయువలె కాలమందున్న చేష్టలన్ని
నెఱిగిరోగంబులెంచుడు నరవితోడ
మందులొసగుడు కరుణించి మాన్వరుజల.

గీ. ఉష్ణఋతువందు లంఘనముంచరాదు
శ్వసన ఋతునందు లంఘన జాలమిగుల

పైత్యఋతువందు మితముగ బనుపవలయు
ఋతువులను లంఘనంబులు రూఢిగాను.

గీ. ఉష్ణఋతువున తగుమందు లోపవలెను
గుణముదనుకను వాయువగొనుడి ఘనము
పైత్యఋతువందు నౌషధం బరుపసగము
దినమునకొసంగి సౌమ్యంబు బనుపవలయు.

దేశవిశేషము.

గీ. చౌటభూమినియుష్ణము చాలముండు
నల్లభూమినివాతంబు నంజుమిగుల
యెఱ్ఱభూమినిపైత్యంబు విరపీగు
యిసుకభూమిని నంజులు యూష్ణముండు.

గీ. చౌటభూమిని శైత్యోపచారములును
నలుపుభూముల నుష్ణంబు గల్గురీతి
యిసుకభూమినిపైత్యంబు వెసనడంచి
నంజులను బాపవలయు ఘనంబుగాను.

గణపరిభాష.

సీ. చింత దాడిమ రేగు శీకాయ మామిడి
ఆమ్లపంచక, నిమ్మ మాదిఫలము
చింత యంబాళము శీకాయ ఫలపంచ
ఆమ్ల, ద్రాక్షా ఖర్జూర ద్విఫల
ములు, జాజి పోకలు పలువంగకాయ త్రి
తీయఫలములం్రదు, తొలుతలాజ
దాడిమ ఖర్జూర ద్రాక్ష శర్కరలును
సంతర్పణయగును, సజ్జకార

గీ. మోదుగ యవక టంకణ యుత్తరేణు
క్షార శంఖంబు నప్పు ద్విక్షార చింత

క్షారమష్టక మను రావి మర్రి జువ్వి
మేడి కలజువ్వి పంచము క్షీరములగు.

సీ. నెల్లి చిత్రకమును భల్లాతకి జిల్లేడు
కానుగ పంచ మూలాగ్నులనఁగ
సైంధవ సౌవర్చ బిడ కాచసాముద్ర
లవణపంచకములు, ఆవుమూత్రే
పాలును నెయ్యియు పేడ పెరుగు పంచ
గవ్యంబు, ఆకును కాయ పూత
చక్క విత్తులు కల్పి చక్కగాపంచాంగ
ములు. నెయ్యి తేనెయు బెల్లమమర

గీ. మధుత్రయంబును, యేనుగ ఆవు గొర్రె
గుఱ్ఱమును వంటె గాడిదె బఱ్ఱె మేక
మూత్రమష్టకమగు, నుప్పు చేదు వగరు
పులుసు కారంబు తీపి షడ్రసములనఁగ.

పంచలోహములు.

బంగారు వెండి రాగి సీసము తగరము ఇవిపంచలోహములు. సత్తు కంచు యిత్తడి యినుము యివిచేరి నవలోహములు. చంద్రకాంత సూర్యకాంత శిలాద్వయము. మాణిక్యము వైడూర్యము మరకతము నీలము పద్మరాగము వజ్రము పచ్చ పుష్యరాగము గోమేధికము ఇవి నవరత్నములు. చాగ మహిష వరాహ మత్స్య శిఖి వీటిచేదులు పంచపిత్తములు. హేమమాక్షికము కాకమాక్షికము మాక్షికద్వయము. గౌరిపాషాణము దొడ్డిపాషాణము ఉల్లిపాషాణము పాషాణత్రయము. నీలాంజనము శ్రోత్రాంజనము పుష్పాంజనము గౌర్యాంజనము కుళుద్ధాంజనము సౌవీరాంజనము రసాంజనము అంజనసప్తకము. రాతియుప్పు రాతినార రాతిపెరుగు రాతికాయ రాతిజున్ను శిలాపంచకము. హరిదళము తాళకము మణిశిల శిలాత్రయము. రెల్లు కుశ తుంగ కామంచి దర్భ తృణపంచకము.

జున్ను గోరోచనము పావురాయి రోచనాత్రయము. వెలంది తిప్ప సత్తుత్రయము. శర్కర బెల్లము తేనె యిప్పపువ్వు అతిమధురము శర్కరాపంచకము. ఖండశర్కర మధుశర్కర శర్కరాయుగము.

పుటములు, యంత్రములు.

సీ. జొన్నలనడుమను వన్నుగా మందుల
బోసగించగా ధాన్యపుటము బరగు,
నేల జానెడులోతు నిమ్ముగా గుంటగా
త్రోవ్వి మందును నందు తునిమి పైన
మన్నుగల్పుచు వైచి మిన్న దాలియు సెగి
జేరచ భూపుట, మారయంగ
బొగ్గునుమ్ముక మన్ను నిగ్గుదూదియు నూరి
మూస జేయగ వజ్రమూస దనరు,
మందుల వాలుకంబాదు వడ్లను జేర్చి
వేలగించగ వడ్లు వెలిపడగ
మందుపాకమగును, మధిక శైలంబులు
పుడకముంచియు గాల్చి బొట్లు నిప్పు
పైన వేసిననది భగ్గున మండిన
చిటచిట లేకున్న స్థిరముపాక
మనగ, కుండకు క్రిందమంట దీపంబుగా
నను బెట్టనదియు దీపాగ్ని యనగ,
గుప్పెడుమంటగా నొప్పగనిల్పిన
కమలాగ్ని యానది యమరగాను,
విస్తారముగమంట సుస్థి జేయక బెట్ట
గాఢాగ్ని సదియండ్రు ఘనులుధరణి,
లేహ్యపక్వములన లెనపిన పుడకకు
తీగవచ్చిన చూర్ణ దినుసుగలపి
గవిఘృతమును చిక్కగా గనిహితవైన
చూర్ణమందున వైవ శుభ్రమగును

ఘనరసాయనముగ గాచి యంబలిగాను
వండి పక్వంబును వరుసగనుసు
తెరకుప్పలను వేయ దెలియుడిమందును
కడ్డితోగల్పిన గనియుచివర
కొసను వర్ణముదిగ గొనుడి నౌషధములు
సిందూరములకును చెన్ను మీర

గీ. డమరుగంబను వాలుకంబనెడు యంత్రి
ములను దీపాగ్ని కమలాగ్ని గాఢవహ్ని
బెట్టినది సాంగశీతల క్రియముగొనుడి
భస్మ సిందూరములకెల్ల బౌరజూచి.

సీ. తైలంబులకునెల్ల దనరమొదటమంట
గాఢాగ్ని కమలాగ్ని ఘనముమీరు
దీపాగ్నులనువండి దీసి నూతనవస్త్ర
మున వడెబోసిన ముఖ్యమంత్రము
కుండ కాగుతునుండి కూర్మి తైలము కుండ
చల్లగానుండును క్షణముమాత్ర
మదిసాంగశీతల మనుచుమందులకెల్ల
తైలంబులకు ముఖ్య దద్దుణధరణి

గీ. మండమూకుడుపక్కను నిండుకంత
కొమ్ముగానుంచి క్రిందుగా నిమ్ముగాను
పిడతబెట్టిన నందొచ్చు పేర్మిధృతులు
ద్రావకంబులకిదిభట్టి భావమమర.

మాతకరిమను.

ఉ. భేషజరమ్మనంచు మరి బిల్వగదూతను వాక్యసాధ్యమా
మోసముమాటలాడ కదు ముఖ్యపుకీడు నసాధ్యరోగమా
వాసమునుండి స్వచ్ఛకున వైద్యుడుగాంచిన మంచిదాను మే
లాసమయంబునన్ శకునమారయ మెత్తగనున్న జచ్చెడిన్.

వంటకల్కము.

గీ. గోరోచనమును యింగువ గారగుజ్జు
ఆముదపుపప్పు మిరియాలు ఆకలకర్రి
సైంధలవము తుత్తసమము జలముతోను
వేయ దోషహారంబు గోవిందపుత్రుజస్త్రి

వ. యింగువ మిరియాలు సైంధలవణము యిర్రిచేదు నల్లతుమ్మాకు పటిక అతిమధురము యివినూరి కన్నులలో వేయవలెను. మంచిగోరోజనము యింగువ సైంధవము గారగుజ్జుపటికె నల్లిపోతు యివికాకరాకుతోనూరి వేయవలయును.

ఇచ్చటనుండి శరభరాజకవి పుత్రుండగు
మాధవరాయని కవిత్వము.

శా. శ్రీమన్నారద జైమినీప్రముఖ సంసేవ్యుండు వేదాంత వి
ద్యామాధుర్య రసానుభావగణరాట్తాత్పర్య సంధాన ని
త్యామందస్మిత చారువాఙ్నిపుణుఁ డాత్మానందముప్పొంగఁగా
హేమాద్రీశ్వర చాపధారుఁడగు కోటీశుండు నన్ బ్రోవుతన్.

సీ. శ్రీగిరిజాకాంత్రి సేవాపరుండనై
విష్ణుప్రభావంబు వినుతిజేసి
కమలాశయంబు నిక్కంబుగా గొనియాడి
విశద సద్భక్తితో విధికి మ్రొక్కి
శమదంబుల సరస్వతి పదంబులవ్రాలి
నిఖిలాంతరాయవనీదవాన
లుండగు విఘ్నేశు నిండు వేడుకగొల్చి
కాళిదాసాది సత్కవులనెన్ని

గీ. పిదప నన్నయ తిక్కన విన్నకోట
పెద్దనామాత్యులను నుతి పెక్కుమార్లు
జేసి గురునుతిగావించి చిత్తశుద్ధి
కబ్బమొక్కటిరచియింతు కవులుమెచ్చ.

సీ. మామకజనకుండు మదనారిసదృశుండౌ
శరభాహ్వయుండు యీశాస్త్రమందు
పదునాల్గుపద్ధతుల్ బాగుగావిరచించి
యొకనాడు ననుజూచి యోరిపుత్ర
మాధవాఖ్యాయికమర్త్య సుఖంబొల్ల
భూతేశుఁజేరగాబోదు నీవు
కడమపద్ధతులును నుడువు కోటీశ్వరు
కరుణచే నీకబ్బు కవితజెప్ప

ఆ. శక్తి యనుచునతుల సత్కృపబోధించి
కాలకాలధృత కపాలశర్వ
శివమహేశశూలి శ్రీకంఠయనుచును
తనువువిడిచి శివపదంబుఁజేరె.

క. వ్యాస్యంబగు పరసంస్కృత
విద్యను సాధించనట్టి వెజ్జని నాచే
వైద్యగ్రంథం బెటువలె
పద్యంబులుగాను జెప్పఁబడునని మదిలోన్.

క. యోచించి నిదురబోయిన
బూచులదొర స్వప్నమునను బొడచూపి కడున్
వాచాలుడగుచు సత్కృప
తో చొప్పగు కవితగూర్చు త్రోవనుజూపెన్.

ఆ. మేలుకాంచి మిగుల తాలిమి స్వప్నవృ -
త్తాంతమపుడు విబుధతతికి దెలుప
కూరిమెసగ వరము కోటీశ్వరుడు నీకు
బల్కు గ్రంథమనిరి పౌఢవగుచు.

క. గిరిజారమణుని పల్కులు
వరకావ్యశ్రేణి మృదుల వాక్యంబులునే
నరయ నొకటయ్యెగావున
విరచింతును వైద్యశాస్త్ర విషయములంచున్.

ఆ. నిశ్చయించినాఁడ నెనరుంచికవులార
తప్పులున్న చోట తగినసరణి
దిద్దవలయు నన్ను దేలికసేయక
వేఁడుకొనెదమిమ్ము వివిధగతుల.

---

పదునైదవపద్ధతి.

(శ్లేష్మరోగ ప్రకరణము.)

సీ. గళశ్లేష్మ దధిశ్లేష్మ కాసభవశ్లేష్మ
శుష్కశ్లేష్మంబును శోభశ్లేష్మ
పైత్యశ్లేష్మరిబును పాండుజశ్లేష్మంబు
కాలశ్లేష్మంబు బంగాళశ్లేష్మ
వాతశ్లేష్మంబు జిహ్వాశ్లేష్మమును క్షత
జశ్లేష్మమును మహాశ్వాసశ్లేష్మ
క్షీణశ్లేష్మము క్షయశ్లేష్మంబు శోషశ్లే
ష్మము ఘృతశ్లేష్మంబు తిమిరిశ్లేష్మ

గీ. ఘనతరమగు దివాశ్లేష్మ కండుశ్లేష్మ
ములు మహోగ్రంబులగుచు మర్త్యులకుబుట్టు
చాలబాధించు తొలుతటి జన్మకలుష
హేతువున ప్రాయశంబుగా నిరువదియును.

శ్లేష్మరోగలక్షణములు.

సీ. సతతంబు ధాతుశోషము దగ్గుగల్గిన
తరిగళశ్లేష్మంబు పెరుగువలెను
కఫమును జ్వరమును గళభంగమును మూర్ఛ
దగ్గు చెమ్మటగల్గ దధిసమాఖ్య
రాతిరెల్లను యొక్కరీతిగాబడుచున్న
కాసశ్లేష్మంబగు కంఠమందు

ధ్వనివాపుమెప్పను దనరితెమ్మడగల్గ
శుక్లశ్లేష్మంబును శూలవణకు

గీ. వాపు యెగరొప్పు పీనస వాంతి చెవుడు
కాంతిహీనంబు నిప్పత్కి గ్రహణి చల్ల
దనము తలకండునొప్పు నిద్రయును యరుచి
బెంపుగాశోభశ్లేష్మంబు జంపునరుల.

సీ. వేకియుమంటలు వాకరభ్రమ మూర్ఛ
స్వరహీనమందాగ్ని శ్వాసకాస
తంద్రాధికములు పిత్తంబుగ నోటను
నీరువెళ్లుట యతిసారగుణము
గలపైత్యశ్లేష్మ మిమ్ముల జంపునెక్కిళ్లు
శూలయు వాంతి రోమాలునిక్క
తంద్ర శీతము నిద్ర తలద్రిప్పుడును దగ్గు
హీనస్వరము రొప్పు పీనసాతి

గీ. సారమును వాపు రక్త మాంసములు లేక
తనువుచిక్కను నోట నిత్యంబునీరు
గారు తలచల్లగానుండు కాంతిహీన
మగును నిప్పొండుశ్లేష్మంబు దగిలిచంపు

కాలశ్లేష్మము.

క. కాలశ్లేష్మము శీతము
శూలభ్రమ తంద్రమీది చూపును చెమటల్
ఫాలంబున హిక్కలుగల
కాలశ్లేష్మంబు మరణకాలముజూపున్.

బంగాళశ్లేష్మము.

క. తెమడ తెగిపడుచు గళమున
సిమిరగు బంగాళి శ్లేష్మ చిక్కడమును వా

లెముకడు నొప్పి వాకర
భ్రమ వాతశ్లేష్మమిదియె పరికింపగన్.

జిహ్వాకాశ్లేష్మము.

గీ. ఆననము గండుగానుండి మూసికెవ్రడు
జ్వరము భ్రమకంప మూర్ఛ తాపములు గొంతు
లోన నసిమిసిగలుగుచు మానవులకు
జేటుదెచ్చును జిహ్వాకా శ్లేష్మమహహా.

క్షతశ్లేష్మము.

క. వాకర గునుత్వ మరుచియు
నైకొని యెగరొప్పు దగ్గు బహుతరశీతం
బేకతమైనను క్షతమగు
భీకర శ్లేషంబుబూను పెత్తినమమరున్.

శ్వాసశ్లేష్మము,

గీ. ఆననము మెప్పు తలనొప్పి యరుచినోరు
గామకళపూర్ణమైయుండి కంఠ మెవ్రడు
నసిమిరి శ్వాసశ్లేష్మంబునన్ జనించు
కుదురుచున్వచ్చు చంపదు కొన్నినాళ్లు.

క్షీణశ్లేష్మము.

క. పదముల కరములమంటలు
వదలని వేకియును శూల వడకు నరుచియున్
మదము తలచల్లనై యది
కుదురదుగా క్షీణశ్లేష్మగుణములకునైనన్.

క్షయ శోష ఘృతశ్లేష్మములు.

సీ. మలబద్ధ వమనాగ్నిమాంద్య నిద్రారుచి
శోషతంద్రాజ్వర శూలముప్ప

తిక్తామ్లజలము లతీసార దాహము
క్షయ శ్లేష్మగుణములు జంపునరుల
రొమ్ములోమంట జ్వరమ్ము వాకర రొప్పు
దగ్గుప్రవృత్తులు దాహమూర్ఛ
నోరుయెండుట యుమ్మిగారుట శోష శ్లే
ష్మముకుదురదు వేగ యమునిజూపు

గీ. దగ్గు నసిమిరి వేకియు దాహమూర్ఛ
దగినను రాత్రిపవలు రక్తంబుబడుట
భ్రమయు వాపును హీనస్వరంబుచల్వ
గాంచి భ్రమించును ఘృతశ్లేష్మ మెంచనేల.

తిమిరశ్లేష్మము.

క. పగలేమిలేక రాతిరి
యెగరొప్పును తెమడ నిద్దురేమియు లేకన్
తగనినసకంఠమందున
దగ తిమిరశ్లేష్మమిదియె తగుక్రియనడగున్.

దివాశ్లేష్మము.

క. పగలున్ బలువగుతింటికి
పగ సేయుక రాత్రిలేక బహురీతులనే
వగజూచు దివాశ్లేష్మం
బగణితమిది కుదురు కుదరదనగూడదుగా

కండూశ్లేష్మము.

క. నెప్పులు మోకాళ్లును నరు
నెప్పుడుగూర్కంగనివదు హితమియదు తినన్
తిప్పుడు చెవుడును వాపులు
గప్పును కండూతిశ్లేష్మ గతులివిచంపున్.

శ్లేష్మరోగచికిత్సలు. శ్లేష్మాంతకఘృతము.

సీ. ఇరికిచెక్కరసంబు నిరవంద మూడుసొ
లలు దేవదారును కలిశవేళ్ళు
నక్కదోసనమూల మెక్కుడుదానిమ్మ
చిత్రిమూలము వేపచెట్టుచెక్క
చంద్రచెక్కలు వీటిసారము ల్మాదిఫ
లము పుల్లప్రబ్బఫలంబు నిమ్మ
పండ్లును నారింజపండ్లు చింతలపండ్ల
రసములు ముల్లుగోరంటవేళ్ల
రసమొక్కటొక్కటి వెసను మూడరసోళ్ళ
కొతి నావులచల్ల నేతిబొట్టు
పెరుగు పంచితములు నిరువొందనావుల
దూడపేడరసంబు మూడుతవ్వ
లలమడగా వీటినన్నిటి కలగాచి
సాంగశీతలముగా జతయొనర్చి
ఖర్జూరపండ్ల ద్రాక్షఫలంబులును తేనె
ద్రొక్కినముద్ద నందులనుగలపి
గీ. రేగుబండంత భక్షించి రేని యిరువ
దియును శ్లేష్మములనుమాను నియతి తొల్లి
చందురుడుజెప్పె భిషగీశసంతతులకు
నవని శ్లేష్మాంతక ఘృతంబనగ నెగడి.

చిత్రకాదిఘృతము.

సీ. క్రిమమొప్ప చిత్రమూలము వేళ్ళపొట్టును
వెదురుకట్టెలు వట్టివేళ్ళు వేప
లొద్దుగ మారేడులును పుల్లదానిమ్మ
మూలపుచెక్కలు నేలవేము
కాలగంజలవేళ్లు కలిశవేరులును ప
ర్పాటకంబును మంచి వాకుడులును

ఘనతవాక్షీరి యొక్కటి యొక్కటెనిమిది
ఫలములుగాదూచి పలయుజలము
లందున వేసి యష్టావశేషంబుగా
గాచి దించిసయట్టి క్వాథమునను
పంచకవ్యంబులు పడఁబోసి పాతబె
ల్లమునుంచి చిత్రమూలంబు శొంఠి
పిప్పళ్లు చవ్యము పిప్పలి మూలంబు
త్రిఫల లవంగముల్దెలియ మొగలి
చంష్లు చింతలచక్క కొండమామిడియును
శిరికెచక్కయు పులిచింతలమర
దానిమ్మచక్క నిద్దపునేలయుసిరిక
చూర్ణించిసమములు జూచివేసి
ఘృతపాకముః వండి ఘృతముచల్లారిన
వేళ బెల్లము తేనె యూలనెయ్యి

గీ. కొంచముగవేసి కలెబెట్టి మించురేగు
బండుమాత్రంబు భక్షింపబడిన శ్లేష్మ
లిరువది హరించునని రశ్వినేయులవని
చిత్రకాదిఘృతంబు ప్రసిద్ధముగను.

### పిచ్ఛిలాదిఘృతము.

సీ. కరమొప్ప యిరికిచక్కయు లొద్దుగలురెండు
తెల్లజిల్లేడు నాగమల్లెవేళ్లు
వాకుడు జిల్లేడు వావిలి కలిశ ని
మ్మలవేళ్లు చెరుకుతుంటలును చిత్ర
మూలంపు మొలుపును నేలవేమును దేవ
దారురసంబులు తెగసమంబు
గానొనగూర్చి కషాయము వడిగాచి
ఆలనెయ్యియొకింత యందునుంచి

దాచినచక్కయు తాళీసపత్రి యా
లకులును చిత్రమూలంబు కోంకె
చవ్యము నాగకేసరములు మోడి పి
ప్పలి మిరియాలు త్రిఫలములమర
సమములుగూర్చి కుంకుమపువ్వు యొకదాని
తోడను మూడు యెత్తులుగ వేసి
తగచూర్ణమొనరించి తగినట్టు పాతబె
ల్లము వేసి ఘృతపాకమమరఁజేసి
గీ. రేగుబండంత భక్షింప బాగుసేయు
యిరువదియు శ్లేష్మములుహరియించు తొల్లి
యశ్వినులుజెప్పిరిది మేలటంచుభువిని
పిప్పిలాదిఘృతంబు సంప్రీతిసేయు.

వ వెనుక ఘృతప్రకరణములో జెప్పిన నిర్గుండీఘృతము నివ్వ
వచ్చును.

చూర్ణములు.

గీ. తులగ నిరికిచెక్క తులసి యూడుగవేరు
లమర నాగకేసరాలు చూర్ణ
పరచి జనులు యావుపెరుగుతోభక్షింప
యిలను సకలశ్లేష్మములు దొలంగు

సీ. ఘనమగు నిరికిచెక్కలు వట్టివేళ్లు వా
కుడు నేలపొన్నలు కోలపొన్న
పల్లేరు ముల్లులు భాసురంబగు దిరి
శనపువేరులత్రాట దసరదాని
పత్రము ల్పువ్వులు పైకట్టె వొల్పును
కాయలతోగూడ గలిపియైదు
వస్తువుల్వొకటి వస్తువులుంగూర్చి
సమభాగములుగాగ సంగ్రహించి

గీ. చూర్ణమొనరించి బేడెత్తు జూచి యావ్రు
నేత భక్షింపజనులకు ఖ్యాతిమీర
శ్లేష్మముల్మాను నిరువది సిద్ధముగ న
టంచు నశ్వనిదేవతలనిరి తొల్లి.

పంచనింబాదిచూర్ణము.

సీ. వేపవేరులచక్క వేపాకు పండ్లు పు
వ్వులు మొద్దుపైనన గలుగుతోట
చెలువొప్ప జాజికాయలు లవంగములు పో
కలపప్పులు తకోలములు గణింప
నారతికర్పూర నుమరముత్తువపులు
గంబు ద్రాక్షద్వయ ఖర్జూరములు
కరకకాయలునునాగరము గుడంబు దా
నిమ్మ యుసిరిక మూలమ్ము వాలుపు
చింతచెక్కయు పులిచింతయు యలకొండ
మామిడిచక్కయు మంగవేళ్లు
వెదురుకట్టెలు చిల్లవేళ్లు పాపరవేళ్లు
నిరికియాకులు నన్ని సరిగగూర్చి

గీ. చూరనొనరించి మంచి జంబీరరసము
బోసి కలెదీసి యెండలో మూడుదినము
లుంచి కర్షంబు నరులుసేవించిరేని
పంచనింబాది శ్లేష్మముల్ ద్రుంచునవని.

శ్లేష్మాంతకరసము

సీ. రసలోహ వైక్రాంత వసనాభి హింగుళ
మండూరములు హేమమాక్షికంబు
గగనద్వితుత్థముల్ ఖల్వంబులో సమాం
శలుజేర్చి జిల్లేడు చంద్రవిరికి

వెదురాకు దానిమ్మ వేప చిత్రకి నిమ్మ
పంచ్లరసంబుల బట్టినూరి
మినపగింజంతమాత్రను త్రికటు త్రిఫ
ల కషాయమున గ్రోల సకలమైన

గీ. శ్వాసకాసలు శ్లేష్మముల్ జ్వరము భ్రమలు
దోష హృద్రోగతతులును దుమ్రించుననుచు
చందురుడు జెప్పెగాన నిస్పందియముగ
నవని శ్లేష్మకుఠార మీయౌషధంబు

శ్లేష్మదావానలము.

సీ. రసమొక్కపాలు దరద భస్మరెండు కాం
తపుబూదియాఱు గంధకమునాల్గు
మండూరమెనిమిది మహితతాళక మొక్క
భాగఁబులిట్లు ఖల్వమునజేర్చి
పర్పాటకము చంద్ర వావిలి గుంటక
లర యాకుసారముల్ విరిగిచక్క
రసమున వేర్వేర వెసమూడుదినములు
చొప్పున మర్దించి యొప్పమాష
మాత్రంబు మాత్రలమునజేసి త్రికటు త్రి
ఫలములు విషబొద్ది పర్పటకము
దాచిన యాలకు ల్తాళిస నాగకే
సరములు చూర్ణించి సరిగ పంచ

గీ. దారగల్పియు కర్ష మాత్రంబు బొడియు
గుళికనొక్కటి నేతితోఁగూర్చి గొనిన
శ్లేష్మహృద్రోగములదుమ్రించు సిద్ధమిదియు
హరునివచనంబు శ్లేష్మదవానలంబు.

శ్లేష్మాంతకము.

సీ. రసమూరుపాళ్లును వసనాభితొమ్మిది
బలిమూడుగా మణశిలయు రెండు

తాళకంబొక్కటి దారదంబెనిమిది
మైలతుత్థమునాల్గు మధుకమైదు
భాగంబులుగను పిప్పళ్లునాలుగు చల్వ
మిరియము లొకభాగ మిరువపరది
పాలతుత్థంబు నేపాళముల్ క్రమమున
రెండేడుభాగముల్ రెంషుహేమ
మాక్షికంబును కాకమాక్షికంబును నారు
మండూరమైదు తామ్రంబురెండు
పాళ్లునీకీతి దప్పకగూర్చి నల్లయు
మ్మెత్తాకు జిల్లేడు చిత్రమూల
విరికియు గుంటకల్గర తెల్లజిల్లేడు
రసములతోడ మరాటిమొగ్గ
ల క్వాథమున త్రిఫల కషాయమునను వే
ర్వేరుగాబోసియు నూరితీసి
పరగ డోలాయంత్ర పాచనంబొనరించి
సమముదీనికి మహిసాక్షిశుద్ధి
జేసివేసియు నేయిపోసి శర్కర తగి
నట్టుగానిడి నూరి యువనిజనులు

గీ. రేగుబండంత గ్రోలుచు రేపుమాపు
నావుపాలును శాల్యాన్న మారగింప
వాతపైత్యంబులును శ్లేష్మ జాతినణచు
కరుణ శ్లేష్మాంతగుళికలు హరుడుజెప్పె.

శ్లేష్మమునకు పథ్యము.

గీ. కంద యుచ్చింతి ఘృతము కాకరయు చామ
గడ్డ నల్లేరు రామముల్కలును చేత
రాసి చిర్రియు కాచకూరయును మట్టు
బీర కలిశాకు పథ్యము లెట్టవలయు.

అపథ్యములు.

సీ. గుమ్మడియట నెల్లిగూర చాపలు నూనె
పెరుగుదోటయు బఱ్ఱెపెరుగు పాలు
చలువైనకూరలు తిలలు గోధుమలు వం
కాయలు సొర పొట్లకాయలరయ
గొఱ్ఱె మేకలనెయ్యి కొమరొప్ప నీరుల్లి
గడ్డ గురుత్వంబు గల్గినట్టి
వస్తుజాలము పిండివంటలు శ్లేష్మరు
క్తులకు శత్రువుల్గాన దెలిసి
గీ. వైద్యములు సేయువారలు వసుధలోన
వీటిని యపథ్యకములని విడచిపెట్టి
మందునిచ్చిన మంచిది మానకవియె
పెట్టరేనియు చంపు సీపృథ్విలోన.

---

## పదునారవపద్ధతి.

### (క్షయరోగ ప్రకరణము.)

క్షయరోగరాజప్రభావము.

సీ. క్షయరోగనృపతికి జాయ కామిలయగు
పాండువు సేనాధిపతిగణింప
తనయునా రక్తపైత్యమునొప్పు శోభాతి
సారము ల్విహితులు శ్వాసకాస
లాతనిమంత్రులు వాతపైత్యంబులు
వరగూఢచారులు వమన మరుచి
గుంద్రముల్ గ్రహణులు గుల్మ శూలాశలు
గాయకులౌ రజక ప్రముఖ్య
గీ. వాద్యకారులు కఫ మగ్నిమాంద్య మమిత
శీతలము కార్శ్యసంతాప జాతహీన

బలవిరేచనములు పరివారగణము
గానదిది రోగరా జనగాదనర్చు.

క. పరిపరిసంఖ్య క్షయులకు
బరికింపగశాస్త్రములను బల్కిరి నే నే
ర్పరతు చికిత్సాసంగ్రహ
మరసియు పదునాల్గుక్షయ లటంచునుదీనన్.

వాతక్షయ.

క. మెడవెనక పక్కలను నె
ప్పుడు నొప్పులు కుతికెబొంగుబోవుట్ల వేకే
ర్పడి దగ్గు భ్రమయు శైత్యము
కడువడి వాతక్షయ ప్రకారము దెలియన్.

పైత్యక్షయ.

క. జ్వరదాహ రక్తవాంతులు
బరగి విరేచనము శ్వాస భ్రమ శుక్లము స
త్వరముగ నశియించిన ని
ద్దర పైత్యక్షయ యటంచ్రు తజ్ఞులు బెలుచన్.

శ్లేష్మక్షయ.

క. మందము శైత్యము వాకర
లుం ద గ్గూర్ధ్వంపుశ్వాసలున్ రుచిహీనం
బందుట బడలిక తనలో
జెందున్ శ్లేష్మక్షయాహ్వ చేష్టలు దెలియన్.

త్రిదోషక్షయ

క. మారుత పైత్య శ్లేష్మా
చారంబులు రీతులమరి సన్నులవోలెన్
గారించు త్రిదోషక్షయ
సారమతింజూడ కష్టసాధ్యముధరణిన్.

వాతశ్లేష్మక్షయ.

క. హీనస్వరమును కుత్తుక
లో నొచ్చుట దగ్గు వాంతులుఁ వాతములో
నూనిన మేహాపుచిన్నెలు
దానగు భువి మేహమారుతక్షయ తెలుపఁగ.

వాతపిత్తక్షయ.

క. స్వరమొక తీరుగబలుకుట
జ్వరమును దాహాంబు శూల వాంతు లరుచియుఁ
ధర వాతపిత్తజక్షయ
బరగును యుదివాడమగా ప్రబలమైతోఁచుఁ.

పిత్తశ్లేష్మక్షయ.

క. ప్రతికర్మల కాలస్యం
బతినిద యస్వల్పదాహమగుటయు జ్వర సం
గతి రక్తవాంతి భ్రమలుం
జతగూడిన శ్లేష్మపిత్త క్షయయన బరగుఁ.

ఊర్ధ్వక్షయ.

క. వడిపీనసయును శ్వాసయు
యొడలెల్లనునొచ్చు దగ్గు నూర్ధ్వశ్వాసల్
విడివడి శోషారుచు లే
ర్పడు నూర్ధ్వక్షయకటంచు బల్కిరివిబుధుల్.

మేహపైత్యక్షయ.

గీ. మేహమెక్కుడు కార్శ్యమహా దేహ మింద్రి
యముల నిస్సత్వమును బుద్ధి హైన్యశుక్ల
హాని వ్రణరీతికాయమునంటనొప్పి
మేహపైత్యపు క్షయయిది మృతియొసఁర్చు.

### క్షతజక్షయ.

సీ. దేహకాంతులుదప్పి తెల్లనై నాడిన
శించి శూలయు ప్రక్కలేంచనొప్పి
రక్తవాంతియును దుర్గంధమలంబు వ
చనము బొంగనుబోవ క్షతసమాఖ్య

### అసాధ్యక్షయ.

క్షయయొక్కయేటిలో జంపుమేహపుధాతు
వును హీనమతిసారమును శరీర
మునుజిక్కియండములును పొట్ట వాదియ
సాధ్యక్షయయనంగ జమునిజూపు

### క్షయక్షణము.

గీ. కనులతెలుపుకాంతి గడునూర్ధ్వముగశ్వాస
పగిలిచెడినఘంటపగిది పలుకు
గల్గెనేనిదీనిగా క్షయక్షత మన
క్షతపుపైత్యక్రియలజరుపమేలు.

### పైత్యమేహక్షయ.

ఉ. కుక్షినిశూల శ్వాసనసకుత్తుకలో రుచిదార్ఢ్యహీనముల్
యక్షులనిద్రలేమి తల నంఘ్రుల చేతుల నొప్పి హిక్క ప్ర
త్యక్షము గ్రంధికండువులు నంగమునందు నజీర్ణవృత్తిచే
భక్షణలేక మూత్రమలబద్ధములున్నల దానిపైత్యమే
హాక్షయనాగ నొప్పునిది యంతకుపాలికి బంపురోగులన్.

### వాతార్శక్షయ.

చ. కరపదముల్జెమర్చుట యొకానొకవేళ శరీరమట్టులన్
బరగుట పొట్ట నాలుకయు పాండురమై గుదమందుపొక్కులు
ద్ధురముగ శూలగ్రంధులును దోచిన రొమ్మునన్నొప్పికంఠ్మమం
టరయగ మారుతార్శజమటందురు నీక్షయనెల్లభేషజుల్.

## క్షయరోగచికిత్సలు.

### చింతామణి.

సీ. వెండి బంగారము ల్గింకువజ్రము రాగి
పార దాభ్రక లోహ భస్మములను
గంధకంబును మౌక్తికము సంకు మణిశిల
పత్రతాళక మెఱపగడములును
సంశుద్ధులొనరించి సమభాగములుగూర్చి
ఖల్వంబులోనన్ని గలయనుంచి
చిత్రమూలక్వాథసేచనంబున నేడు
దినములునూరి ముద్దినములొకటి
వరస రోకటిబండ వావిలియాకున
జిల్లేడు నల బ్రహ్మజెముడుబాల
మర్దించి యదిసార్ధ మాక్షైత్తుదొలచి యౌ
షధమందులోనిల్పి చక్కగలియ
గంట్లపై యింతవెల్లారంబు జిల్లేడు
పాలచేనూరి లేపనముజేసి
ముంతవేసియుపైనమూసి శీలయమర్చి
కొమరొప్పనొకపెద్దకుండ కర్ష
ముగ వరిపొట్టునించి ముంతయందిడి కుండ
నిండుగవరియూక నుండజేసి
పైనిప్పువేసిన భస్మమైతనుదానె
చల్లారినట్టి యౌషధముతీసి
కవ్వలతోగూడ గైకొంద్రుకొందరు
కొందరౌషధమె గైకొందురంద్రు
తజ్ఞులుయాయౌషధంబె చేకొనిదాని
సమముగా సూతభస్మంబువేసి
కలిపి తత్పాద వైక్రాంతభస్మము వేగ
మునగ నిమ్మయు యల్లముల రసంబు

దించియు నేఁజేసిదినములు మర్దించి
కడునడి మూనాళ్లు గలియనూరి
చిత్రమూలక్వాథ సేచనంబున నేక
వింశతి భావన ల్వెలయదీసి
గరళంబు మరిచ వెల్లారంబు వేర్వేర
పాదాంశలుంచి పిప్పళ్లు శొంఠి
కరకచక్కలు లవంగము జాజికాయలు
గరళంపు పాదభాగములునుంచి
మాదీఫలంబుచే మర్దించిగుళ్లికెలు
గావించి వాయుశుష్కములుచేసి
అనుదినంబును పూట నడ్డిగెత్తొకమాత్ర
పిప్పలిచూరతో బెట్టుకొనిన
శ్వాస కాసలుడుల్లు జఠరాగ్ని వర్ధిల్లు
పాండు శోభలు శూల పార నెల్లు
కాంతిమైరంజిల్లు కరణముల్వెలసిల్లు
పరిహరించునురోగ పటలములను

గీ. గ్రహణి దుర్నామ రాజయక్ష్మములనడంచు
విషము నిరసించు శుక్లాభివృద్ధిమించు
బహువిధములైన మేహముల్ బాసిపోను
తత్తదనుపానములను చింతామణియున.

లఘుమృగాంకము.

సీ. పాలు బంగరుబూది పాలొండు రసభూది
ముత్తియంబులబూది మూడుపాళ్లు
పాళ్లునాల్గుగ వెండిభస్మంబు నటువలె
గంధకంబును మాక్షికంబు లైదు
పాళ్లు టంకణమారుపాళ్లు విద్రుమబూది
రెండుగానిడి నిమ్మపండ్లరసము

దీసి మెత్తగ మూడుదినములుమర్దించి
పిడచగా జేసెండ బెట్టి యార్చి
సరవి సజ్జా యవక్షారముల్ లవణపం
చకమును ముంతలోసగముబోసి
నడుమ మందిడి దానికడుపునిండనుబోసి
గట్టిగాపాతను మట్టిగొట్టి
కందిగింజల కొల్ల కడవలోపల నుంచి
యందు జేర్చి నాల్గుయామములను
సమవహ్నిచే నొండి సైంధవాదులుదీసి
చౌషష్టిభాగ వజ్రములబూది
గల్పుటయొండె వైక్రాంతభస్మంబొండె
నౌషధషోడశాం శైసబూది
అల్లపురసమున బిళ్ళలుగావించి
అనుదినంబును ప్రాత కడ్డిగెత్తు
మధ్వాజ్యములుగొన్న మందాగ్ని నిరసించు
బహువిధక్షయలను పరిహరించు

గీ. కామిలా పాండువుల సర్వకాస గుదజ
శూల శోభాతిసార హృచ్ఛోషరక్త
గుల్మ విద్రధిగళరోగ కుష్ఠమేహ
గదలనడగించు లఘు మృగాంకంబసంగ.

కనకసుందరరసము.

సీ. పారదభస్మంబు పాళ్లెన్మిదిగగూర్చి
హేమమాక్షికమైదు హేమభస్మ
మునుమూడు రజతంబు మూడు వైక్రాంత
భస్మముమూడు తామ్రభస్మంబుమూడు
కాంతలోహాభ్రక గంధకంబులునొక్క
టొక్కటివసుసంఖ్య లక్కజముగ

ఖల్వంబులోనుంచి గట్టిగా చిత్రమూ
లకషాయమున మర్దనమును మూడు
దినములుగావించి తీసిమాత్రలుజేసి
గాజుకుప్పెను వాలుకమనుయంత్ర
మునసెండి గంధకమును జీర్ణమగుమీాద
సాంగశీతలముగా సంతరించి
వల్లద్వయంబెత్తు వటకంబుగ్రోలిన
క్షయలు గుల్మంబు లర్శస్సులు త్రి
దోషమేహము మరుత్తులు గుదరుజలు వృ
ద్ధులు శ్లేష్మములు పైత్యములు జ్వరమ్ము

గీ. లడఁచు బంగారువన్నియ యొడలకబ్బు
వీర్యవృద్ధియొనర్చు పృథ్వీతలమున
ననుచుధన్వంతరికిజెప్పె హరుడుతొల్లి
దమితరోగంబు కనకసుందరరసంబు.

కనకసుందరరసానుపానము.

చ. సరసతనాగరం బుభయ సైంధవముల్ క్రిమమొప్ప రెండు
గ్గరయగ నొక్కటుల్లలపి యన్నిటిచూర్ణముజేసి యాముదం
బిరువుగజేర్చి ప్రొద్దునను నేలకి దాచిని తాళిసంబు కే
సరపుకషాయయుక్తముగసందెకడం దినమేలొసంగెడిన్.

సంజీవనీరసము.

సీ. బలిరసంబులు హేమభస్మంబు తామ్రభ
స్మము నభ్రకపుబూది సమముపాళ్లు
యభ్రికంబునకును యరపాలులోహంబు
వైక్రాంతభస్మంబు పాదభాగ
మమరించి కల్గరియాకు పర్పాటక
సారంబులనునూరి చూరజేసి
యడ్డసరము తక్కెడాకు వావిలి బోడ
తరము వాకుడుపీశె పరగ కన్నె

కొమరి మునగ బ్రాహ్మి కొమరొప్పు వస నేల
వేము రసంబులు వేరువేర
వెలయ మూడేసిరోజులలెక్క భావించి
భావ్యంబుమునమునుంచి పాదగమాన
గీ. మాత్రమునుపిప్పలియు ధాన్యమహితక్వాథ
మునను గ్రోలిన క్షయ పాండు ముఖ్యరుజ ల
డంచు గాత్రంబు మిగుల వార్ధక్యంబునొందు
కాశికాహ్లాద సంజ్ఞవిరస మనంగ.

రసరాజము.

సీ. గగనహింగుళములు కాంతలోహంబును
మండూరమును హేమమాక్షికంబు
బంగారు వెండియు వంగము ల్వైక్రాంత
ర్పూర శిలాజితుల్ ముత్తియములు
భస్మంబులును నాగ భస్మంబు వైక్రాంత
భస్మంబు లోహంబు పచ్చగవ్వ
భస్మంబు తామ్రపుభస్మము శంఖభ
స్మము వెలిగారంబు మణిశిలయును
ఫరిబలి కంకుష్ఠ పారదంబులు తాళ
కంబును తుల్యభాగంబులుంచి
అగ్నిపు చిత్రక మరటిగడ్డలు కల
బందవేళ్లును హంసపాదియాకు
భాసురంబైనట్టి ప్రాచీటీగయు నీలి
వాకుడు నల్లనౌ వావిలియును
చిల్లయు, తెల్లగజ్జెరు నల్లనికాచ
కస్యకుమారియు గడ్డలమర
బోడతరంబును పులిచింతరసములు
త్రిఫల కషాయంబు గలయనొక్క

బొక్కటిబోయుచు నొక్కొక్కదినము లె
క్కనుభావనము జేసి గాజుకుప్పె
యందుంచి సైకత యంత్రంబులోనిడి
మందాగ్ని నాల్గుయామములు వండి
ధాన్యపుటంబున తగనుంచి గుంజెత్తు
గాని రెండిటియెత్తుగాని మూడు
గురుజలయెత్తల్లపురసంబు తేనె శ
ర్కర ననుపానంబుగాను గ్రోలి
శాల్యోదనంబు పెసరపప్పు యపుడుగా
చినయాలనెయ్యి గోక్షీరతతులు
కస్తూరియును పచ్చకర్పూర హరిచంద
నాది సుగంధము లరటి మామి
డులు ద్రాక్ష పిండివంటలుదిను జనులకు
క్షయ పాండు కాస శ్వాసలును షండ
ములు సప్తవృద్ధులు బలితమౌ మేహముల్
వదలిపోవును ననివార్యబలము

గీ. గలుగు భూషాభూషిత గాత్రులైన
నవ వయస్స్త్రీశతంబుల గవయజేయు
శివుడు లోకోపకారమై జెప్పెదీని
రసికులౌననగా రసరాజమవని.

## ఘృతములు.

### కూష్మాండఘృతము.

సీ. కూష్మాండరసము నాల్గు ప్రస్థములునాల
పాలు ప్రస్థమునెయ్యి ప్రస్థమొకటి
గలియ కండకుబోసి గాచియాఘృతములో
మధుకంబు మనుబాల మంచిగంధ

ములు ద్రాక్షపండ్లును నుత్తువపులంగబు
నేలగుమ్మడు యిప్పపూలు జీర
కయు తిప్ప కసివింద కమ్మరేగను శొంఠి
పల్లేరు రాస్న పిప్పళ్లు సమము

గీ. శర్కరయువేసి ఘృతపాకసాంజ్ఞనొంపి
ప్రొద్దునను కర్షమాత్రంబు బుచ్చుకొనిన
క్షయలు పాండుజ్వరంబులు శ్వాసలడగు
జనులకమృతము నిజము కూష్మాండఘృతము

మహాకూష్మాండఘృతము.

సీ. కూష్మాండమును నేలగుమ్మడు పిల్లిపీ
సరగడ్డ లరటిగడ్డరయ ప్రాచి
తీగెరసంబులు బాగుగ వేర్వేర
ప్రస్థంబులుగగూర్చి పాలుప్రస్థ
మావులనెయ్యియు నిక్షురసంబులు
ప్రస్థంబు ప్రస్థంబు పరగగూర్చి
కాకోళియును క్షీరకాకోళి దుంప రా
స్నయు శొంఠి తుంగముస్థలును గంటు
భారంగి వసయు పిప్పళ్లు కర్కాటక
శృంగియు వాయువిళంగములును
చాగగడ్డలు మోడి సైంధవము గజపి
ప్పళ్లొక్కొక్కటొక్కటిపలములెక్క
పొడిచేసి ఘృతములోబోసి వండియుదించి
తగినట్టుగా పంచదార తేనె

గీ. గలపి తులమెత్తు భక్షింపగా క్షయార్శ
పాండుహృద్రోగములమాన్పు బలమొసంగు
పైత్య శోషజ్వరంబుల పరిహరించు
నతిమహాద్భుత కూష్మాండకాదిఘృతము

అశ్వగంధ్యాదిలేహ్యము.

సీ. నూరుపలముల పెన్నేరుగడ్డలు
తెల్లగల్జకీత వేళ్లుముంత
పురుగుడు ప్రాచితీగరయగా గొబ్బిచే
రులు నొక్కటొక్కటి పలముఁలుపది
సరవిగా పిల్లిపీచర గడ్డలును నేల
గుమ్ముడుశొంఠి నిక్క గుమ్మతిప్ప
తీగవ్యైదెదుగా శిరపలంబులుఁగూర్చి
దంచి నల్లుమునీట దనరనుంచి
చేకొని యష్టావశేషంబుగాకాచి
కుంచెడావులనేయి గూర్చివైచి
గోక్షీరములు రెండు కుంచంబులుగ జేర్చి
దాల్చిన యాలకుల్ తాళిసములు
కటుకత్రయము మధుకంబును ధనియాలు
వెదురుపప్పు కెదవట్టివేళ్లు దుంప
రాస్న మంజిష్టి కురాసాని యోమంబు
వస వట్టివేళ్లును వామువమర
చెంగలికోష్టును శ్రీగంధమును నల్ల
జీరకత్రయము కల్వ నేరువేర
కర్షప్రమాణంబుగా వేసి తగినట్టు
బెల్లమువేసి రంజిల్ల లేహ్య
గీ. పరచి యడ్డెడుతేనె నందరయనుంచి
పూటపూటకు తులమెత్తు బుచ్చుకొనిన
రక్తపైత్యాదులను క్షయరాజినడచు
నశ్వగంధాదిలేహ్యం బిదనగ నమరు

వాశానిర్గుండికాదిలేహ్యము.

సీ. అడ్డసరము వావిలాకు తెల్లనిముల్క
తెల్లజిల్లేడును తెల్లయుప్పి

నల్లముల్కలవేళ్లు నయముగా వేర్వేఱ
నిరువదిపలములు నరిగఁగూర్చి
కలుతుము నీటిలోఁ బల్ద్రొక్క పడవేసి
యష్టావశేషంబు నమరఁగాచి
దగపంచదార యర్థతులమందున గల్పి
పాయిమీఁదనుండు నేర్పునువహించి
యడ్డసరంబు నిత్యంబగు గోరంట
తెల్లజిల్లేడును తిప్పతీగె
వాకుడు కసివింద వావిలి కల్గర
యాకులరసముల నమరనొక్క
ఒక్కొక్కటి యడ్డెడు లెక్కను బడఁబోసి
నూనెమానెడుయుంచి పూనిలేత
మంటపైనను యడుగంట కుంటనువండి
పలముభారంగియు పలముకర్క
టకశృంగి పిప్పళ్లు ప్రకటమా మోడియు
చవ్య త్రిఫలములు సైంధవంబు
మరిచ నాగన జటామాంసులు మేటి పు
ష్కరమూలమును చతుర్జాతకములు
పలములు మూఁడేసి పట్టు యొక్కొక్కటి
పొడిజేసి కుండలోఁబోసి యొండి
దించి చల్లారగా తేనెయడ్డెడుజేర్చి
ప్రొద్దున తులమెత్తు బుచ్చుకొనిన

గీ. పాండు యక్ష్మలు కామిలా పక్షఘాత
కాస పైత్యములును దురించగలదటంచు
యశ్వినులకానతిచ్చెను నీశ్వరుండు
వాశనిగ్గుండికాలేహ్య వరముపరము.

అశ్వగంధ్యాదితైలము.

సీ. పెన్నేరుగడ్డలు ప్రియమొప్పగాను ము
త్తువపులగంబును దుంపరాష్ట్ర
సమములుగాచు కషాయంబు పదకొండు
పాళ్లువెల్లల చెక్క పరగచాగ
గడ్డలు నల్లని కానుగచక్కలు
కూతురుబుడమయు కొమరుమిగుల
వీటిరసంబులు వేర్వేరనొక్కొక్క
పాలుగానిడి రెండుపాళ్లునిల్వ
దిగగాచి పెరుగుమీదిజలంబు నాల్గుపా
ళ్లును నూనెయొక పాలుగను ఘటించి
చెంగలికోష్టును శ్రీగంధమును గూఢ
పాల మంజిష్టలు పసపు వట్టి
వేల్లిప్ప చాగలవేళ్లును పెదరాష్ట్ర
కటుకరోహిణులు సుగంధిపాల
యతివస రేణుక లా సదాపలు దేవ
దారుచక్కలును పెన్నేరుగడ్డ
మేదురంబైనట్టి మెట్టదామర మాను
పసపులు కర్షముల్ పొసగగూర్చి
పొడిజేసియందులో పోసి తైలముపక్వ
మునగాచి తలయంటి మోదముసను

గీ. పాండువుల్ క్షయ జ్వరముల పరిహరించు
కామిలలనూన్చు ధరశిరోగదలద్రుంచు
వాయువులగూల్చు కార్శ్యముల్ బాయజేయు
యశ్వగంధ్యాదితైలం బటంద్రుబుధులు.

బలాధాత్ర్యాదితైలము.

సీ. ముంతపులుగుడు సమూలంబు నరవీశె
సరిదానికిగయూ నుసిరికపప్పు

తిప్పయు నుసికికపప్పులోనస్థంబు
పెట్టి దీనికిసగం బొట్టివేళ్లు
ఒట్టివేళ్లకు సగమొప్పగా కురువేరు
మంచిగంధంబెట్టి మధుక మిప్ప
ప్రాలును మఱి సదాపులు నొక్కటొక్కటి
నాగ్రేసితులములు నయతగూర్చి
వలయుజలంబుల గలిపి కషాయంబు
గాచి పాదమునిల్వగానుదించి
క్వాథంబుసరి నాలపాలును యారెంటి
సరిగల్వ పిల్లిపీసరపుగడ్డ
లరసంబు నూనె చక్కెర వేరు వేరుగా
కలితోటిసాటిగా గలపి యష్టి
మాధుకంబు కోష్టువు మనుబాల చందన
ద్వయము తక్కోలము ల్దనర వట్టి
వేళ్లు జీరక పిల్లిపీసరగడ్డలు
జాజికాయయును త్రిజాతకము లు
యావాలు మేథయు యంజనంబును ద్రాక్షు
సంపెంగ నాగకేసరము లేల
కులు కమలంపుగడ్డలు శంఖ నఖ గజ
పిప్పళ్లు బ్బులసియు నిప్పపువ్వు
గ్రంధితగరమును కటుకరోహిణి దేవ
దారు సదాప ముస్థలును త్రిఫల
కస్తూరి ఆరతికర్పూర మగరు కుం
కుమపువ్వు మాంసియు గూడ మిట్ట
దామర మంజిష్ట తగసమభాగముల్
గా చూరనొనరించి గలియబోసి

గీ. తైలపక్వంబుగాదించి తలను దేహ
లేపనంబులుసేయగా బాపుకుయల

పటుతర బలాదిధాత్రికా ప్రబలత్రైల
మర్వీనులుజెప్పిరిది మంచిదనుచు భువిని.

లవంగాదిచూర్ణము.

సీ. తనరలవంగాలు తక్కోలములు మంచి
గంధము శీరంబు గ్రంథితగర
మగరు తవాక్షీరి యారతికర్పూర
మేలకులును కేసరాలు నల్ల
కల్వగడ్డలు గుంటకల్గరవిత్తులు
నల్లజీరయును పిప్పళ్లు శుంఠి
నచ్చిత్రిమూలంబు జాజికాయలు సమ
భాగములుచూర్ణించి పంచదార

గీ. చూర్ణమునకు సగంబుగా జూచివైచి
తులము పూటకుగ్రోలిన దొలగు క్షయలు
కాస హృద్రోగములడంచు ఘనతనిదియు
సొంపుబూను లవంగాదిచూర్ణమాచు.

వాలుకాదిచూర్ణము.

సీ. కురువేరు జీరక కోష్టపులును జాజి
కా యేలకీ లవంగంబు లాకు
పత్రి పిప్పలి ద్రాక్షపండ్లు శొంఠియు మిరి
యాలు రేణుక కేసరాలు మెట్ట
దామర మంచిగంధము పిల్లిగడ్డలు
నారతికర్పూర మగరు వడ్ల
పేలాలు మరియు తక్కోలముల్ గొబ్బివి
త్తులు దూలగొండివిత్తులును కచ్చు
రాలు పెన్నే రిప్పపూలు జాపత్రి కుం
కుమపువ్వు సమములుగూర్చి యన్ని
చూర్ణంబుగావించి చూర్ణంబుతోసాటి
తిప్పసత్తునుజేర్చి తిప్పసత్తు

గీ. సరిగ శర్కరవిడి కరపమంబుజనులు
తేనెతో గ్రోల క్షయలును మానవట్టి
పాండుపులుబోవు నిజము యూ వాలుకాది
చూర్ణ మెన్నదగు పరిశుద్ధమగుచు.

సీ. రెండుమాసములకు బండిన బియ్యంబు
గోధుము ల్పండినగుమ్మడులును
కదళిఫలము పంచగవ్యము ల్వెన్నెల
పాతబియ్యము తేనె పచ్చపెసలు
ములగ లఘుద్రవ్యములు ములుయుస్త్రీలు
తెల్లగర్జేరును తెల్లగాక
రియు ముల్కకా యోసిరికకాయలును పాత
చింతపండును మంచిజీరకయును

గీ. మేకపాలనుగోరిలగా మేలుసేయు
క్షయలకివిపథ్యములు చికిత్సకులుదెలసి
పెట్టవలె తక్కినవి బుధుల్ విడిచిపెట్టు
డనుచు శివుడానతిచ్చెను యశ్వినులకు.

---

పశువైద్యపద్ధతి.

(మేహరోగప్రకరణము.)

వింశతిమేహములనామములు.

సీ. ఘనశుక్లమేహంబు ఖజ్జలిమేహంబు
రక్తమేహంబు సాంద్రమనుమేహ
మును సురామేహంబు పుష్టిమేహంబును
హారిద్రమేహంబు హస్తిమేహ
శర్కరామేహంబు క్షారమేహంబును
తంతుమేహము సికతమనుమేహ

మంజిష్టిమేహంబు మధుమేహమును వసా
మేహోదకంబును మేహనీల
గీ. మేహమును యిక్షుమేహ లాలాహ్వయములు
అరయ మజ్జాఖ్యమేహంబులనగ నిరువ
దియు ధరాస్థలి నరుల వేధించుచుండు
సాధ్యములుగాంచి వైద్యంబు సల్పనగును.

సాధ్యములు.

శా. మజ్జాసైకత శర్కరేక్షురవసా మంజిష్టి హారిద్రముల్
ఖజ్జల్యాస్థి సురా మధుక్షతజ సంఘుంబుల్ పథ్యఁ రెండిలన్
బజ్జాతుల్ నరునిన్వడిన్ దగిలి దూబంచేసి వేజంపు యే
యొజ్జల్మాన్పగ వేరుమందులను కార్యోద్యగ్రులై ధారుణిన్.

మేహరోగనిదానము.

శుక్లమేహము.

ఉ. కేవలశుక్లమైన పరికింపగశుక్లము గూడియైన శు
భ్రావహమైన మూత్రము నిబద్ధముగాకను వెంటవెంట ని
స్రావమొనర్చి తంద్రవిల సద్గృహ దేహమునందు నొప్పి ని
ష్ఠీవర మగ్నిమాంద్య కరశీతముగల్గిన శుక్లమేహమా.

కజ్జలిమేహము.

క. నలుపై మిశ్రంబై క
జ్జలమువలె న్మూత్రిముండి కాన శ్వాసా
దులు మలమూత్రద్వారం
బులు నొచ్చును కజ్జలికిపి బుధజనులెన్నన్.

రక్తమేహము.

ఉ. నల్లగగూడినీరుడు ఘనంబుగవచ్చుచు ముద్దరాండ్లపై
నుల్లసమెల్లమాన్పి సతతోత్కటవేదన లుండి తాపమున్

వెల్లనిబట్టజేయుచు నిఘాహరణంబును మూర్ఛకంపముల్
ఫల్లదముల్ విదాహమును బొల్పడిబూనిన రక్తమేహమౌ.

సాంద్రమేహము.

క. పానకమువలెను మూత్రము
ఫేనంబై మాక్షికములు వెలుచనుముసరన్
దానగును సాంద్రమేహము
యోనిన్ లింగముల శూలలిడుగతి లోడమున్.

సురామేహము.

క. కల్లువలె వెళ్లమూత్రము
చల్లదనంబమరు మేన సంతోషము తం
ద్రోల్లసన కాంతిహీనము
కల్లోల సురాప్రమేహ కారణములగున్.

పుష్టిమేహము.

వ. బలువగు ధాతుపుష్టి బహుభామలగూడెడు సత్వముల్ శితా
ఫలమన శుక్లసంకలన బద్ధకమూత్రి కఫప్రవృద్ధి కాం
తులు వెసగల్గి తృష్ణయును తోరపుచేతులకాళ్ల చమ్మటల్
పులుకలుబూనెనేని యిది పుష్టికమేహము ధారుణీస్థలిన్.

హారిద్రామేహము.

గీ. పసపుగల్పినట్లు వెసమూత్రముసరివించి
హృదిని తాపశూలలొదవి కాంతి
హీనజడతబద్ధమౌను పురీషంబు
భువి హారిద్రమేహ భవగుణములు.

హస్తిమేహము.

క. కంపొదవు మూత్రమున బహు
లంపటశిరమునను కన్నులన్ భుక్తద్వే

షంపుగుణ మగ్నిమాంద్యము
బొంపగు నీ హాస్తిమేహ భీషణగుణముల్.

శర్కరామేహము.

క. చీమలు దోమలు నీగలు
వే ముసరున్ నీరువిడువ వెంట నెమూత్రం
బోమిగుల తెల్లనయ్యె ధ
రామండలి బొడమ శర్కరామేహమునన్.

క్షారమేహము.

గీ. ఉప్పునీరుకీతి నొప్పును మూత్రంబు
జ్వరము శ్వాస కాస ఛర్ది భ్రమలు
కాంతిహీన మరుచి గలుగును నీక్షార
మునకు మనుజులందు జనితమైన.

తంతుమేహము.

ఉ. తండులధావనోదకవిధంబున మూత్రమువచ్చు శుక్లమున్
కండెలుబట్టి నూలుగతిగా తుదినైనను ముందునైన గా
గుండెలలోనమంట మరి కుక్షినికొంచెనుశూల సత్వమే
ముండదు తంతుమేహకు సమున్నతిగా వివరించిచూడగన్

సికతామేహము.

క. శీతలమూత్రము వేదన
వాత శిరోభ్రమణ మూర్ఛమైవణన్ పిపా
సాతత సికతామేహము
ఘాతంబొనరించునెట్టి ఘనునకుబొడమున్.

మంజిష్టామేహము.

క. అరయ దివారాత్రంబులు
నరుణంబగు మూత్రజలము లక్షియుగములన్

శిరమున నొచ్చును మూత్రము
నరుగగ మంజిష్ఠమేహ జోగ్రగుణంబుల్

మధుమేహము.

క. తేనెవలె మూత్రిమై సాం
ద్రానూన భ్రమణమూర్ఛ తాపములు కళా
హీ నాగ్నిమాంద్య తంద్రలు
బూనన్మధుమేహమనుచు బుధులెంతురిలన్.

వసామేహము.

క. కరపాద విదాహము దు
ష్కర శోషాతంద్ర తైల సంయుత మూత్రం
బురలెడ వసానిరుద్ధము
నరసంబులుగొనుడి యీవసామేహగతుల్.

ఉదకమేహము.

ఆ. కడవనీటిగతిని వడివచ్చుమూత్రంబు
కడుపు మిక్కుటంబు కుక్షిలోన
మంటగలిగి దప్పి మనుజన్మకొదవిన
నుదకమేహమనఁగ నొప్పుధరణి.

నీలమేహము.

క. కీలాల మిశ్రమగుచును
నీలంబై మూత్ర మొదవు నిరతముతృష్ణా
భీలజ్వరమును శీత వి
శాలంబీనీలమేహ సంగతులెలమిన్.

ఇక్షుమేహము.

ఆ. చెరుకురసమువలెను బరతెంచు మూత్రంబు
పదకరములమంట బలము కాంతి

హీన మిక్షుమేహ మెలమిజన్మించిన
కఫ మరోచకంబు కాస లౌదవు.

లాలామేహము.

శా. శూలాంగవ్యథ శీతలభ్రమణ దుశ్శోషాగ్నిమాంద్య భ్రమా
ళీలంబయ్యు, విభావిహీనములచే భేద్యంబు గాకుండునే
లాలామేహము కంటబొట్టుబకులీలన్ మూత్రమేప్రొద్దు దు
శ్శీలోదగ్రగత రాల్పు మర్త్యులకు నుత్సేకంబుగాజూచిరన్.

మజ్జామేహము.

గీ. అవని మూత్రంబు శ్వేతకృష్ణారుణప్ర
భలు వివర్ణాశరీర విపాసతంద్రి
కంఠశోషాగ్ని మాంద్య శుష్కములు పాద
దాహ మొదవిన మజ్జాప్రమేహమగును.

## మేహరోగచికిత్సలు.

శుక్లమేహమునకు మేహగజకేసరి.

సీ. పారదభస్మ మభ్రక తామ్రభస్మముల్
పగిడి వెండియు సీసభస్మములును
తగర మిన్ముక్కు కాంతములభస్మము సరి
మల్లెగడ్డరసంబు మహితమైన
జమ్మిపండ్లరసంబు నిమ్మగానిడి యొక్క
దినముమర్దించి మూసనుఘటించి
భూధరపుటమును బొలుపొంద నొకరోజు
వేసి చల్లారగదీసి మందు

గీ. జేసి వెలిగారమును చల్లజేర్చిగుళిక
లిడిన శుక్లపుమేహంబు నడగునిదియె
మాషమాత్రములగునట్లు మాత్రలొప్ప
మేహ గజకేసరీయన మించుధరణి.

శుద్ధక్రియ.

గీ. ఉసిరికలపప్పు వేపబంక నరిక్వాథ
మున శిలాజిత్తుభస్మంబు నొనరపదియు
చిన్నములగూర్చి మందిల సేవజేయ
శర్కరమేహమడంగును స్థిరముగ.

ఖజ్జలిమేహమునకు

వ. ఈ మేహమునకు సమూహక్వాథములలో ననుకూలమైనది ఇచ్చుకునేది:

రక్తమేహమునకు

గీ వంగ నాగంపుభస్మముల్ శృంగిభస్మ
పత్రి తంగేడుపువ్వులు పంచదార
పరగసమములు చూర్ణించి బర్రెచల్ల
నుర్విభక్షింప రక్తమేహోపశాంతి.

సాంద్రమేహమునకు శుద్ధక్రియ.

గీ పచ్చిపసపురసంబును పరగయుసిరి
కాయరసమును తేనియగలపి యొకటి
ముస్తలును మానుపసపును పసపు దేవ
దారు త్రిఫల కషాయంబు దాగ్రివుటొకటి
సాంద్రమేహోపశాంతులు జగతిలోన

సురామేహమునకు మేహారిరసము.

సీ. వంగభస్మము సీసభస్మము నిర్భిక
మ్ములబూది ప్రత్తిపప్పులును యూడు
గులవిత్తనంబులు తులలుగాజలముల
కలియనూరియు రేగుఫలమువలెను
మాత్రలుగావించి మాత్రయొక్కటిగచ్చ
పప్పునుబొద్దియు పరగ కరక

పైవల్పు నలమాను పసపును వీటిక
షాయానుపాన మొజ్జలునొసంగ
గీ. గాను వైద్యులమదికింపుగాను భువి సు
రాఖ్యమేహంబు శాంతియౌననుచు తొల్లి
యశ్వినులు దెల్పిరిది మంచియౌషధంబు
నరయ మేహారిరస సమాహ్వాయతనొప్పు.

పుష్టిమేహము.

వ. ముందు చెప్పబడియున్న సమూహా దివ్యౌషధంబులలో కుసుమా
కరాదులొసంగవలయును.

హారిద్రామేహమునకు పురారిరసము

సీ. రసభస్మమునుమూడు రజితాభ్రకంబుల
భస్మము ల్మరిలోహభస్మ మణశి
లలును కాసీసంబు నలవడ నొక్కొక్క
భాగంబులుగగూర్చి పట్టి నేల
తాటిగడ్డలు నెల్లి తక్కెడు కరక చ
క్కలు నల్లములరసంబులను వేరు
వేర నొక్కొకరోజునూరి కుప్పెనుబెట్టి
సైకతయంత్రి పాచనము నారు
గీ. ఝాములొనరించి రెండుగుంజలసమంబు
గుళికబోళంబు వేపవిత్తులకషాయ
మందుక్రోల హారిద్రమేహంబుశాంతి
యగు పురారిరసంబు యీయౌషధంబు.

అస్థిమేహమునకు ముక్కంటిరసము.

చ. బలియొకటారు నభ్రకపుభస్మము రెండు రసంబునొల్గు పా
ళ్ళలవడ చల్లతేటను నయంబుననూరియు మూటకట్టి యూ
వలసికతాఖ్యయంత్రమున వండియు ధాత్రిఫలంబునీటితో

తెలియగనేడు రోజులు మధించి యటు రెండడుగు మాడలెత్తు నే
తిలోనుడికించి గ్రోలగను తీవ్రతసప్తిసమాఖ్యశాంతియగు.

శర్కరామేహము.

వ. దీనికి సమూహౌషధములలో సిందూరభూషణము నిచ్చుకొన వలయును

క్షారమేహమునకు వ్యోమకేశరసము.

సీ. రసభస్మ కాసీస మసిరికపప్పు యి
ప్పలపువ్వు మధుకమాంసులును జాజి
కాయలు దానిమ్మకాయవరుగు పంచ
దార సదాపలు దనర తుమ్మ
బంకపుల్లనిది ప్రబ్బ యు నేలమ్రియు
యారతికగ్వార సమర సమత
భాగంబులుగ గొరైపాలను పిల్లిపీ
సరగడ్డరసమును పరగ తమల
పాకులతొడిమల పటురసంబుల మూడు
దినములగాను మర్దనము జేసి
మహారేగుబండంత మాత్రలుగావించి
యుసిరికపప్పు నింపెసగచేదు

ఆ. పొట్ల వేపచక్క పొలుపొందగాతిప్ప
తీగెలుంచికాచు దిగుజలంబు
గలపి మాత్రగ్రోల క్షారమేహము శాంతి
కృతమునిదియె వ్యోమకేశరసము.

తంతుమేహమునకు.

సీ. సరవిగా సీసభస్మము లడ్డసరపు వీ
నెలు కరక్కాయచక్కలును మాను
పసుపు యూడుగవిత్తు లుసిరికవిత్తులు
గచ్చపప్పులు సరిగాగ గూర్చి

చిల్లకాయరసము నల్లసిల్లగఁబోసి
మర్దనగావించి మందు చల్ల
ననుపానమునఁగ్రోల నగునసమేహాకు
లాంతకమిది సికతాఖ్యమేహ
గీ. శాంతియగు తిప్పతీగె పసపులచూర
జేసి తేనియనందులో వేసిగ్రోల
సరవి సికతాప్రమేహాప శాంతియనుచు
శాస్త్రదృష్టంబు దీన నిస్సందియంబు.

మంజిష్టామేహము.

వ. దీనికి సమూహక్వాథములలో తగినది వాడుకొనవలయు. నిది యసాధ్యము.

మధుమేహశాంతికి.

గీ. కరక లొద్దుగలల తుంగగడ్డ పసపు
క్వాథమున తేనెగ్రోల నొక్కటియు మేడి
పండ్లచూర్ణంబు వర్షంబు పరగ తేనె
దినిననొక్కటి మధుమేహమునకుశాంతి.

వసామేహమునకు లలాటాక్షరసము.

సీ. పారదాభ్రక వంగభస్మంబులును కాంత
భస్మంబు సమమైన పాల్లుగూర్చి
పిటుత్తు నొలచిన వెల్లిపాయలు వేసి
మర్దించి బదరీప్రమాణముగను
గుళికలుగావించి గ్రోలినశాంతియా
నవనిలోనిది లలాటాక్షరసము
వలచినవెల్లిపాయలు నావునెయ్యిలో
గలయగా తెగనూరి గుళిక రేగు
పండంత దినశాంతిబడును జంబీ వసా
మజ్జాఖ్యమేహముల్ మానవనుచు

గీ. శాస్త్రములజెప్ప దెలసి యిచ్చటనునేర్పు
గాను నుపశాంతికయ్యు బల్కంగబడియె
కుదురునని ఘట్టిగానమ్మి వదలక బల
వైద్యులుచికిత్సచేయగావలదు ధరణి.

ఉదక మేహమునకు మేహబంధురసము.

సీ. మహారస కాంతభస్మంబులు లోహభ
స్మంబు శిలాజితు మణిశిలయును
తగరభస్మము కటుకత్రయము త్రిఫలములు
తంగేడువిత్తులు దనరవెలగ
పండులగుజ్జులు పసపులు సున్నంబు
సమభాగములుగాగ సంగ్రహించి
కల్హరరసమున ఘట్టిగా నిరుబది
ఝాములుమర్దించి సరవి తేనె
గీ. వేసిమాడెత్తు మాత్రలుచేసి వేప
పప్పుపొడి ఆరుచూళ్లెత్తు పసిగడుగున
నిదియుమాత్రనుగ్రోలిన నడగు నుదక
మేహమిల మేహబంధు సమూహ్వయంబు.

నీలమేహమునకు.

వ. సమూహశ్యౌషధములలో కుసుమాకరమైనను లేహ్యమైనవాడిన నీలమేహము నిస్సందియముగా మానును.

ఇక్షుమేహమునకు మేహామృతము.

సీ. పారదభస్మ మభ్రకభస్మమును నాగ
భస్మంబు మరికాంతభస్మమమర
సరిగ మోదుగుచక్క సారంబుననునొక్క
దివసంబుమర్దించి తీసి మూట
గట్టి సీలలపైన జుట్టి వాలుకనొక
దినముపక్వముజేసి తీసిరాజ

వర్త శిలాజతు ల్వంగ మండూరము
ల్కాసీస తుద్ద వైక్రాంతములును
తొల్లి ద్రవ్యంబులతో సరిభాగము
ల్మరిగూర్చి ముస్తలు మంచిగంధ
ములు కొబ్బరియు సురపొన్న పసపు వెల్ల
గుజ్జొట్టివేళ్లను గూడమాను

గీ. పసపు వంచియునిడి నిమ్మపండ్లపులుసు
యుంచి యామద్వయమునూరి యుంచితేనె
యుసిరకాయలరసమున నొసఁగ నిక్షు
వనెడు మేహమడంగు మేహామృతంబు.

లాలామేహమునకు మేహవైరిరసము.

క. హెచ్చైనతిప్పతీగెలు
నచ్చంబగు మునగవిత్తు లమరుకషాయం
బిచ్చగ దాహంబిచ్చిన
హెచ్చంగా నవని నిక్షుమేహమడంగున్.

మ. రస వంగాభ్రకభస్మముల్ సమము నీరంబుంచి మర్దించి మా
ష సమానంబగుమాత్రనొక్కటియు నెంచన్ వేపమూలంపుచె
క్కసుమంబుల్ బలమాకుదానిపయి చక్కల్పొరగావించి యిం
పెసగన్ చూర్ణము తేనెతోటిదినఁగా నెన్నంగ లాలాఖ్య మా
ను సముజ్జృంభిత మేహవైరిరసమానున్ నుర్వినూహింపగన్.

మజ్జామేహమునకు.

వ. దీనికి వసామేహమునకుజెప్పిన లలాటాక్షరస మిచ్చేది.

మేహములకు సమూహశ్యాపథములు,

సీ. రసగంధకంబులు వసనాభి వెలిగార
తాళకంబులు మాక్షికద్వయంబు

పసిడిభస్మము వెండిభస్మ మౌక్తిక వంగ
భస్మంబు పగడాలభస్మములును
కాంతభస్మాభ్రక కస్తూరియును లోహ
భస్మంబు మరితామ్రభస్మమమర
కుంకుమపువ్వును కోమరొప్ప మంచిగం
ధము సమంబులుగూర్చి క్రిమితెజాః

గీ. పూలరసమునమర్దించి పొసగవల్ల
మంత యల్లపురసమున ననుభవింప
మేహము·ల్శ్వాస కాస కామిలలు కుష్ఠ
పాండుమూత్రములు శోభలు పారవెళ్లు
యున్నతశుభంబు పూర్ణచంద్రోదయంబు.

తాళకేశ్వరము.

పారదభస్మ మభ్రకము వంగము లోహములుణ సమంబుగా
జేరిచి తేనెమర్దనము జేసియు మాషసమంబు గ్రోలసం
హారమునొందు మేహములటంచును శాస్త్రములెల్లదెల్పవే
యారయ తాళకేశ్వరరసాహ్వయ యౌషధమెన్నశక్యమే.

చంద్రప్రభావతీరసము.

సీ. అభ్రకభస్మ ముత్యాలభస్మము లోహ
భస్మము పగడాలభస్మ రసపు
భస్మము యేలకుల్ బలువగుమాసి...
కాసీసముచు మధుకంబు జాజి
కాయ లిప్పలపప్పుగా యుసిరకపప్పు
కరమొప్ప దానిమ్మకాయయొరుగు
పంచదారయు తుమ్మబంక చంద్రలబంక
పల్లేరును సదాప పుల్లప్రబ్బ
లరయుగానివియు సమాంశలు బొక్కిన
యాకు తమ్మలపాకు లల్లములను

నల్లేరునందున నయముగాదీయు ర
సంబుల నాల్గుదినంబులమర
గీ. మర్దనముజేసి బదరీప్రమాణముగను
పుల్లప్రబ్బయునల చేదుపొట్ల నేల
వేము యుసిరికపప్పులు వేసికాచు
క్వాథమును తేనెతో గ్రోలగాను మేహ
పటలిగూలుచు చంద్రప్రభావతియును.

కుసుమాకరము.

సీ. రసభస్మ తామ్రి మభ్రకభస్మములు వాగ
భస్మంబు వైక్రాంతభస్మ కాంత
భస్మంబు ముత్యాలభస్మంబు పగడాల
భస్మంబు మరి వెండిభస్మ హేమ
మాక్షికంబును సరి మహితమా బంగారు
భస్మమన్నిట నాల్గుపాళ్లుగూర్చి
పిల్లిపీసరగడ్డ పల్లేరు పాలమా
నులచక్క మరియూడలును చెఱకు
పాలు పన్నావులపాలు యుసిరికపప్పు
లరటి గుమ్ముడుగడ్డ లరయవట్టి
వేరులు తంగేడువిత్తులు క్వాథంబు
పీటి రసములు వేర్వేరనుంచి
కరముమర్దనచేసి కస్తూరితోడను
భావించి తామరపూవురసము
వల్లభావనజేసి వల్లద్వయము తేనె
నైన శర్కరతోడ నైన గ్రోల
గీ. మేహములు పాండు యక్ష్మ కామిలలు మూత్ర
ఘాతశోభాజ్వరాదిక గదలగూల్చు
వీర్యమభివృద్ధి యాయువు వృద్ధియగును
రసికులుప్పొంగ కుసుమాకరం బనంగ.

సిందూరభూషణము.

సీ. బంగారు ముత్యాల పగడాలభస్మము
గంధకాభ్రక వెలిగారమును
ఘనరససిందూరములు సమంబులు నల్ల
యుమ్మెత్తయాకు రసమ్ముతోడ
మర్దించిమాత్రలు మాషప్రమాణంబు
గాఁజేసి తేనెతో గలపిగ్రోల
మేహము ల్కుష్టు కామిలలు శోఫలు పాండు
యక్ష్మ శూలల గ్రంథు లరుచి పైత్య

గీ. మునను సతిహరములు గ్రహణులనడంచు
షండుఁడైనను పురుషుఁడై జనితపుత్రి
కామ్యతవహించు నూతన కాముఁడగుచు
పూర్ణమోదంబు సిందూరభూషణంబు.

శతావరీరసాయనము.

సీ. అరయఁగా పిల్లిపీసరగడ్డలరసంబు
నరటిగడ్డరసంబు నరయుగాను
మారేడువృక్షపు వేరు చక్కరసంబు
నారికేళపుకాయ నీరములను
నేలయుసిరికయు నీరుచెంచలియాకు
ఉసిరికకాయలు నుత్తరేణు
విరివిగాగుమ్ముడు వేపలచక్కలు
పల్లేరురసములు ప్రస్థములుగ
ప్రత్యేకములుగూర్చి ప్రస్థంబుఘృత మావు
పాలుప్రస్థంబులు బాననుంచి
ద్రాక్ష మధుకము తవాక్షిరి కర్కాట
కశృంగిభార్జీ సుగంధిపాల
యగరు త్రిఫలములు నభ్రకభస్మ కా
కోళియు క్షీరకాకోళి మంచి

గంధంబు పెన్నేరుగడ్డలు కురువేరు
రక్తచందనమును రాజితముగ
కస్తూరి యారతికర్పూరమును యివి
ప్రత్యేకకర్ష మేర్పరచి చూర్ణ
మొనరించి కలబోసి ఘనరసాయన పక్వ
మున వండితుల మెత్తుగానిన జనుల

గీ. కఖిలమేహంబులును ద్రుంచు యక్ష్మ పాండు
పైత్య కృచ్ఛ్రలు కుష్టువుల్ పారిపోను
వీర్యవృద్ధియుగావించు వినశతావ
రీరసాయనము చెలువు పేరుగలిగి.

శతావరీఘృతము.

సీ. కరమొప్ప పిల్లిపీసరగడ్డలరసంబు
తూములునాలుగు తూము నెయ్యి
యావుపాలోకతూము నటికలోపల జేర్చి
ఖర్జూరములు లవంగములు మాంసి
పల్లేరు యేనుగపల్లేరు త్రిఫలముల్
వరశిలాజిత్తు తవాక్షిరియును
ద్రాక్ష యేలకులును తాళిసంబులు జాజి
కాయ ముస్తాజీరక మధుకములు

ఆ. నిప్పపువ్వులివియు నేకైకపలములు
పంచదార నైదుపలములుంచి
వండి తులము గ్రోల వదలునుమేహము
ధర శతావరీఘృతంబనంగ.

గుడూచ్యాదిలేహ్యము.

సీ. వెలయగానల తిప్పవేరులతునకలు
తులము రెండుగను త్రిఫలములుపది

పలములు పసపును పదిపలంబులువెర్ర
పాపరవేరులు పదిపలములు
మానుపసపు పదిగానుపలము లెని
యింద్రద్రోణములసేట కుమరుపరచి
యష్టావశేషంబు సమరగాదిగగాచి
పారది తంగేడుచెక్క చూర్ణమొక్క
ప్రస్థంబులోహంబు పలమునుపిప్పళ్లు
పాపరవిత్తులు పలముగాను
పొడిచేసి యందులో బోసివండియు లేని
యనిరుపస్థంబు లమరజేర్చి

గీ. పక్వముగగల్పి చల్లార్చి ప్రతిదినంబు
తులముచొప్పున భక్షింప తొలగుసర్వ
మేహములు చర్మపీడిత దాహములును
లీలనడచు గుళూచ్యాది లేహ్యమనగ.

ప్రభావతిలేహ్యము.

సీ. కాంతము వెల్లబంకయు నభ్రకపుభస్మ
చిల్లవిత్తనములు నల్లకల్వ
దుంప తెల్లనిగుంజ లింపుగానూరిని
ప్రత్యేకమొకొక్క భాగములను
కాసీసమును మూడు గాభాగములుగూర్చి
యుసిరికపప్పు నింపెసగ ధనియ
ములకషాయంబుతో గలయగామర్దించి
గుళికలుగావించి కుండనుంచి

గీ. వీటిసరి కాలగింజలవిత్తులపొడి
తేనెయునుబోసి కలెదీసి దినినమేహ
గదలనడగించు మదికి నింపొదవజేయు
లెక్కకెక్కు ప్రభావతిలేహ్యమనగ

యోగీశ్వర ప్రభావతీవటుకములు.

సీ. వెలగచెట్టులబంక వేపబంకయు తుమ్మ
బూరుగబంకయు పసపు చిల్ల
విత్తులు మారేడుపిత్తులు చింతల
విత్తులు చంద్రులపిత్తు లుసిరి
కలపప్పు యిప్పపువ్వులు శృంగిభస్మ దిర
సెనపువిత్తనములు పొసగగూర్చి
సత్తు మధుకము భూశర్కరగడ్డ నొ
క్కొక్కభాగంబుల లెక్కమించి
గంధమెన్మిదిగ భాగంబులు తంగేడు
విత్తులు కల్వారవిత్తులమర.
పదిరెండు పదిరెండు భాగంబులుగగూర్చి
మొగలిచండ్లరసంబు తగనియరికి

గీ. గడ్డలును పిల్లిపీసర గడ్డలరస
ము లను దివసత్రయమునూరి గుళిక యత్న
ఫలము తేనెను చల్లనై నలవగ్రోల
సర్వమేహంబులునుగూల్చి జనుల కెన్న
వసుధ యోగీశ్వరప్రభా వటుకములను.

చంద్రప్రభావతీవటుకములు.

సీ. కరమొప్ప నారతికర్పూరమును వస
ముస్తలు నేలవే ముశెరి బొద్ది
మోడి పసపు చిత్రమూలంబు దేవదా
రును మానుపస్పును ధనియములను
చవ్య త్రిఫల యవక్షారము ల్మాక్షిక
ద్వయమ విశంగము కటుత్రయము కాచ
లవణంబు సైంధవలవణంబు సౌవర్చ
లవణంబు గజపిప్ప లవిరళముగ

నాజేసి మరియు సద్దాక్షాదిమొకొక్క
టికుర్రా ముష్టిదిననెరెత్తు
తెల్లనితెగడయు తెలియ దాచనియాకు
పత్రి యేలకులు నేపాళములను
నిడు రుద్రాక్షలివివేరు వేరుగాకర్షముల్
కితి నభ్రకభస్మ కెంపుకర్ష
ములుగ లోహముకర్షములునాల్గు శుద్ధిజే
సిన మహిషాక్షియు చెలువమిరా
గాకిలాజిద్భస్మ గనగాని వేర్వేర
మొనిమిదికర్షముల్ లెక్కనించి
గీ. యంబువులనూరి రేగుబండంత దినిన
మేహములు కుష్ఠశూల కామిలలు గ్రంధి
పాండు కాసలు వాకరలండ వృద్ధు
లడగు చంద్రప్రభావతి యనుగుళికల.

చాతుర్జాతికాదిచూర్ణము.

సీ. ఖ్యాతిమీరగ చాతుర్జాతకంబులు రేణు
కలు కోష్టువులు మంచిగంధములును
ద్రాక్షయు పల్లేరు తక్కోలములు జాజి
కాయ బూరుగుబంక ఖర్జూరములు
ప్రాచీతీగె క్రొండిశపా లుసిరికపప్పు
వల్లకల్వలదుంప నల్లయుప్పి
ముస్తలు కురువేరు భూశర్కరపుగడ్డ
చిల్లవిత్తులును మాంసియును యగరు
కర్పూర మారతికర్పూర భద్రము
స్తలును పెన్నెరుగడ్డలును సుమంచి
తంగేడువేరులతాటయు పైకట్టె
తాట పువ్వులు నాకు దానివిత్తు

లంబవఁ లొద్దుగు యష్టిమధూకంబు
నొట్టివేళ్లను ముదమొప్ప నిష్క
మాత్రముల్ వేర్వేరమరఁగూర్చి చూర్ణించి
యభ్రకసింధూర మమరమూఁడు

గీ. పలములుగఁగూర్చి కాంస్యంపుపాత్రనుంచి
పరఁగ పన్నీటిచేనైన పంచదార
నైన గ్రోలఁగ మేహముల్మానుఁ నిజము
నవనిలోన చాతుర్జాతకాదిరజము.

కర్పూరాదిచూర్ణము...

సీ. కరమొప్ప నారతికర్పూర కోష్టు క
ర్పూర శిలాజితుల్ పొసఁగ పసుపు
కణము మాంసియు లవంగాలు శ్రీగంధంబు
తెల్లవార్జంబును తేటపడఁగ
తామరదుంపలు ధనియాలు జాజికా
యలు కుంకుమపుపువ్వు లెలమిజీర
కర్ర పెన్నేరుఁలగడ్డలు కొండపిం
డియు తిప్పసత్తు యష్టిమధుకంబు
ద్రాక్షలు పల్లేరు తాడికాయలపొట్టు
కురువేరు గుమ్మడు గొబ్బివిత్తు
లల నేతిబీరవిత్తులు యేలకులు గజ
పిప్పళు లరటిపం డొప్పెదముగ
పరఁగతంగెడువేళ్ల పైచక్క కట్టెల
త్రాట పువ్వాకులు దానిఫలము
ఖర్జూరఫలములు గగ్గెర భద్రము
స్తలు కేసరములు ముస్తలును నేల
తాడిగడ్డలు బలితంపు చంగల్వగ
డ్డలు సమాంశలు చూర్ణములుగఁజేసి

శర్కరచూర్ణము సరిగల్పి నెయ్యితో
గాని బియ్యపుకడుగుగాని గూర్చి
గీ. యనుభవించిన సర్వమేహములు తృష్ణ
లన్నికి కామిలములు శైత్యములు అరుచులు
వీర్యవృద్ధియుగావించు వినఁగ కర్పు
రాదిచూర్ణంబు సర్వరోగఘ్నమనగ.

### అశ్వగంధాదిచూర్ణము.

సీ. శరమొప్ప పెన్నేరుగడ్డలతుక్కలు
మునగచెక్కరసంబు మొదట వెన్న-
సహదేవరసమున సరవిభావనలు నే
ర్పడజేసి మేకలపాలలోన
సన్నపుసెగమీద చిన్నగావండి తీ
సిన తుక్కలవి రెండుసేర్లుజాజి
కాయ జాపత్రి త్రికటుక త్రిఫలములు
నేలకులును లవంగాలురేణు
కలు కోష్టు నతివస గ్రంధి తగరము భా
రంగి కచ్చూరముల్ తుంగగడ్డ
లగరు సుగంధిపా లలవష వట్టివే
ళ్ళరువేరు జీరక గూఢపాల
తాళిసంబును చిత్రమూలంబు కుంకుమ
పువ్వు సిందూరము పొసగతులము
తులములలెక్క నిమ్ముగగూర్చి చూర్ణించి
బట్టపైరాయగా బడికిపాడికి
సమభాగమగునట్టి శర్కరగలవేసి
తులమెత్తు యుష్ణధారలను ప్రొద్దు
నను యొక్కసారిగా దినదినంబును గ్రోల
సప్తదోషంబులు సర్వగదల

పాండు కామిలములు పైత్య రక్తము మేహ
మందాగ్నులడచు నిక్కముగ నూరు
గీ. గర్భిములసత్వమిడు కాంతిగూర్చు వీర్య
వృద్ధిగావించునూరేండ్లు వెలయ సేయు
ప్రాణ్ణబలమశ్వగంధికా వెలయు సేయు
ప్రాణ్ణబలమశ్వగంధికా చూర్ణమవని.

పథ్యములు.

సీ. పాతబియ్యము పెద్దవడ్లబియ్యంబును
కరము గోధుమలు జాంగలపుమాంస
ములు చల్ల వెన్న బచ్చలికోర చల్మిడి
జేతరాసులకూర లాతభముగ
పొన్నగంటులకూర నెన్న పచ్చ పెసర
కట్టును యుసిరికకాయ పొట్ల
కాయలు నల యరిటికాయ పూలును వెల
గలపండ్లు కాకరకాయ చేను
గీ. లైనవస్తువులును శిరస్నానములును
నేను మొప్పగ సేయునాయామనములును
మేదినీస్థలిలోపల మేహరోగ
పటలికివి పథ్యములటంచు బల్కబడియె.

అపథ్యములు.

సీ. పెరుగు తేనియ కల్లు బెల్లంబు నెయ్యి పు
ల్సులు పాలు వెల్లిపాయలును యింగు
వావాలు నిద్దుర యంగజకేళిచే
పలునాగరంబు నువ్వులును పిండి
వంటలు కందయు పనస గొబ్బరనీళ్లు
ములకకాయలునివి వెలయునవని

మేహరోగార్తి సంపీడితజనుల క
పథ్యంబటంచును బల్కబడియె
గీ. శాస్త్రములయందుగాన నీ సాంఙ్ఞగాంచి
వైద్యములుసేయుచోట నవశ్యముగను
వీటిపథ్యములిడునెడ విడువవలయు
సకల వైద్యప్రవరులు నిస్సందియముగ.

---

పదునెనిమిదవపద్ధతి.

(పైత్యరోగప్రకరణము.)

పైత్యరోగనిదానము.

సీ. ఆవరణమును సూర్యావరణము యామ్ల
కరవాద కోన్మత్త కామిలంబు
మదన విసర్పలు మధు పాండ్రకింబులు
స్వేద రక్త క్రోధ శీతలములు
కుసుమ వివర్ణముల్...తృష్ణలు భ్రాంశ
మూర్ఛాఖ్యదుర్భావములునుచర్మ
నామదుర్గంధ శిరో ముఖ్య పైత్యము
లిరువదినాలుగై బరగి మర్త్య
గీ. తతులవేధించు కృత దుష్కృతంబువలన
వాటి వివరము మాదులు తేటగాను
జెప్పెదను భేషజులమది కొప్పిదముగ
నంధకాసుర జైత్రయార్యాకళత్ర.

అవరణపైత్యము.

చ. తనువు శిరంబు భారమును దాహము ఛర్ది వివర్ణ శోష వే
దనలు సదాశిరోభ్రమణ తాపము కాంతివిహీన సత్వభం

జనము నజీర్ణకంఠమువున జాగ్రత గాఢతరామయాల లో
చనముల కెంపులావరణి సొంజ్ఞదనర్చిన పైత్యహేతువుల్.

సూర్యావరణపైత్యము.

క. మనుజుడు సూర్యోదయమును
గనుగొనినన్ కండ్లు దిరుగు కసువడి మూర్ఛల్
గనుపించు దప్పిగలుగను
ఘనసూర్యావరణపైత్య గదకిద్ధరణిన్.

ఆమ్లపైత్యము.

క. అరుచియు బలుపులి తేపులు
తరుచాకలిగాదు సర్దు తనువునదాహం
బురుతర కోపము వెస ని
ద్దురరానివ దామ్లపిత్తదోషమువలనన్.

కరపాదపైత్యము.

క. కరపాదంబుల మంటలు
మరితీపులు దప్పి శోష మలబద్ధము దు
ర్భరతర కరపాదాహ్వాయ
నిరుపమ పైత్యంబుగాగ నెరుగుడి జనముల్.

ఉన్మత్తపైత్యము.

క. తనుదాహంబు వికారం
బును వాంతులు వళ్లుదిరుగు మూర్ఛ స్వప్రహద
ష్టును వేగమూత్రమలములు
జనుదెం చున్మాదపైత్య సంగతి దెలియన్.

కామిలాపైత్యము.

క. కన్నులు ముఖమును మూత్రము
లెన్నంగా పచ్చనగుచు నెపుడాకలిగా

కున్న మలబద్ధత్వము
ల్బన్నిన నిలలోన కామిలాపైత్యమగున్.

మదనపైత్యము.

క. తాంబూలముగొన చమట ని
జంబుగ తనువెల్లనిండు చపలములై నే
త్రాంబుజముల్ద్రిప్పును బలి
తంబగు నిమ్మదనపైత్య దైన్యమువలనన్.

విసర్పిపైత్యము.

క. తనువున సిబ్బెంబులవలె
గనుపడి తోలూడి మెరుపుగలుగును కోపం
బును తీట యరుచి దుర్బల
మునుజెందు విసర్పపైత్య ముఖ్యగుణంబుల్.

మధుపైత్యము.

క. ప్రాతఃకాలము మధురో
పేతంబగునోరు యరుచి బెరయూ శ్లేష్మం
జేతెరి కుత్తుకనంటిన
ఖ్యాతిన్ మధుపైత్యగుణము గనుపించినచోన్.

పౌండ్రికపైత్యము.

ఆ. శ్వాస కాస హిక్క సర్వాంగశీతలో
ద్గార మరుచి భ్రమణ దాహ శోష
పవనతిక్తమూర్ఛ వైవర్ణతంద్రలు
పరగు పౌండ్రికాఖ్యపైత్యమునకు.

స్వేదపైత్యము.

క. మిక్కిలిచమ్మట కాయము
చిక్కను తెలుపౌను జీర్ణ శీతలకంపం

ఱెక్కువ దినదినమున పెం
పెక్కిన యది స్వేదపైత్య మెరుఁగుడి సుజనుల్.

రక్తపైత్యము.

సీ. గుదమున నైనను గుహ్యంబునం దైన
నాసికమున వదనమున నైన
మాస మొక్కట రెంట మరి మూఁట నాల్గింట
పక్షపక్షంబునఁ బరఁగ రెండు
మూఁడు దినముల కైన నాఁడె మూరక్తమై
నను కృష్ణవర్ణమౌ ఘనజలంబు
వెలువడి కరపాదములు మంటలొదవిన
సంతాపమమర నిస్సత్వ కాంతి
గీ. హీనమైన శిరశ్శూలబూని రొప్పు
దగ్గు మూర్ఛ భ్రమాజీర్ణ దాహ మగ్ని
మాంద్యము మలబద్ధకము నేమరక నుండె
నేని యిది రక్తపైత్యాభిధానిసుమ్ము.

క్రోధపైత్యము.

క. ఎప్పుడు కోపము గల్గును
తప్పుడు వచనములు బల్కు తాపముతోడన్
నిప్పుడమి క్రోధపైత్యము
గప్పిన మానవుఁ డనుచు కార్మణులనిరీ.

శీతపైత్యము.

క. జ్వరముచు కండుపు హిక్కలు
గురుఛర్దియు లోచనములు కొంచము మెరుపుల్
కరపాద విదాహంబును
బరువడి తలదిరుగు శీతపైత్యంబనఁగన్.

### కుసుమపైత్యము.

క. ముక్కున నెత్తురుగారుట
గ్రక్కున తలనొప్పి మంట గలుగుట జనులం
జిక్కులుబెట్టుట ధర బొ
ప్పెక్కగ నిది కుసుమపైత్య మెన్నందరమే.

### వివర్ణపైత్యము.

ఉ. పూర్వపుదేహకాంతి పడిపోయి మరొక్కవిధంబుదోచి సౌ
కర్యములేక చేతులను కాళ్లనుమంటలుబుట్టి కాన దు
ర్వీర్య వికార కంఠకఫ విహ్వలతాపము లొందెనేని యా
యుర్వి మనుష్యకోటికి మహోగ్రతరంపు వివర్ణపైత్యమౌ.

### క్షుధాపైత్యము.

క. పటుగతి మైకాగుట యా
కటదిను నన్నంబుమిగుల కడుదప్పికి మి
క్కటమరుచి జనులనేచును
కుటిలగతిన్నిదియె యెన్న క్షుధపైత్యమగున్.

### తృష్ణాపైత్యము.

క. నొప్పెపుడు కడుపులోపల
దప్పియు ప్రొద్దునను శీతతనువును మెడ మం
టొప్పును తృష్ణాపైత్యము
గప్పిన మనుజులకునివియుగా గుణములగున్.

### భ్రంశపైత్యము.

క. చింతాపస్మారంబులు
సంతతట లెబ్బిబ్బుతరచు లాడుటకోపం
బింత వికారపుచూపులు
సంతనపడ భ్రంశపైత్య సంగతులమరన్.

మూర్ఛాపైత్యము.

క. పతరిమూర్ఛ శరీరము
శీతంబగు వళ్లునొప్పిజెందుట దాహం
బాతతగతి గల్గుట వి
ఖ్యాతిగ మూర్ఛాఖ్యపైత్యగదకివి గుణముల్

దుర్భావపైత్యము.

క. తనువు కృశించుట దుర్భా
షణలుంగలవెపుడు సర్వసంగత్యాగం
బునుగలిగిన దుర్భావం
బనుపైత్యము దోచుజనుల కగునీగుణముల్.

చర్మపైత్యము.

క. చిక్కుట మైతోలూడుట
యెక్కిళ్లను తీటగలుగు చెన్నగనిదియే
నిక్కంబు చర్మపైత్యము
చక్కనగున్ మందులిడిన సద్వైద్యులచేన్.

దుర్గంధపైత్యము.

శా. సారంబేమియులేక కంఠమును నాసారంధ్రముల్ మెండు వి
స్తారంబౌ భ్రమణంబు భ్రష్టరుచి సంతాపంబు నిస్సత్వమున్
కూరుం కేమియులేక శ్వాసయును దగ్గున్శీతమౌ గాత్రమున్
తోరంబైచను మర్త్యసంఘములకున్ దుర్గంధపైత్యంబునన్.

శిరోపైత్యము.

క. తలదిరుగు టరుచి దేహము
బలుతాపము రొమ్మునొప్పి బలువైయొప్పున్
పులితేపులుగలుగుట ని
య్యలను శిరోపైత్యమనుచు నెన్నిరిభిషజుల్.

## పైత్యములకౌషధములు.

ఆవరణపైత్యమునకు పైత్యాంతకరసము.

సీ. పారదాభ్రకతామ్రభస్మము లినుపభ
స్మంబును లోహభస్మంబు హేమ
మాక్షిక తాళకి మీక్షింపనన్ని స
మవుపాళ్లుగా యష్టిమధుక ద్రాక్ష
ఫలములు తిప్పతీగెలు నీరుపీటయు
పాలగుమ్మడిగడ్డ పరగ వీటి
రసములమర్దించి వెస పంచదారతో
గాని తేనియతోటిగాని నూరి
మాడెత్తు త్రావ్వన మాత్రలుగావించి
పంచదారయు నావుపాలనైన
నాయష్టిమధుకకషాయంబు కూతురు
బుడమసమూలంబుబోడియ చల్ల

గీ. నీళ్లనైనను సేవింప నిజము యావ
రణపుపైత్యంబుమాను నూర్ధ్వగతమిదియు
నైన నేడాదియైనను యారునెలల
నైనసేవింప గుణమగుననిరి బుధులు.

శుద్ధక్రియ.

గీ. భువి సమూలంబు కూతురుబుడమరసము
పావుశేరందులోపల పరగ గుంజ
యెత్తుగా రససిందూరమిడియు గలపి
ద్రావ నావరణంపు పైత్యంబడంగు.

సూర్యావరణమునకు శశిలేఖ రసము.

సీ. గంధక రస వెలిగారముల్మణిశిల
లేలకుల్ మహిత తక్కోలములును
జాజికాయలు సమాంశలుగూర్చి పిల్లి
పీసర కషాయంబున నరగనొక్క

దినము మర్దనజేసి దీని గుంజలవలె
మాత్రలుగావించి మాత్రి పంచ
దారతేనెలనైన జీరకచూర్ణంబు
శర్కరతోనైన జనులుగ్రోల
గీ. ధరణి సూర్యావరణపు పైత్యంబు దొలగు
సౌఖ్యములుగల్గు మందాగ్ని సమసిపోవు
సకల దుర్దోష తతులను సంహరించు
రమ్య శశిశేఖరాహ్వాయ రసమనంగ.

ఆమ్లపైత్యమునకు, విష్ణువల్లభరసము.

చ. అతులరసంబు గంధకము నభ్రకభస్మము నేలకుల్ సుగం
ధితగరమెన్న కేసరము తేటపడన్ సరిజేర్చి జీరకన్
జతనముగామథించి యిరుజాములు కుప్పెనువండితీసి స
మ్మతమున రెండుగుంజల ప్రమాణము తేనియనైన శర్కరా
న్వితముగ గ్రోల నామ్లభవపిత్తము మానును విష్ణువల్లభా
ఖ్యతవిలసిల్లు దీనిమును లశ్విని దేవులు బల్కి రెప్పుడున్.

కరపాదపైత్యమునకు పాణిబంధరసము.

చ. బలిరసలోహముల్ సమపుపాళ్ళను జీరకసారముంచి యి
మ్ములమథియించి కుప్పెనిడి మూడుదినంబులువండి గుంజయె
త్తులవడ తేనె పిప్పళుల నైనను శర్కర కొంచెముంచి యా
మలకఫలంపుసారముగ మాన్యులొసంగగ పాణిబంధనం
బిల కరపాదపైత్యరుజ నేరికినైన దొలంగజేసెడున్.

ఉన్మాదపైత్యమునకు కైలేయఘృతము.

సీ. కూర్చిసమూలంబు కూతురుబుడమయు
తిప్పతీగెలుద్రాక్ష దెలియ రెండు
ద్రోణంబులైనట్టి తోయంబులోనిడి
యష్టావశేషంబు నమరగాచి

నేలగుమ్మడువేళ్ళనీరంబు చెరకుర
సంబు కూష్మాండరసంబు పాచి
తీగరసంబును తెల్లజిల్లేడు ప
ల్లేరును కన్నెకుమారి పిల్లి
గడ్డ లనంటులగడ్డ గరిక బిల్వా
ముల వేళ్లు నీరుచంచలిరసములు
నారికేళపురస మీరసంబులు వేరు
వేరుప్రస్థార్థము వివరములును
ద్విప్రస్థములు నెయ్యి వెసనొక్కటిగ కల్పి
జాజికాయలు చతుర్జాతకములు
కటుకత్రయంబును కచ్చూరములు తుంగ
ముస్తలుసిరకపవ్వలును విప్ప
పువ్వు లొద్దుగపువ్వులు మధుకంబు
కటుకరోహిణియును ఖర్జూరములు
కురువేరు జీర తక్కోలంబులును కల్వ
గడ్డలు తామరగడ్డ శొంఠి
తామరతూండ్లును యోమంబు మంజిష్ట
కంకుష్ఠరాస్నయు గంటుబార్జీ
లమరగానివియెల్ల నర్థపలంబులు
పొడిజేసి ఘృతములోబోసి వండి

గీ. వడియగాబోసి కర్షంబు పుడమిజనుల
కిడిన నున్మాద పైత్యంబు నడచు నిదియె
దనరనితరంబులైన పైత్యములడుచు
హితవుగల్గించు నైలేయ ఘృతవరంబు

కామిలాపైత్యమునకు శూలపాణిరసము.

సీ. బలివెలిగారంబు పారదభస్మంబు
కూతురుబుడుమాకు కోష్టు యేల

కలు తిప్పసత్తు ముస్తలు వట్టివేళ్లును
సమభాగములుగాగ సంతరించి
అల్లపురసమున నమరగా రెండుఝా
ములునూరి రెండుగుంజలకుసాటి
గా మాత్రలొనరించి ఘనులు జీరకకషా
యంబుతో నివ్వగా నవనిలోన

గీ. కామిలాపైత్యము నడంచు ఘనతమించు
పరగనీయౌషధంబు శంకరుడుజెప్పె
నశ్వినులకును ముందు నత్యాదరమున
ప్రాణులనుబ్రోవగల శూలపాణిరసము.

మదనపైత్యమునకు మహేశరసము.

మ. రసకర్పూరము యభ్రకంబు సరితోరంబెట్టసంధ్యాకు స
ద్రసముం బోసి మధించి తద్రసములో రంజిల్లు డోలాఖ్యవం
డి సమీచీనపు గుంజమాత్రమిడగంటేయల్ల పస్పానతో
యెసగన్మన్మథపైత్యముం దొలగు మాహేశాఖ్య మీమందున

విసర్పిపైత్యమునకు వీరభద్రరసము.

సీ. పారదంబును నుక్కుభస్మంబు బలి నాభి
సమము మోదుగచక్క సారముననుఁ
త్రిదినముల్ హంసపాదని మూడుదివసముల్
వేశ్వేరనొండి కుప్పెనుఘటించి
రెండుజాములు తగ వండి మోదుగుచక్క
రసమున దినుగ మర్దనముజేసి
మాషమాత్రంబుగా మనుజులు జీర క
షాయముతోనైన చంద్రచక్క
ల కషాయముననైన ప్రకటింప తగిరస
వితులకాద్యంబు వేనిమైన
నెలలునాలుగుగ్రోల దొలగు విసర్పిపై
త్యంబిది వీరభద్రాఖ్యరసము

పూతలు.

త్రిఫలయుంబును సైంధవంబును నూనె
గలపి మేనునబూయగాను మొకటి
తులసియాకులరసం బలదగా నొకటిపసా
నాహూఢిగా చేదుబీరవిత్తు
లనుదీయుత్తైలంబు గొనిబూయుటొక్కటి
యావాలునువ్వులు నమర పసపు
తగిరసవిత్తులు తగసరిసము దీ
సియు నందులోపల చేదుబీర
విత్తులతైలంబు వేసి లెదరిసము నై
, బూయుటనొక్కటి ముగరయాకు
వెలగాకురసములు వెన్నలోపలగల్పి
గాత్రంబుపై బూయగానుమొకటి
గీ. మొప్పగాబలి యనుపానయుక్తివలన
మండలము సేవజేయగా గండడంగు
శుద్ధసత్క్రియలివియని శూరులనిరి
బాగుసేయ వినక్పినాపైత్యమునకు.

మధురపైత్యమునకు దాక్షాయణీరసము.

సీ. గంధకంబును తాళకంబును మణిశిల
వెలిగారములు సమం బలవరించి
దినమును హంసపాదినిమూత్ర కుప్పెను
ఝామొండి దించి గుంజాప్రమాణ
మును యనుపానయుక్తినివ్వ మధురపై
త్యంబును నశియించు ధరణిలోన
దాక్షాయణీరస మీక్షింపనిది దీని
నశ్వనిదేవుల కథపుడసియె
గీ. మునులుదెచ్చిరి మందును ఘనమటంచు
గాన వైద్యులు రుజకివ్వగాశుభంబు

అఖిలపైత్యాఖ్యశైలవజ్రాయుధంబు
దీని నెన్నగదరమె యేజ్ఞానికైన.

పౌండ్రకపైత్యము.

వ. దీనికి సమూహాలేహ్యాదులలో ననుకూలమైనదిగాని పాణిబంధన
రసమునుగాని సేవించవలయును.

స్వేదపైత్త్యమునకు విషమనేత్రరసము.

సీ. రసగంధకంబులు వసనాభి కటుకత్రి
యంబును జీరక యద్దసరము
త్రిఫల చిత్రకములు దెలియ బోడతరంబు
సరిమిరాకన్పైనుంచగ దినములు
మూడుగానొండి నిమ్మలగాను రెండుగుం
జలయెత్తు తేనెలోగలపియైన
పంచదారనునైన భక్షింప విషమనే
త్రరసంబు మిరియాలు రసపుభస్మ

అసమాక్షరసము.

కాంతభస్మము వెలిగార మభ్రక హేమ
మాక్షికంబులును సమంబులమర
చిత్రమూలకషాయ సేచనంబున నూరి
గాజుకుప్పెనువండి ఘనులురెండు
గీ. గురిజలెత్తల్లపురసంబు మరిచచూర్ణ
మునను యొసఁగిన నసమానమనెడురసము.
స్వేదపైత్యంబునడచును సిద్ధమనుచు
శివుడు యారెండుమందుల జెప్పెతొల్లి.

రక్తపైత్యమునకు రక్తమాహేశ్వరరసము.

సీ. బలిపారదంబులు పైడిభస్మము రస
సిందూర కాంతముల్ చెలగుతామ్ర

భస్మంబు సీసంపుభస్మంబు తగరపు
భస్మంబు నెఱవెండిభస్మతులలు
చెలువొందు వజ్రకసిందూరమును పది
భాగంబులుగ నుక్కుభస్మ మినుప
భస్మముల్ మూడేసిభాగంబులుగఁగూర్చి
ఖర్జూరములును ద్రాక్షాఫలములు
నెంచను మధుకంబు నిప్పపువ్వులు పిల్లి
పీసరయును కురువేరు నేల
ముమ్మడు లొద్దుగ కూతురుబుడమ శ్రీ
గంధంబు తామరగడ్డ దాని
తూంట్లొట్టివేళ్లను తుంగముస్తలు కల్వ
గడ్డలు కోష్టు రక్తంపుచంద
నము నూనెముంత వేళ్లమర బూరుగవేళ్లు
సహాముూల సహాదేవి జతగనరటి
గడ్డలు పల్లేరుగలపి కషాయ మ
మరగాచి యొకనూరుమార్లునూరి
మరియొక్కటిగ నూరుమారులు భావించి
లీలతో రెండుపలాలు యెత్తు

గీ. పరగమాత్రలనొనరించి పంచదార
తిప్పసత్తావునేతితో నొప్పగలపి
భక్షణముసేయగా రక్తపైత్యమడగు
రక్తమారేశ్వరాఖ్య సంయుక్తమగుచు.

శుద్ధక్రియలు.

సీ. పంచదారయు ద్రాక్షపండ్లు కల్కక రస
సిందూరమును సేవసేయఁటొకటి
ఘన రసకర్పూరమును పదిచిన్నము
లలవడ ద్రాక్షపండులును రెండు

తులములుశర్కర గల్పిమాత్రలుజేసి
రహిననష్టసరపాకరసము తేనె
వేసిన్వొక్కటి వెదురాకు లలతుంగ
గడ్డలు దానిమ్మకాయ లొట్టి
వేళ్లును మరికురు వేరును కూతురు
బుడనికషాయంబు బొసగుకొంటె
పొడిగూర్చి సేవింపబడుటయొక్కటి లక్క
రసము తేనెయుగోళ్ళిల బొసగునొకటి

గీ. బండిగురివిందచక్క నేర్పరచు చూర్ణ
మావుపాలను నేకుమార్ణముర భావ
నంబుగావించు ధరణి కషణంబుగొనుట
లొకటి యువిశుద్ధసత్రిక్రియ లొప్పుచుండు.

ఉశీరాదిచూర్ణము.

సీ. కరమొట్టివేళ్లును గ్రంథి తగరము నం
కోలంబు మరిలవంగాలు మంచి
గంధంబు పిప్పళ్లు చందనంబును మోడి
యేలకులును కేసరాలు తుంగ
గడ్డలు యారతికర్పూర ముసిరక
పప్పు తవాక్షీరి పరగ నాకు
పత్రి కృష్ణాగరు పరిశుద్ధులొనరించి
సరిజేసి చూర్ణించి శర్కరొక్క

గీ. భాగముగవేసి తులమెత్తుప్రతిదినంబు
రేపుమాపునుగోళ్ళిలగా బాపురక్త
పైత్యమును దీనినెంచగా బ్రహ్మవశమె
సొంపుగుల్కును శీరాదిచూర్ణ మనగ

చ. వెలయగ చందనంబు నొటివేళ్లును గడ్డసరంపు యీనెలన్
గలయగ ద్రాక్షపండ్లు మధుకంబును పిప్పళులున్ సమంబుగా

సలిలములుంచి కాచిన కషాయములోపల తేనెజేర్చి పై
ద్యులు నొసగంగ రక్తమను యుగ్రపుపైత్యము మానునిద్ధరన్.
గుమ్మడు చిక్రి లొద్దుగలు కాతుకుబుడ్డయు నొట్టివేరులుం
తమ్మిలమంచ శ్రీకరణము తప్పక చందన మొప్పగా కషా
యమ్మొనరించి తేనియ నయంబున గూర్చి యొసంగ రక్తపై
త్యమ్మును నాసికాకుసుమదారుణపైత్యములున్ దొలంగెడిన్

క్రోధపైత్యమునకు శమనభీకరరసము.

సీ. రసభస్మ గంధక వసనాభి మరిచ పిం
    ప్పలవణములు యవక్షార టంక
ణములు సద్యక్షార నాగరంబులు సమాం
    శలు జీరకక్ర కషాయముంచి
యును నూరి గాజుకుప్పెను బెట్టి నాలుగు
    ఝాములు వొండి గుంజాప్రమాణ
ము గ మాత్రలొనరించి తగ తేనెతోనైన
    శర్కర జీర కషాయమందు

గీ. కూర్చియైనను గ్రోలగా క్రోధపైత్య
హరణమొనరించు శమనభీకర రసంబు
యామ్లపైత్యంబు దీనిచే నణగిపోవు
దీని వర్ణింపదరమె వాగ్జానికైన.

శీతపైత్యమునకు కాత్యాయనీరసము.

సీ. పారదం బభ్రక భస్మంబు మణిశిల
    గంధకంబులు సరిగాగ గూర్చి
గలియ నుమ్మెత్తచక్కి జలములతో రెండు
    దినములునూరి కుప్పెనిడి యాఱు
ఝాములొండియును గుంజాద్వయ మాత్రంబు
    తేనెపిప్పళితోడ నైన నావు

నెయ్యి మిర్యాయముతోడ నియ్యగా కాత్యాయ
నీరసంబననొప్పు చారుగతిని
గీ. శీతపైత్యంబు హరియించు సిద్ధముగను
పాణిబంధనరసమును బాడబాగ్ని
రసము యాపైత్యమునకును నొసగ కుదురు
ననుచు జెప్పెను శంకరుండశ్వినులకు

కుసుమపైత్యమునకు అంగజారిరసము.

చ. బలిరసతాళకంబులు నభంబును హింగుళనాభము ల్సమం
బులు గలిజేరుసారమున నూరియు కుప్పెననొండి సెన్గలం
తలవడమాత్ర తేనెనెయినైనను గ్రోలగ నంగజారియన్
బలురసమొప్పెడున్ కుసుమపైత్యమడంచును నిశ్చయంబుగన్.

శుద్ధక్రియ.

సీ. పాలతో దానిమ్మపూలు తెల్లనిగరికె
వేరులు మర్దించిపిండినట్టి
సారంబును రసకర్పూరంబు మాక్షిక
ద్వయము మిశ్రముజేసి తలనుయంటు
నస్యముజేసియు నమృతతేనియ పంచ
దారనుకూర్చుక ద్రావుటొకటి
దానిమ్మపువ్వులు స్తన్యంబు గరికెవే
ళ్ళాయతనస్యంబు సేయుటొకటి
మామిడిజిగురును మానుతేక్షరముల్
చేపట్టి నస్యంబు సేయుటొకటి
మఱియూడలకొనల్ మరిచన్ను బాలతో
బెంపొందనశ్యంబు బీల్చుటొకటి
గీ. యిప్పపువ్వు తెల్లదేచ్చి మల్లియగడ్డ
రసము నొకటి పాండురంపు నీరు

నల్లిగడ్డ నగ్గిఁబడికించి తీయు ర
సంబు నస్యమొకటి జనునటండ్రు.

విష్ణపైత్యమునకు.

వ. సమూహయోషధలేహ్యఘృతాదులలో నాలోచించి వ్రచ్చుకునేది.

క్షుధాపైత్యమునకు సేనానీరసము

ఉ. జానుగ స్వర్భకంపుబలి శంకరువీర్యము తుల్యభాగముల్
గానిడి యొక్కరోజునను కల్గిసారముతోడనూరి బా
గౌనది వజ్రమూషమున నైనను కుప్పెనుగాని కుక్కుటా
ఖ్యానపుటంబు వేసి గురిజంతయు నల్లముతోడ గ్రోల సే
నానిరసంబు క్షుత్తుయను నామపుపిత్త మడంచునిమ్మహిన్.

తృష్ణాపైత్యమునకు మహాసేనరసము.

సీ. వసనాభి మణిశిల రసగంధకంబులు
వెలిగారమరయ పిప్పళులు నల్ల
యుమ్మెత్తవిత్తులు నెప్పసమంబులు
హంసపాదిరసంబునందునొక్క
దినము మర్దనజేసి దనర మూసనుపుటం
బుంచి జమ్ముదుబాల నొనరతిరిగి
పటపాటిగానూరి గురిజెత్తు కురువేరు
క్వాథంబు నుసిరికపప్పుక్వాథ
ముననైన గ్రోలగా ముఖ్యము నీమహా
సేనరసంబున జెల్లు తృష్ణ
నామపైత్యమడంచు నారికేళోదక
మందుమిశ్రము జేసి యరటిపండు

గీ. గ్రోల నొక్కటి కొతిమెర్లు కోష్టుచూర్ణ
పరచి కొబ్బరనీట నేర్పడగదినుట

నొకటి యవిశుద్ధ సత్క్రియ లూహనుంచి
తెలియవలె వైద్యసింహులు తేటపడగ.

భ్రంశపైత్యమునకు ఉమామహేశ్వర గుళికలు.

సీ. నాల్గుశేర్లగు గుటకల్గర రసమున
మిరియాలు నొకశేరు కరకకాయ
కణము సైంధవమును గంటుభారంగి పు
ష్కరమూల మొక్కొక్క టిరువుగాను
రెండువరాలెత్తు రీతిగాచూర్ణించి
తగినట్లు తేనె నింపుగనుగల్పి
కల్గరి రసమింకగా భావనముజేసి
యక్షుపలంబెత్తు నవనిజనులు

గీ. భక్షణముశేయ నడచునా భ్రంశపైత్య
మనెను శంభుండు పూర్వ మాశ్వినులకు
మహితతేజముగల్గు నుమామహేశ
గుళికలను పేరజెన్నొందె కువలయమున

మూర్ఛాపైత్యమునకు కృత్తివాసరసము.

సీ. గంధకసూత టంకణము లభ్రకభస్మ
తుల్యభాగంబులు తుంగముస్త
ల కషాయమున దినత్రికము మర్దనజేసి
గుంజాపరిమాణంబు గూర్చి నారి
కేళోదకంబున గోళిలమూర్ఛాపైత్య
మడగిది కృత్తివాసాఖ్యరసము
దగుదీనికొక్క శుద్ధక్రియ యన రస
సిందూర మొక గురువిందగుంజ

గీ. యంత మరి నారికేళఫలాంతరస్థ
నీరమున గ్రోలగాజన వారమునకు

ప్రజల మూర్ఛాఖ్యపైత్యంబు పారద్రోల
ననుచు జెప్పెను శంకరుండశ్వినులకు

దుష్టపైత్యము.

వ. సమూహాలేహ్యములలోగాని ఆవర్ణపైత్యమునకుజెప్పిన పైత్యాంతకముగాని యిచ్చేది.

చర్మపైత్యమునకు విశ్వేశ్వరరసము.

సీ. వసనాభిగంధక రసకటుత్రయ మభ్ర
కము సైంధవంబు టంకణమునల్ల
యున్మత్తవిత్తులు యూహింపసమములు
కాకరరసమును గలియనూరి
సరవి కుప్పెనురెండు జాములువండి మా
షంబంత మాత్రలు సంతరించి
హంసపాదిరసంబు నావునెయ్యియు మిరి
యాలచూర్ణముగూర్చినైన జోడ
గీ. తరవుయాకురసము నైన శర్కరనైన
జనులుగ్రోలినంత చర్మపైత్య
విదళనంబు సేయు విశ్వేశ్వరరసంబు
దీని నెన్నదరమె మానవులకు

దుర్గంధపైత్యము.

క. పుడమిని దుర్గంధాఖ్యకు
బడబాగ్ని రసంబనంగ పైత్యాంతము లో
గడజెప్పబడవెయవియే
నిడగా గుణమౌను వైద్యులెల్లర దెలియన్

శిరోపైత్యమునకు

సీ. రసగంధకంబులు వసనాభిహింగుళ
నేపాళములుసరి నిల్పి ఖల్వ

మున చిత్రక కషాయమున రెండుజాములు
నూరి చిత్రకమూల సారమునను
యొకదివసంబు మందుడికించి జెమ్మడు
పాల జాములురెండు బట్టినూరి
యావులనెయ్యితో నైన నున్నపుమీది
తేటతోడుతనైన తెలియ బుడ్డ

గీ. బూసరాకుకషాయంబు వేసినైన
గుంజమాత్రంబుగోలిన గొట్టివేసు
ధర శిరోపైత్య రుజను సిద్ధంబుగాను
లాలితారోగ్యమూర్చా కళత్రరసము.

## పైత్యములకు సమూహాయాపధములు.

### కూష్మాండఘృతము.

సీ. సరవి కూశ్మాండ రసం బాఢకద్వయం
బావులపాలొక్క యాఢకంబు
ఘృతమొక్క ప్రస్థంబు జతజేసి ద్రాక్షా ఫ
లంబు పిప్పలి మధుకంబు యేల
కులుదాచినిచక్క చెలువగు తాళిస
పత్రియు ఖర్జూర ఫలములమర
వెదురు పప్పు సమములు వేసిపలంబుల
చొప్పునచూర్ణించి చూరఘృతము
లోనిడి గాచియు మానుగా వడబోసి
పలములిర్వదిగాను పంచదార
వేసియు కుడుపంబు పిప్పలిచూర్ణంబు
గలపి కర్షం బుషఃకాలమునను

గీ. మాత్రలుగజేసి గ్రోలిన మనుజులకును
నరయ నావరణాది పైత్యములడంచు

దీపనమొసఁగు మాంద్యఘోద్దీపకంబు
మొందఁగాఁజేయుచుండు కూష్మాండఘృతము.

ఖండామలకము.

సీ. ఉసిరికాయలరసము ద్రోణం బర్థ
పలము శర్కరయును గలిపి చిత్ర
మూలమును విశంగములు జీరకయు చతు
ర్జాతక మధుకముల్ సైంధవంబు
ప్రత్యేకములుపిని పలపలంబులు శుంఠి
నాలుగుపలములు నాల్గుమరిచ
ములు నాల్గుఁదశ యేలకులు నెన్న పిప్పళ్లు
మూఁడుపలంబులు మూఁడు తెగడ
పొడిఁజేసియందులోఁ బోసి యర్థపలంబు
మండూరమును జేర్చి మంచి తేనె
తొమ్మిదిపలములు తూచి యావుల నెయ్యి
యారుపలంబుల నందుఁగల్పి

గీ. లేహ్యపక్వముగను వండి లీల మెరయ
గడుసు పైత్యములకు నివ్వనడఁగు నరుచి
ద్రుంచు జీర్ణముగావించు మించి దీని
నెంచి నామలకఖండమటంచు రనిరి.

ఖండార్ద్రికము.

సీ. పైపొట్టునొలువనేర్పడు నల్లమొకపీశె
గొనియు తుంపులుగాఁగఁగోసి యావు
నెయ్యిపోలింటితో నెయ్యంబుగా వేసి
యెఱ్ఱిధాతువుగాను నేర్పడంగ
తునకలుగన్పడఁ గనిపంచదారయు
సరపిశెగాఁదూచి యందులోన

పడవేసి మరిచ పిప్పళులు లాకుపత్రి త
వాక్షీరి మధుక లవంగములును
జాపత్రి ధనియాలు జాజికాయలు శొంఠి
దాచినచక్కయు తాళిసములు
మంచిగంధము జటామాంసి కేసరములు
యాలకులును చిత్రమూల మొట్టి
వేళ్లను ముస్థలు వెలయగా చంద్రచ
క్కషాడి యొక్కొక్కటిగ సగతులము
లెక్కనుగూర్చి సాంపెక్కచూర్ణమొనర్చి
కలెవేసి లేహ్యపక్వమునవండి
గీ. దించి తేనియ యర్థశేరుంచి మొదటి
పూటకొక్క తులంబెత్తు పుచ్చుకొనిన
నఖిలపైత్త్యౌఘములు దీననణగు నిజము
కలితసౌఖ్యంబు ఖండార్ద్రికంబనంగ.

లఘువైశేయఘృతము.

సీ. పాలుపొంద కూతురుబుడమ సమూలంబు
ద్రాక్షితీసినరసం బొక్కతూము
ఆలనెయ్యొకతూము పాలొక్కతూమెకు
గలపి మధుకము శ్రీగంధ మిప్ప
పూలు తవాక్షీరి బొలుపొందశర్కర
దాడిమపండ్లను సరిదవరచూర్ణ
మొనరించి నెయ్యికి నెనిమిదోపాలుగా
నిడి నొండి యానెయ్యి వడియబోసి
గీ. పూట కరచేతిగుంటెకు పుచ్చుకొనిన
ధరణి నిరువదినాల్గు పైత్యములద్రుంచు
నరుచులడగించు జనులకు హాయిసేయు
శ్రేయమా లఘునామకైశేయఘృతము.

ఖండపిప్పలి.

సీ. పిప్పళ్లతునకలు నొప్పఁ జేయుంబావు
పంచదారయువీశె పాలునిరస
నెయ్యిఁ జేయన్నఁట జేర్చి పిప్పళ్లకీ
సరిగడ్డలరసంబు నరయ రెండు
సేరులు నొకచోటఁగూరిచి ధనియాలు
తులములుమూఁ డేలకులు యుసిరిక
పప్పు మిర్యాలు లాకుపత్రి కేసరి తవా
క్షీరి నాగరములు జీరకయును
తుంగముస్తలును లవంగాలు నొక్కొక్క
చరియు తులంబులలెక్క నరయఁ దెచ్చి

గీ. పొడిమొనర్చియు సందులోఁబోసి పాక
మొసరగాఁ జేసి తగినట్టులుంచి తేనె
నదియుభక్షింప పైత్యములడఁచు ఖండ
పిప్పలిసమాఖ్యమైకొన ప్రీతిసేయు.

సర్వపైత్యములకు కషాయము.

చ. జలముల పిల్లిగడ్డలును చందనముఁ మనుబాలవేళ్లు ద్రా
క్షలు దగచిర్రివేళ్లు మధుకంబును నల్లనికల్వదుంపలుఁ
చెలువుగ గాచుక్వాథమున నేయియు శర్కర తేనెయుంచి నై
ద్యులుయొసగంగ పైత్యములు యుగ్రపు వేకులు మానునిద్ధరన్.

చ. తెలియగ చేమపొట్లయును తీటకసిందయు ప్రేంకణంబులున్
సలవడ నేలవేము మరి యుడ్డసరంబును కటుకరోహిణుల్
జలములఁ జేర్చి కాచినకషాయములోపల నెయ్యి శర్కరల్
గలపుక ద్రావ పైత్యముల ఖండనసేయును ధాత్రిలోపలన్.

కషాయము.

సీ. ధరచిరుబొద్ది ముస్తలు చందనం బిప్ప
పూలొట్టివేళ్లను నేలవేము

కాలుకానుగు నల్లకల్వగడ్డలు మధు
కంబును కొడిశచక్కయును తమ్మి
తూండ్లును మరి చాగదుంప వేరింకణమును
మనుబాల మెట్టదామరలుగాచు
వర కషాయంబు శర్కర తేనెతో గ్రోల
సర్వపైత్యంబులు సమయు నిజము
గీ. మధుక కాకోళి మనుబాల మాదిఫలము
పిల్లిపీసర దానిమ్మ లుల్లసిలగ
లీలగాచుకషాయంబు గ్రోల పైత్య
ములును పైత్యపు వేకులు దొలగుసవని

పథ్యాపథ్యములు.

సీ. పిదపవడ్లును ద్రాక్ష పెసరకట్టును గోధు
ములును జాంగలమాంసములును పండు
గుమ్మడి చిలిమిరికూరయు గాయకూర
యుసిరికకాయ లింపెసగ పొట్ల
కాయలు దానిమ్మకాయ ఖర్జూరంబు
లావులనెయ్యియు నమరపథ్య
ములు లేతగుమ్మడి పులుసు యుప్పులు నూనె
కల్లు తెల్లుల్లి యవక్షారములును
గి. చేప లుల్వలు దీపియకాచెడుగువస్తు
వులును పెరుగు లపథ్యముల్దెలసి రోగి
జనులకౌషధమిడుచోట జరుపవలయు
వైద్యరాజులు కీర్తిసంపాద్యులగుచు.

---

## పాండురోగోత్పత్తి.

### (పాండురోగప్రకరణము.)

సీ. తేపులు వాకర దేహముశోషించి
పాండువై పచ్చనై యుండు కాంతి
హీనమై వేఁడియుగాని శీతముగాని
గలిగియు తలను కన్నులును నొప్పి
కడుపులో పలశూల కరపాదములమంట
లామ్లమైనను తిక్తమైననోట
బడిన నాలుకమీద తడిలేకపోయిన
నరుచియు దగ్గు రొప్పధికమైన

గీ. పాండువనఁదగువివరింప భక్ష్యశోష
జక్షయజపాండువులును శుష్క త్రిదోష
పాండువులు మత్స్యలక్ష భూమిభాగమందు
నైదుదెఱఁగుల బూని వైద్యంబుదెచ్చు.

### భక్ష్యపాండునిదానము.

గీ. మన్నుదినుబుద్ధి దాహ భ్రమలును తేపు
వడఁకుదేహంబు తేపులు వాంతి యరుచి
గోళ్లు మొగమును కన్నులు తెల్లనైన
భక్ష్యపాండువటంచు జెప్పంగబడియె.

### శోఫపాండునిదానము.

సీ. వడఁకును కన్నులవాపును నెగరొప్పు
దగ్గు శీతలమును తలదిరుగుడు
తనువునమంటలు ధాతునాశనమును
దాహంబు జాగ్రతదప్పుటయును
సత్వవిహీనాతిసారముల్ శూలయు
కఫ మరోచకమును కడుపులోన

మంటలు శోషయు వెంటవెంటనెకల్గు
శోషపాండువటంచు సుజనులంద్రు

క్షయపాండునిదానము.

గీ. వడకు పైత్యాధికము దగ్గు వాపు రొప్పు
కలలువాకహృచ్ఛూలలు కాంతిహీన
మోహ మరుచులు వాయువనాహములును
గలుగునా క్షయపాండు ప్రకాశమమరు.

శుష్కపాండునిదానము.

సీ. మూత్రంబు మలవినిర్మోచనవేళను
మంటలుగల్గి శ్యామలపునెరుపు
గా నయనములెఱ్ఱగా నల్పుగా సర్వ
గాత్రంబుశుష్కించి కడప మగ్ని
మాంద్యాతిసార భ్రమణ కుక్షిశూల వి
వర్ణ దుర్బలమద వాంతి ధాతు
నాశనంబులు వదనంబునవడకుట
పిల్లికూతలు నిద్ర పిచ్చికలలు
గీ. గల్గిసతతంబు వేకిమిక్కుటముజెంది
కాలమించుకజనినచో కాళ్లుచేతు
లందు వాపులుగనుపింపనతని జముని
పురమునకుజేర్చు శుష్కపాండురము నిజము.

త్రిదోషపాండునిదానము.

క. జ్వర మరుచి దాహ వాంతులు
కర సర్వేంద్రియవినాశకం బురమున నొ
ప్పిర వా త్రిదోషపాండువు
బరికింప న్నసాధ్యమనుచు బల్కిరిభిషజుల్.

## పాండురోగచికిత్సలు.

### కాంతవల్లభరసము.

సీ. పరిశుద్ధమగు కాంతభస్మంబు పదియారు
పాళ్లుకుక్కుటాభాక్షి పదియునాల్గు
పాతచిక్కెప్రహాశి పదిరెండుపాళ్లు టం
కణమును పదిపాళ్లు మణిశిలాష్ట
భాగముల్ కర్పూర పటుశిలాజిత్తారు
పాళ్ళన్నిటికిసరి పారదంబు
సూతంబుతోసాటి శుద్ధగంధకమును
ఖల్వంబులోజేర్చి ఘుట్టిగాను
జలముల నూరి మాత్రలుజేసి గాజుకు
ప్పెను వాలుకాయంత్రమునను యేను
దినములువండియు తీసి తొల్లిటివలె
నూరిచిన్నముళైదు గోరిపూటఁ

గీ. పూటకనుగ్రోల పాండువుల్ పాసగక్షయలు
నగ్నిమాంద్యము కాస జ్వరాదిగదల
నడచునిది కాంతవల్లభంబనురసంబు
తేనెననుపానములు బెట్టగానుమేలు.

### లోకనాథరసము.

సీ. పచ్చగవ్వలబూది పాళ్లురెండును రెండు
పరిశుద్ధమండూరభస్మ లోహ
భస్మమొక్కటియు తత్పాదాంశముగ రస
కర్పూరమర్ధభాగంబు గంధ
కమునిన్నియొనగూర్చి గజ్జెరువే ళ్లడ
సరపాకుయీనెలు సంబరేణు
చిత్రమూలపువేళ్లు చెలువొప్పనీటిర
సంబులు మూడుదినంబులు ప్ర

సిద్ధంబుగానూరి జేర్చి కుప్పెనుపాత
బలపంబుగొట్టి శీలలుబిగించి
యిరువదినాలుగు యేరుపిడకలపు
టంబులోనిడి గంధకంబు జీర్ణ
మగుఁ ట్లుడీసిన నౌషధమునకు తు
ల్యాంబగునటుల మిర్యాలనుంచి
మునగ తమ్మలపాకు జోడతరరసము
చేనూరిమైదెదు చిన్నములుగ

గీ. మాత్రలొనరించి తేనెతో మనుజతతులు
భక్షణముసేయ పాండు శోభా క్షయ జ్వ
రాదిక శ్వాన కాసలనడచు లోక
నాథరసమిది పార్వతీనాథుడనియె.

త్రియోనాఖ్యరసము.

సీ. రాగిరేకులు బలిరసములు సమమగు
పాళ్లుజేరిచి నిమ్మపండ్లరసము
పొన్నగంటిరసంబు బోసిమర్దించి కు
ప్పెనుబెట్టి గాఢాగ్ని ననువుపరచి
యొకఝామువండి గంధకమునుజీర్ణంబు
గాఁదీసి యది పొన్నగంటివేళ్ల
రసముననూరి మాత్రలుగుంజసరిజేసి
యల్లపురసముననైన కరక

గీ. కాయచూర్ణంబు బెల్లంబు గలపియైన
భక్షణముసేయ కామిలా పాండు యక్ష
శోఫలనుమాన్పు కాసలచూరబుచ్చు
వసుధలోన త్రియోన్యాఖ్యరస మనంగ.

లోహరసాయనము.

సీ. పారదభస్మంబు పాళ్ళునాలుగు లోహ
భస్మంబునెనిమిది పసిడిభూది
రెండుపాళ్ళు వెండి రెండుపాళ్ళు తామ్ర
భస్మంబురెండు నభ్రకము రెండు
భాగంబులుగను ఖల్వంబునను నూరి చి
త్రకమునుతుంగ ముస్తలు విళంగ
త్రిఫల త్రికటుకముల్ తిసమగు కొంకిత చ
క్కలు సమంబులుగను గలియనూరి
మహీవల్లమెత్తుగా మాత్రలుగావించి
చిరుబొద్ది క్రిందిరి యుసిరికపప్పు
నేలవేమును తిప్ప నేర్పుతో గాచుక
షాయంబులోన గుంజాప్రమాణ

గీ. మైనతేనియవిడిచొక్క మైనమాత్ర
నొకటిజనములు గ్రోలగా ప్రకటమైన
పాండుయక్ష్మజ్వరంబులు పారవెళ్ళు
యమితశాఖ్యంబులోహ గర్భాఖ్యరసము.

శుష్కపాండువునకు త్రైలోక్యసుందరరసము.

. పారదంబునునాల్గు బలిమైదు నేలతా
ములగర్దలదిషాడి తులమునైదు
త్రిఫలంబులును మరి త్రికటుకంబులనొక్క
టొక్కటి ప్రత్యేక మొప్పమిగుల
నైదుతులంబులు నమరబూరుగగడ్డ
లైదును తిప్పస త్తైదుపాళ్లు
యభ్రకసింధూర మారుపాళ్లునులోహ
భస్మంబు నెన్మిది భాగములుగ
పరగచూర్ణించి త్రిఫలకషాయంబున
నరువదినాల్గు మార్లికుపుగాను

భావించి కల్గరిభవకషాయంబున
ముప్పదిరెండును మునగచెక్క
రసముఁ బదియారు మసలకచిత్రక
మున దుష్టపుక్వాథమునను యల్ల
మునను ప్రత్యేకంబు నెనిమిదిపొప్పున
భావించి తేనెయు పంచదార
తోఁగాని తగనెయ్యితోఁగాని చింతాకు
రసముపిప్పళ్ల చూర్ణమునగాని
గీ. నైదుచిన్నములెత్తుగా నవనిజనులు
భక్షణముసేయగా శుష్క పాండువులును
క్షయలుశోఫలుమాను నిస్సందియముగ
రమ్య! త్రైలోక్య సుందర రసమసంగ

చంద్రమౌళీశ్వరరసము.

సీ. బలిమూఁడుతులములు పారదంబును మూఁడు
తులములుగాఁగూర్చి కలియనూరి
మూఁకుటిలోనుంచి మూసి సెలయుమర్చి
యొకఝాము గాఢాగ్ని నొండిదించి
తీసిచూర్ణముఁజేసి త్రిప్పసత్తేడుతు
లంబులునిడి తేనె డంబుమీర
బోసిమర్దనజేసి పూటకుమాడెత్తు
సేవయొనర్చిన శిష్టజనుల
గీ. కమితమగు శుష్కపాండు సంహారమగును
నితరపాండువులను ద్రుంచు నిష్టమొసగు
చంద్రమౌళీశ్వరరసంబు సౌఖ్యదంబు
చంద్రమౌళీశ్వరుఁడు జెప్పె జనులకిదియు

క్షయపాండుకామిలకు గుణకమండూరము..

సీ. గంధకసూతటంకణములు నొక్కొక్క
తులముచొప్పున మాడతులములు శ్రీ
ఫలములు మూడగుతులములు త్రికటుకం
బులు పాతచిత్రపు పొడియు తొమ్మి
దితులము ల్పదినెన్మిదితులములు గోమూత్ర
మలవడగా వేసి యందులోన
పాతబెల్లంబు ముప్పదియారుతులములు
గూర్చిపాకమునొండి కుదుటపెంచి
గీ. రేగుబండంత సేవింప రేపుమాపు
క్షయసమాహ్వయ పాండువుల్ సమసిపోవు
కాసలుహరించు కామిలా గదలద్రుంచు
పూరితానంత గుణక మండూరమనగ

భక్ష్యపాండువునకు పంచకోలమండూరము.

సీ. మండూరమును పదిరెండుపలంబులు
పంచితంబెన్మిది పలములందు
గల్పి నీరింకగా గాచిచూర్ణముజేసి
పంచకోలములొక్క పలము దేవ
దారును తుంగముస్తలు పలత్రయము మి
ర్యాలును మరి విళంగాలు పేర్మి
ప్రత్యేకమొక్కొక్క పలముగా గూరిచి
పొడిచేసి దానిలో బోసి గచ్చ
గీ. కాయమాత్రంబు గోళిం భక్ష్యంపుపాండు
గ్రహణిమందాగ్ని శూలలు గళహాలీమ
కాఖ్యగదలను హరియించు నవని పంచ
కోలమండూరమనగను కొమరుమించు.

త్రిదోషపాండువునకు సిద్ధమండూరము

సీ. సరగమండూరంబు పలములెన్మిది యావు
పంచితంబెన్మిది పలములందు
నీరికగాచి గజ్జేరు త్రికటుకముల్
తెగడచందనమును దేవదారు
పసపు చవ్యము మానుపసపు త్రిఫల చిత్ర
మూలంబు పుష్కరమూలమొకటి
కొడిశవిత్తులు మోడి వడి నేలదంతియు
ముస్తలు నతివస ముఖ్యముగను
ప్రత్యేకములునివి పలపలంబులుగూర్చి
పొడిచేసి యందులో బోసికలిపి
గచ్చకాయకుసాటిగా మాత్రలొనరించి
భక్షింపగా సన్నిపాత పాండు

గీ. భ్రమలు శూల గుల్మముల శోభలనువరుస
క్రిమిగదలుమాను బహువిధ భ్రమలుదొలగు
సిద్ధమండూరమిదియె ప్రసిద్ధముగను
నరులు సేవింపతగు భిషగ్వరుల నడిగి.

చించిల్యాదిలేహ్యము.

సీ. శతపలంబులుగ చించాపత్ర మినపతు
న్కలునొక్క యాబది పలములమర
జలము లెన్మందుము గలబోసి యొకతూము
నిలువగాగాచి యందులనుకూర్మి
పలములిర్వదినాల్గు పాతబెల్లమువేసి
పదియాఢపలము లేర్పరచియుల్ల
మును పొట్టువశిదీసి ముద్దజేసియు నిడి
త్రిఫలకషాయంబు దెలియ తేలు
మణియాకురసము నేప్పన యొక్కటొక్కటి
కుంచంబులెక్కనుగూర్చి శొంఠి

మరిచ జీరకములు మంఢూరమొక్కొక్క
పలములుచూర్ణించి గలసిలేహ్య

గీ. పాకమునవండి దించియు పదియురెండు
దినములును ధాన్యపుంజమునుంచి దినిన సర్వ
పాండు శోఫలుహరియింపబడును చించి
లాదిలేహ్యంబు జనులకు మోదమొసగు.

లఘుచించల్యాదిలేహ్యము,

సీ. పలములునూరు చింతలయాకు యిన్నతు
క్కలు నేబదిపలంబు లలమరించి
ఖర్వముజలములో గల్పి నాల్గవపాలు
నిలువగా నిరువదిపలము లార్ద్రి
కంబు పైపొట్టూడ్చి గల్పి పిప్పలి శొంఠి
మరిచ జీరకములు మహితముగను
ప్రత్యేకమైదైదు పలములుచూర్ణించి
మండూరమిరువది మాన్యపలము

గీ. లుంచి వండియు చల్లార్చి కుంచడందు
తేనెబడబోసి తులమెత్తుదినిన పాండు
కామిలా శ్వాస శోఫల నామమడచు
లీలతో లఘుచించల్యలేహ్య మవని.

మహాచించల్యాదిలేహ్యము.

సీ. కోరి చింతాకొక్క నూరుపాళ్లినుమురా
బొడి యార్ద్రిసార చిత్రకము లొక్క
టొక్కటి యేబదిలెక్కను చిరుబొద్ది
వేళ్లును గజ్జేరువేళ్లు దేవ
దారుచక్కయు వేరువేరుగా నరుబది
యైదుపాలును ధనియాలు ముల్లు

వెంపలి వేళ్లు నుతింపగా కొడిశచ
క్కలు దార్త్రిశఫలములు దెలియ వేరు
వేరుగా నిల పదియారుపాళ్లను దశ
మూలము ల్బవ్యంబు మోడివరుస
ప్రత్యేకమును జేసి పాళ్లనునాల్గేసి
లెక్కను గలవేసి లీలదూచి
యన్నిటికినిచతుర్థాంశ జలంబుంచి
కలపి నాలవపాలు నిలువగాచి
కడవకషాయంబు వడబోసియును పులి
చింతాకురసముకుంచెడును మాది
ఫలరస మొక కుంచెడలవడగా గల్పి
గాచి యందుల విశంగ త్రికటుక
జీరక త్రిఫల కచ్చూరము లేలకుల్
దాచినిచెక్కయు తాళిసంబు
ప్రత్యేకమొక్కొక్క పలములు చూర్ణించి
మండూరిభస్మంబు రెండుపలము
లును మూడుపలములులోహంబు నన్నియు
గూర్చి పక్వమొనర్చి కుదుటదించి
గీ. తేనెకొంచెముగాబోసి తినిన పాండు
కామిలా శ్వాస శోఫలు కానలడగు
మహి మహాచించిలాదిక మహితలేహ్యా
మనెడు నీమందు నెన్నగా నజునివశమె.

దాడిమాదిఘృతము.

సీ. దానిమ్మవిత్తులు ధనియాలునొక్కొక్క
పలములుగా నర్ధపలముచిత్ర
కము పిప్పళులు నార్ద్రికము నర్ధపలము లె
క్కనుగూర్చి జలమాఢకంబుబోసి

పరగనావుల నెయ్యి పలములిర్వదిజేర్చి
ఘృతపాకముసవండి ఘృతమువడియ
గాబోసి యదియు నిక్కముగ చట్టినసుంచి
ధాన్యపురాశిలో దాచిదీసి

గీ. ప్రాతకాలచేతిగుండెడు బుచ్చుకొనిన
పాండువుల్ తయు కాసలు పారవెళ్ళు
శ్వాసరోగంబులెల్లను సమసిపోవు
వితతసౌఖ్యంబు దాడిమఘృతవరంబు.

శుద్ధక్రియలు.

గీ. రసము బలితామ్రములును కరకయు గుగ్గి
లంబు మాతురుబుడమ చూర్ణంబు నేతి
గూర్చి చిన్నంబులై దెత్తు నీరుతోటి
దినినశోఫలు పాండువుల్ దెరలిపోవు.

గీ. పాతచిట్టెంబు చింతాకు క్వాథముసను
గాచి పిప్పలిచూర్ణంబు గలియజేసి
ద్రావ శోఫలు కామిలాతతులు పాండు
కాసగదలునుదొలగు నిక్కముగనవని.

గీ. త్రిఫలములు చిత్రమూలము దెలియ నెవలి
చక్క నల్లనికానుగచక్క నల్ల
యుప్పిచక్కలు సమములై యొప్పుపాడికి
తగినలోహంబుతో గ్రోల దరలు యక్ష
పాండువులుమాను నిజముగా ప్రజలకవని.

గీ. త్రికటుక త్రిఫలములు చిత్రిక విళంగ
ములునుచూర్ణించి యన్నిటి తులగలోహ
మిడియు మజ్జిగతో తులమెత్తుగొనిన
పాండు శోఫలు కామిలల్ పారిపోను.

గీ. చిత్రమూలంబు ముస్తాఫలత్రయంబు
కణము నల్లేరు యావిళంగములు సమము
గలపి చూర్ణించి లోహంబుగలపి తేనె
నావుచల్లను నేతితో నైన గ్రోల
పాండువులుమాను నిక్కంబు పరిజలకవని.

పాండువులకగ్నిశిక్షలు.

క. కనుబొమలనడుమ చెవికొణ
కనులక్షు పైద్వితీయపాద కంజంబులపై
ఘన తామ్రశలాకను గా
ల్చిన పాండువులెల్లమాను సిద్ధముదెలియన్.

పథ్యాపథ్యములు

సీ. పాతదిగాచింతపండు గోధుమలును
యవలు జాంగలమాంస మవనిలోన
బర్రెనె య్యావులపాలను కొయదోట
కూరయు ద్రాక్ష ఖర్జూరపండ్లు
పొట్లకాయలు చిరి పొన్నగంటియు పండు
గుమ్మడియును నెల్లికూర లేత
అరటియు నుసిరికాయలు లఘుద్రవ్యముల్
పాండురోగములకు పథ్యకములు
ములక లావాలు బచ్చలికూర నువ్వులు
కల్లు మాంసంబును కందగడ్డ
ఘనమగుద్రవ్యంబులును నతిదాహంబు
చేప లింగువ కొత్తచింతపండు

గీ. యతిరసంబులు తాంబూలమనగ నివి య
పథ్యములటంచు దెల్పిరి ప్రౌఢజనులు
గాన వాటినవిడువగా గలుగుశుభము
గరము రోగులు జీవించుకొరకునవని.

---

## ఇరువదియవపద్ధతి.

(శూలరోగప్రకరణము.)

సీ. కఫశూల పైత్త్యాధికప్రశూలయును వాత
　　శూలయు కఫపైత్త్యశూల వాత
పైత్త్యశూల శ్లేష్మవాతశూల త్రిదోష
　　శూ లామశూల హృత్ శూల నాభి
శూల యజీర్ణప్రశూల శర్కరశూల
　　పరిణామశూలయు పంక్తిశూల
పార్శ్వశూలయు గుల్మ బరిశూలలును మెహ
　　శూలయనంగ నాభీలముగను

గీ. పదియు నెన్మిది నరుల కాపదలొనర్చు
నరయ సాధ్యంబు కష్టసాధ్యం బసాధ్య
మార్గములు చూడ కరతలామలక మగుచు
విద్వదాహ్లాదకరముగా విస్తరింతు.

గీ. ఏచబుట్టిన వాతజమైనశూలి
పిత్తసంబంధమైన నాభినిజనించు
కఫముసంయుక్తమైన పక్కలునరొమ్ము
లందుబుట్టును చూడ నిస్సంశయముగ

గీ. వాతజంబైనకుదురును వాతపైత్త్య
మైన నరులకు కష్టసాధ్యంబు వాత
పైత్త్యశ్లేష్మభవంబైన బ్రతుకనివదు
సన్నిపాతోద్భవంబైన నెన్న నేల.

### కఫశూల.

సీ. అతివాసనాన్న మృష్టాన్నంబు దిన్న నీ
　　తలము బ్రత్త్యహము బలితమైన
మాంసము పిండియు మహిషక్షీరంబులు
　　పక్వహీనము లాష్ణపాయసంబు

బలుగురుత్వపు వస్తువులు మేహదేహికి
జనియించు చైత్ర వైశాఖ కార్తి
కాశ్వీజముల నుదయంబునమిక్కిలి
తలనొప్పి దగ్గు హృత్స్థలమునందు
గీ. శూల తనుదానె వాంతియౌచుండి పిత్త
కటుకములశాంతిబొందు నిక్కంబుగాను
మొదలు కొంచముగాబుట్టు తుదను మిగులు
నరయ కఫశూల కష్టసాధ్యంబుదలప.

పైత్యశూల.

గీ. దాహమును మూర్ఛ వాంతి మధ్యాహ్నమునను
యర్ధరాత్రిని మిగుల నామాతిసార
మూత్రనిర్బంధనముజేయు మోసబుచ్చు
ప్రబలతరమైన శరశీల పైత్యశూల.

వాతవాతపైత్యమేహపైత్యశూలలు.

సీ. అత్యుష్ణవస్తువు లతిగురుత్వపువస్తు
వులుబుచ్చు కున్న నాకలియుగాక
వెంటవెంటనుదిన్న వెనశూలజనియించు
నదియు వాయువచేత నధికమగును
వర్షాగమమునవిభావరిముఖమున
సంధ్యాసమయమున చరమదేహ
మున త్రికంబున వస్తినను పక్కలను రొమ్ము
నను మిక్కుటముగ వేదనలొనర్చు
గీ. కఫము పైత్యంబు మిశ్రసంగతిని దనరు
శూలనమున పొక్కిలిచుట్టు కడుపు
లోపలనుబుట్టు వాయువులోన పైత్య
శూలకను వేకిదాహమాభీలమగును.

శ్లేష్మవాతశూల.

క. గొమ్మని పార్శ్వాంబుల పృ
ష్ఠమ్మున వస్తిని మహోగ్ర సంతతితోడ౯
గ్రమ్మకొను శ్లేష్మవాతభ
వమ్మైనను శూల ప్రజల వదలమిసుమ్మీ.

త్రిదోషశూల.

క. మిశ్రమములగు గుణములచే
దుశ్శ్రయము త్రిదోషశూల దుస్తరముగ మీ
ద శ్రమబెట్టును సర్వాం
గాశ్రయము త్రిదోషశూల యనునామమిల౯.

ఆమహృదయ శూలము.

సీ. కఫశూలవలె గుణకాండము ల్వాంతియు
నాహముబుట్టిన యామశూల
వాతశూలగుణంబు లేతరిగల్గి మూ
ర్ఛా భ్రమ తాపతృష్ణా ప్రలాప
ఆమబంధాజీర్ణ ధామమహా హృచ్ఛూల
ఛర్ది ప్రమేహ శేషాఖిలాంగ

నాభిఅజీర్ణశర్కరాశూలలు.

కంపంబు లెప్పుడు గల్గిన నాభిశూ
లగును నజీర్ణంబు దగిలెనేని
గీ. తన నజీర్ణపుశూల రొమ్మునను రొండ్ల
వీపులను ప్రక్కలను నాభిదాపునందు
నాభినామను శర్కరా నామశూల
మూత్ర కృచ్ఛ్రాశ్రితంబుగా మొదటబుట్టు.

పరిణామ పంక్తిశూల,

సీ. భుక్తంబు జీర్ణంబు పొందునప్పుడుబుట్టు
వాత పిత్త కఫంబువలన కొంచ
మెక్కుల్లగనుపించు నెప్పులైనను పరి
ణామశూలకు భుంజతాన్నమెపుడు
వడిజీర్ణమగుచును వాత పిత్తాశ్రిత
పదము మృత్యువునుమ్మి పక్తిశూల

పార్శ్వశూల బరిశూలలు.

హృత్పార్శ్వభవమైన హేతువు తీపులు
పదఘర్మములొనర్చు పార్శ్వశూల

గీ. కుక్షిపార్శ్వంబు లంఘ్రుల గోళ్ల మంట
మూర్ఛ శోషాన్నవిద్వేషములు నజీర్ణ
శీతలాంగామబద్ధజ్వరాతిదాహ
ములను బరిశూల వేధించు మునులనైన.

గుల్మశూల.

గీ. వాతగుల్మంబుబుట్టిన వానిబట్టి
మూత్రవిడ్బంధనోద్గార మూర్ఛ ఛర్ది
ఘర్మ తృష్ణల చాల సంకటమొనర్చు
గుల్మశూలదురంతోగ్ర గుణవిశాల.

మేహశూల.

క. అతిసార మామలోహిత
వత నాజీర్ణాగ్నిమాంద్య భ్రమ విగ్రహకం
పితములును నేచు జనసం
తతుల ధరఁ మేహశూల దాఁబుట్టినచోఁ

శూలోపద్రవములు

క. దాహము కలఁగుట మూర్ఛా
నాహంబులు దగ్గు శ్వేదనంబు గురుత్వం
బూహింపగాను శీఘ్రత
మాహాశూలలను గెలువ నజునకు దరమే.

## చికిత్సలు.

### శూలాంతకరసము.

సీ. రస గంధకములు తామ్రం బభ్రకపుభస్మ
మణిశిలలును హేమమాక్షికంబు
ఘనసైంధవము పచ్చగవ్వలభస్మంబు
కరమొప్పగా చిత్రకంబు నల్ల
యుమ్మెత్త విత్తులు నొప్పనింగు మరాటి
మొగ్గ లన్నియు తుల్యములుగగూర్చి
పోడిమి తెల్లజిల్లేడ డద్దసర పాము
దపు మూకులరసంబు దనరగాను

గీ. బోసి మర్దించి కుక్కుటపుటము వేసి
చిన్న మెత్తును దేనియు జేర్చిగాని
బోడతరవుకషాయంబు బోసి గ్రోల
నవని శూలలనడచు శూలాంతకంబు.

### శూలగజకేసరి.

సీ. పలమురసము రెండుపలములుబలి మూడు
పలములు తామ్రపు భస్మమమర
జలములనూరి యమ్ముల డోలలో వండి
తీసిగజము...... వేసిదించి
చూర్ణించి యింగువ శొంఠి జీరకలును
యొక్కొక్కభాగము లక్కజముగ

పిట్టి నాల్గవపాలు విరివిగా మరిచముల్
జతజేసిచూర్ణించి హితవుమీర
గీ. కర్షమెత్తుష్ణజలములు గలపిగ్రోల
వాత కఫ పైత్య పరిణామ పంక్తి ముఖ్య
శూలలనడంచు గుల్మపై త్యాళిద్రుంచు
శూలగజకేసరియనంగ సొంపుమీర.

శూలకుఠారము.

క. వెలిగార రస త్రిఫలము
బలి కటుకత్రయము తామ్రభస్మ విషము గ
వ్వలబూది దంతిబీజం
బులు కల్గరియాకురసము బోయుచునూరన్.

క. శూలకుఠారంబన జను
వాలాయము వల్లమెత్తు వైద్యులు వెస మ
ర్త్యాళిని యల్లపురసమున
గ్రోలంగాజేయ శూలకోట్లనడంచున్.

పంచామృతరసము.

సీ. పారదమొకపాలు బలిరెండుపాళ్లును
జలములతోనొక్క జామునూరి
తామ్ర లోహంబులు తగమూడుపాళ్లును
సౌవర్చలవణంబు సరవిమూడు
పాళ్లును జంబీరఫలసార మావుచ
ల్లను మర్దనముచేసి లఘుపురములు
మూడుగావేయుచు తోడనే తాళిస
పత్రి త్రికటుకముల్ పట్టుపొడియొ
గీ. నర్చి పొడిమందునొకటి నొనర్చి మూడు
గురిజలెత్తుగగుళికలు గ్రోలనవని

పంక్తిముఖశూలతతులను బరిహరించు
రాజితయశంబు షణ్ముఖరసవరంబు.

మండూరయోగము.

గీ. త్రిఫల మొక్కటి యావులపాలు పంచి
తంబు త్రిఫలద్వయము మండూరంబు కుడుప
మమరశుంఠియు కుడుపంబు లన్నివాడి
బదరిమాత్రముదిన శూలపటలిమాను.

మండూరగుడము.

మ. మునుమండూరము పాళ్లునెన్మిదిగ గోమూత్రంబుదానెత్తు పా
లును నింకందిగఁగాచిదించి యొకపాలుక్ పంచకోలంబు లెం
చను పాలొక్కటిగాగఁజేర్చుచు యవక్షారంబు చూర్ణించి ప
ట్టిన బెల్లంబున నూరిమాత్రలిడగం జేశూలల న్గూల్చు పా
వన మండూరగుడంబు దీనిపటిమల్వర్ణింపచిత్రం బిలన్.

విజయానలమండూరము.

సీ. కరకచక్కలు చిత్రకము సైంధవంబును
చెలువొంద శుద్ధిజేసిన మణిశిల
మైలతుత్థము హేమమాక్షికంబును యివి
ప్రత్యేకకర్షముల్ గ్రంధి తగర
మును వెలిగారంబు మోడి పద్మకములు
వైక్రాంతభస్మ త్రిఫలములమర
వేర్వేరకర్షక ద్వితయంబులుగ శొంఠి
కొమరొప్ప పిప్పళ్లు కొడిశపాల
చిత్రమూలంబు గోమూత్ర శిలాజతు
తెల్లగజ్జెరు వేళ్లములును
కరమొప్ప పసపును కల్గరవిత్తులు
ప్రస్థప్రమాణముల్ పరగఁజేర్చి

గీ. అన్ని యెత్తును మండూరమందు బెట్టి
కల్గరాకురసంబున కలయనూరి
తేనెతో నిష్కమాత్రంబు దినినశూల
లారు విజయానలాఖ్య మండూరమనుచు.

నారికేళఖండము.

సీ. ఇరువుగా పచ్చికొబ్బరితున్క లెన్మిది
పలములు ప్రస్థంబు పంచదార
నారికేళపుఫల నీరంబు ప్రస్థంబు
నావునే యొన్నగా నైదుపలము
లును నాగరపుచూర్ణమును నొక్కకుడుపంబు
ప్రస్థార్థమును తేనెబాననుంచి
సన్నపుసెగమీద తిన్నగానుడికించి
త్రిఫలముస్థానల త్రికటుకములు
జీరక యులనల్లజీరకత్రయు చతు
ర్జాతకంబులును విఖ్యాతి ధనియ
ములు రెండుకర్షకములునాగ వేర్వేరు
పొడిచేసియందులో బోసిలేహ్యా

గీ. పక్వమునవండి తులమెత్తు ప్రతిదినంబు
గ్రోలిల శూలామ్ల పిత్త హృద్రోగ రక్త
పైత్యములుమాను గుర్రముపగిదిబలియు
కరముయిది నారికేళాఖ్యఖండమనగ.

వర్షాభూఘృతము.

సీ. కరమొప్ప తెల్లనిగలిజేరు వేరులు
పలములుపదియారు వలచినట్టి
వెల్లుల్లిపాయలు వివరింప పదియారు
పలములు పదియారు జలములం

పడవేసి నాల్గవపాలు నిల్వగాచి
యందులోపల ప్రస్థమావునెయ్యి
ప్రస్థంబుగా మేకపాలను గల్పి పి
ప్పల్లి సోమము మోడి తెల్లతెగడ
పంచలవణములు పసగ చిత్రక దేవ
దారులు చిరుబొద్ది దంతి నెల్లి
చెక్కలు చవ్యము జీరకద్వయంబును
కరకకాయలు విడంగములు కొడిశ
చెక్క సజ్జక్షార మక్కజంబు సముద్ర
ఫేనంబులును వేరువేరుగాను
కర్షంబులుగ, నర్కకర్షమింగువయును
పొడిజేసి యందులోబోసి వండి

గీ. రేగుబండంతమాత్రలు రేపుమాపు
గ్రోల శూలలు మందాగ్ని గుల్మములును
ప్లీహ ఉదరములును మాను పెంపుదెచ్చు
హితవుగావించు వర్షాభూఘృతమనంగ

పంచాగ్నిఘటుకములు.

సీ. ఇంపొప్పగా చాగదుంప పల్లేరుచు
పుల్లబచ్చలి కంద పౌసగచిత్ర
కంబును కాన్గచక్కలు పంచలవణ స
జ్జాక్షారములు యవక్షార మింగు
వసయు త్రికటుకముల్ వామంబు నల్లని
జీరక యావాలు జీరకర్రి
తెల్లనిగజ్జేరు వెల్లుల్లిపాయలు
జేర్చితుల్యంబులు జెముడుబాల

గీ. నూరియుల కందపొట్టులో నూలుకొలపి
పేడఖాదువుక పుటమిడి బెలుచనూరి

బదరిమాత్రము చల్లలో పాలు నెయ్యి
తోడనైనను సేవింప తొలగు శూల
లవని పంచాగ్నివటుకము లనుచు నెన్న.

కుబేరాక్షీవటుకలు.

ఉ. చాలగ గచ్చపప్పులును సైంధవ మింగువ చిత్రమూల మూ
వాలును మోడి చవ్యములు వామను వెల్లులి కర్కచక్కలున్
గ్రాలెడు పేర్మితో త్రికటుకంబులు తెల్లనిగజ్జెరుల్ సరుల్
బోలగ నాముదంబిడివి పూనికమర్దన సేయగానిలన్.

క. భావింప నివి కుబేరా
క్షీవటుకము లనగ జగతి కేవలభక్తిన్
సేవించువారికిని నా
నావిధ శూలప్రతతులు నశియించునొగిన్.

కింశుకాదిచూర్ణము.

మ. చెలువౌ మోదుగుచెక్క తెల్లనగు గజ్జేర్వేళ్లు వెల్లులిపా
యలు శొంఠింగువ చిత్రమూలమును సొంపౌ సైంధవంబున్నదా
వులు చూర్ణించి జలంబుతో గొనగ బాపున్ శూలల న్మేటినీ
స్థలి పాలాశసమాఖ్య చూర్ణమన మెచ్చన్ వైద్యరాజోత్తమా

శంఖచూర్ణము.

క. దరభస్మ పంచలవణము
లిరువగు కటుకత్రయంబు నింగువ చూర్ణిం
చిరహిన్ వేన్నీళ్లనుగొన
హరియించును శంఖచూర్ణమై శూలతతిన్.

కుబేరాక్షిచూర్ణము.

గీ. గచ్చపప్పింగువయును నాగరము వెల్లి
పాయలును సైంధవము చూర్ణపరచి యుష్ణ

జలములను గ్రోలగా శూలశతములణఁగు
వర కుబేరాక్షిచూర్ణమై వసుధలోన.

శతపుష్పిచూర్ణము.

సీ. శతపుష్పదారువులు పిప్పలిదారువులు
కొమరొప్పచంగల్వకోష్ఠు దేవ
దారు రాష్నలు వస జీరక పిప్పలు
లొద్దుడి వామము చిత్రమూలములును
నెలువొప్పనల్లనిజీరక త్రయము ధని
యూ లింగువయు విళంగాలు మంచి
సైంధవలవణంబు సమములుచూర్ణించి
పూటకుకర్షంబు పొలుపుమీర

గీ. పట్టి యుష్ణోదకంబుల ప్రజలుగ్రోల
నామ మారుత కఫ పరిణామ పంక్తి
పిత్తశూలలనడగించు పృథ్విలోన
సొంపుదీపింప శతపుష్పిచూర్ణమనగ.

త్రిఫలాదిచూర్ణము.

గీ. త్రిఫలములు వేపచక్కలు త్రికటుకములు
మధుకమును రేలచక్క సమములుపొడిగ
నలచి తేనియతో నరతులముగొనిన
శూలలహరించు త్రిఫలాది చూర్ణమనగ.

సాముద్రచూర్ణము.

సీ. సాముద్రలవణంబు సౌవర్చలవణంబు
సైంధవంబును యవాక్షారములును
దనర సజ్జాక్షారమును చిత్రమూలంబు
కణమింగువయు విళంగములు చెలియ
నల్లము నివిసమూనాంశలుగావించి
చూర్ణించి శోధించి సుస్థిరముగ

త్రాసంబుగా రెండుతులములపావెత్తు
ముందుగా నన్నుపుముద్దనెయ్యి
గీ. గూర్చికొన నోదరాజీర్ణ గుల్మమూల
దుగ్రహణి కష్ట వాయు మహోగ్రపాండు
చయ భగంధరశూల లర్శస్సులడగు
శుభయుతంబగు సాముద్రచూర్ణమునను.

తావత్కాలశాంతికషాయములు.

గీ. చిత్రమూలంబు తెల్లగల్జేరువేళ్లు
శొంఠి కానుగచక్క హెచ్చుగసమములు
జలములందిడిగాచు కషాయమిడగ
నిలను కఫ పైత్య వాతశూలలహరించు.

క. ఉలవలకషాయమున జొ
బ్బిల నాముదముంచి త్రావ పృథ్వీస్థలిలో
పల బాధా కరవాతం
బుల శూలలుమానుటరుదె బుధులునుతింపన్.

క. వరిపేలాలును సైంధవ
మిరువుగ కటుకత్రయంబు లింగువతో సు
స్థిరమగు కషాయ మాముద
మరుదుగనిడ శూలశతములడగుట యరుదే.

నిర్గుండ్యాదికషాయము.

సీ. పరివిగా వావిలివే ళ్లాముదముచెట్టు
వేళ్లును యులిమిరివేళ్లు తెల్ల
గల్జేరువే ళ్లెర్రగల్జేరువేళ్లును
పల్లేరువేళ్లును పంచకోల
ము కరకచక్కలు ములగచక్కలు నుల
వలు తెల్లతెగడ యింపలర దంతి

చెక్కలు క్వాథంబుజేసి యింగువయు త్రి
క్షారంబులును ముదమార పంచ

క. లవణము తుల్యభాగముల్ దలపఙ్మార్గ
పరచివేసి కషాయంబు నరులు గ్రోల
సర్వశూలలు వెంటనే సమయుటరుదె
సరవి నిర్గుండికాది కషాయమునను.

క. ఇల తెల్లవావిజవుచ
క్కలు నాగరకణములుంచి గాచుకషాయం
బును యింగు యవక్షారం
బులు కల్పుక గ్రోల మానిపోవునుశూలల్.

శుద్ధక్రియ.

సీ. పసపును జిల్లేడుపాలతడిపి బొమ్మ
జెముడుబద్దలుగోసి క్రమతనొక్క
భాండంబులోపల బద్దలకలరగా
నగు పస పుప్పాలు తగనుబోసి
చిత్రమూలంబును జేర్చి మూతుడు వేసి
చీలమన్ను బిగించి చెలువు మెరయ
పిడకలో పుటములో బడవేసి సాంగశీ
తలమైనమీదను దానిదీసి

గీ. నిలచుమసియుప్పు కొంచెడు జలములందు
గ్రోలిపథ్యంబు తియ్యనిమార లన్న
మావుచల్లయు దినిసంత నడచుశూల
లనియె ధన్వంతరికి శివుండాదరమున.

నశ్యములు.

గీ. సైంధవంబును పిప్పళ్ళు సరిగనూరి
యాద్దుపాకులరసమున నమరబీల్వ

నొకటి యగి శాకరసము నొకటి సశ్య
ములు నటంచును శాస్త్రముల్ దెలిపెనవని.

సీ. తెల్లగన్నేరు మిర్యాలు తిలలు నూనె
వావిలాకును సైంధవ వచములమర
చూర్ణమొనరించి నస్యంబు సుజనులొసగ.
శోఫలును మానునను చును శూలిబలికె.

ధూపము.

గీ. పసపు నావాలు యాముదపప్పు మండ
పసపు వెల్లుల్లి యలమాను పసపు నరులు
పొడియుగావించి ధూపంబు పొసగనిడగ
పటుతరంబైన శోఫలు బారవెళ్ళు.

పథ్యాపథ్యములు.

సీ. ఉలవలు ములక కాయలు పొట్లకాయలు
గన్నేరు లేతవంకాయ పండు
గుమ్మడియు సదాపకూర జీరక గవి
తక్ర మింగువ బోడతరము జింక
మాంసంబు పథ్యముల్ మహి కొర్రమొదలైన
శికిపిధాన్యంబులు దెలియపిండి
వంటలు చాపలవంటకంబును మాంస
ములు సొరకాయ లింపలర పెరుగు

గీ. ఇల గురుద్రవ్యములు బిల్వఫలములివి య
పథ్యములుగాన శోఫలేర్పడిన జనుల
కనుచు దెలియగవలె వైద్యఘనులు రోగి
తతుల కారోగ్యముచుగోర దలచిరేని.

## ఇరువదియొకటవపద్ధతి.

### (కుష్ఠరోగప్రకరణము.)

కుష్ఠులు జనించు కారణములు.

మ. గృహములఁ గాల్చి నైజకులకాంత్రి హరింపఁగఁ జేసి కేంపుటౌ
బహుళతరనిందఁ జేసి పరభామలఁ గూడి గణించు కల్మషం
బహుమున కుష్ఠవ్రాల్ పదియు నెన్మిదియై నరులందుపొంచి దు
ర్వహమగు బాధ నెట్టును నిజంబుగ శాంతులు సేయు మేలగున్.

సీ. గజచర్మకుష్ఠువు గళకుష్ఠువును పుండ
రీకకుష్ఠువు ఘన కాకకుష్ఠ
స్ఫోటకకుష్ఠువు సుప్తకుష్ఠువు దద్రు
కుష్ఠువు జిహ్వాకకుష్ఠ చర్మ
దళకుష్ఠ వర్ధిక మండలకుష్ఠువును చిత్ర
కుష్ఠు వౌదుంబరకుష్ఠ కటిభ
కుష్ఠు విచర్చికకుష్ఠువు పామాఖ్య
కుష్ఠు వైపాదికకుష్ఠువులును

గీ. దారుణకపాలకుష్ఠు శిధ్మాకుష్ఠు
వులు పదియు నెన్మిదియు మానవులను పూర్వ
జన్మకల్మషమున బూని చాలబాధ
పెట్టు వేర్వేర వివరింతు గట్టిగాను.

గజచర్మకుష్ఠువు.

క. కరిచర్మము దల మేనును
దొరకొని చమ్మటలులేక దుస్తర కండూ
పరివృతమై కుదరదు యే
కరణిన్ గజచర్మకుష్ఠు ఘనవైద్యులచేన్.

గళకుష్ఠువు.

క. ముక్కున నూపిరి వెళ్లక
తక్కువయగు స్వరము పాదతలమంగుళముల్

చక్కగనుండక శ్వయథువు
వెక్కగు గళకుష్ఠమాన్న పెద్దలతరమే.

పుండరీకకుష్ఠావు.

క. తెలియ తెలికల్వారేకుల
వలెబుట్టియు నించుకెరుపువన్నియ జెమటల్
గలిగినను పుండరీకపు
దళకుష్ఠువు లోకమున కుపరదెవ్వరికిన్.

కాకకుష్ఠావు.

ఆ. కాకిగళమువలెను కాయంబుననుకాంతి
గలిగి తీపులుండి వెలికికాక
వాత పైత్య మేహ మేతరిగల్గిన
కాకకుష్ఠువండ్రు కష్టమవని.

స్ఫోటకకుష్ఠావు.

క. చొక్కపు మనూచకమువలె
పొక్కులు పాండురసునెరుపుపారి నసిమిరియున్
మిక్కిలి వేదన మంటలు
నిక్కపు విస్ఫోటకుష్ఠు నెద్దానికిలన్.

సుప్తకుష్ఠావు.

క. గాలియిసుమంతసోకిన
వాలెము మైమంటలొాదవి వన్నెతెరుగు నా
భీలమగు సుప్తకుష్ఠువు
నాలిజెడంజేయుధరణి నరులకుబాడమన్.

దద్రుకుష్ఠావు.

ఆ. ఎరుపుమచ్చలైన బరికింపనల్లన
మైనపొడలు దట్టమగుచుబుట్టి

నిద్రమాన జేయు దద్రురుకుష్ఠ కం
డూతిచేత జనుల భూతలమున.

జిహ్వాకకుష్ఠవు.

క. ములుదోచి రక్తమును లో
పల నలువును నొప్పి కుతుకబట్టినకఫముం
బలువౌను భ్రష్ట జిహ్వకు
గలవొకనామంబు జిహ్వకాకుష్ఠవనన్.

చర్మదళకుష్ఠవు.

క. చిటిచిటిమంటలు పొక్కులు
పటుతర కండూతి యెఱ్ఱబడిదేహము యే
గతినైన కుదురదిది జన
తతికినిబుట్టినను చర్మదళకుష్ఠవిలన్.

మండలికుష్ఠవు.

క. పాండు శ్యామలతరకా
దండాస్యజనీర సంయుతంబునుభయకృ
త్కండూతి సాంద్రతరమగా
మండల కుష్ఠవనదీని మానృగవచ్చున్.

చిత్రకుష్ఠవు.

ఉ. తనువున హస్తమూలముల దాహముకండువు వాపు చెమ్మటల్
జననముజెంది మాంసమును చర్మము మేదము నిండిసాంగ భే
దనమొనరించి నీరు నిరతంబునుగారుచు నిల్వనీచు వా
సనలను బాధపెట్టి మరిచంపును చిత్రపుకుష్ఠ మర్త్యులన్.

ఉదుంబరకుష్ఠవు.

క. చితచితలాడుచునేలన్
పతనంబగు మేడిపండు పగిదినిబుట్టున్

సతతమైన మంటనసనా
ఘతతుల్యన నోర్వక యుదుంబరకుష్టన్.

కటిభకుష్ఠవు.

క. వాత శ్లేష్మంబులు సం
జాతంబై యెందుదగుల చర్మమగుణమా.
చేతులు కాళ్లను బలు కం
పాతియగున్ కటిభకుష్ఠు దోచినయెడలన్.

విచర్చికాకుష్ఠవు.

క. పిత్తంబై శితరక్తా
యత్తంబై వదచమొప్పి యతి బాధాకం
డూత్కటము దాహమును దుగి
భ్రాంతంబగు నిది విచర్చికాకుష్ఠవర్న.

పామాకుష్ఠవు.

క. పామాకుష్ఠువునకునుస
దామేచన్ నిసిమిరియును దారుణబాధల్
చీములు మంటలు గజ్జిస
గా మానవులందు వాడికకు బొల్పడియెన్.

వైపాదికకుష్ఠవు.

క. ఖేదప్రద రుగ్దారుణ
పాదకరప్రజితకాంతి పటలి శ్లేష్మా
పాదిత పిత్తోద్భవ వై
పాదికకుష్ఠువన మాన్పబడువైద్యులచేన్.

కపాలకుష్ఠవు.

క. నలుపును మెరుపును తలపై
గలసి మహావేదనమును కండూతియు నీ

కొలుపును గోమములనాడును
బలుసైన కపాలకుష్ఠు బాయుదె వనీకిన్.

దిధ్మాకుష్ఠము.

క. తనువుస జాడవిచిరచెగో
కీన తెల్లని పొట్టుగాలు కేవలమానె
ల్లును యెరుపువాతికఫమును
జననము సిద్ధాపుకుష్ఠు సాధ్యంబవనిన్.

ప్రథమమున చేయదగిన పంచకర్మలు.

చ. కనుగొన పంచకర్మలనగా గలవిద్ధర కుష్ఠురోగ భా
వనులకు పక్షపక్షమున వాంతికిడన్ నెలకొక్కనారి రే
చనమునకిచ్చి యేడుదివసంబులకొక్కట నస్యమామడం
బున తనువంతబూసి సెగపొంతనగాచుట మధ్యమధ్య మం
దున నెలలారిటన్ శిరముతోడ్కొడ శోధనసేయమేలగున్,

గజచర్మకుష్ఠువునకు కుష్ఠుదహనాసవము.

సీ. పరిశుద్ధరస మొక్కపలమెడు జలినాల్గు
మాడలమెత్తు తామ్ర పుభస్మ
నాల్గుమాడలమెత్తు నాభిపలంబు నీ
రములనూరియు గంధకమును తిరుగ
నన్నిటిమెత్తుగా నమరించి యినుపని
స్వనుచేర్చి యందావు నెయ్యిబోసి
వండిదించినమందు మెండుగానరటికా
కులజుట్టి పెటమైగలయబూసి
గీ. లఘుపుటంబిడితీసి చల్లబడ కాల
గంధతైలము తేనియగలపిసార్థ
వత్సరము మాసమాత్రము వటుకములను
గ్రోల గజచర్మనామక కుష్ఠువడగు.

గళకుష్ఠవు.

వ. ముందుజెప్పబడిన సమూహాయౌషధములలో ననుకూలమైన దాని బుచ్చుకొనవలయును.

పుండరీకకుష్ఠనకు కుష్ఠదమనరసము.

సీ. ఘనరసమొకపాలు గంధకమును రెండు
పాళ్లు విష్ణుక్రాంత పరగ దేవ
దారు సర్పాక్షి యింపారచెల్మడియాకు
నగిశ మోదుగచెక్క యమర మూండు
క బ్రహ్మరసముల గనగ నొక్కొకరోజు
వేర్వేర మర్దించి వెనుక నినుప
పాత్రలోన క్షణమాత్రంబుగావండి
రసమునసాటి గాథ్రికము నాభి
కరమొప్ప నారతికర్పూరమును వేరు
వేరుగా నందులో వేసినూరి
గుళికమాత్రలుగాగున తెల్లవావ్లపు
చెక్క కషాయంబు జేర్చి సార్థ
వత్సరంబును గ్రోలువారికి పుండరీ
క దళకుష్ఠవు శాంతిగాంచు కుష్ఠ
దమనరసంబిడి తామ్రభస్మము తెల్ల
కాచు జిల్లేడుపాల్ గలయనూరి
గీ. తెల్లబడుచోటబూయుట తెలియనొకటి
మేకకురు లాముదపుకాయమీదిపొట్టు
నోపి వేయించికాచుటనొకటి శుద్ధ
సత్క్రియలటంచుదెల్పిరి శాస్త్రవిదులు.

కాకకుష్ఠవునకు కుష్ఠకులధ్వంసి.

సీ. రసముసలంబు తామ్రముమూడుపలములు
బలి రెండుగాను త్రిఫలములొక్క

ఫలము త్రికటుకముల్ ఫలమన్ని వావిలి
యాకు చిత్రకమున నల్లమును
గలసారెముల దినంబులుమూడుమర్దించి
యినుప స్నను బెట్టి యెలమివాయ
మూసినైనను చిలజేసియు వరిపొట్టు
పుటముననొకరోజు పొసగనుంచి
పిదప మొప్పగా కాలగంజవిత్తులు నీట
దినములుమూడు మర్దనము జేసి
సార్ద్రమును గ్రోల శాంతియగా కాకాక్షి
: కుష్ఠుకులధ్వంసి గుళికలివియె

గీ. దనర గానుగవిత్తుల తైలమందు
చిత్రకము సైంధవమునూరి జేర్చియాము
దంపువిత్తుల తైలంబు గలపి తాల్చి
యదియుబూసిన శాంతియగు సాంద్రజనులు.

స్ఫోటకకుష్ఠమున కీశ్వరరసము.

సీ. పదిరెండుపాళ్లుగా పారదంబొనగూర్చి
పటుగంధకము నాల్గుపాళ్లు జేర్చి
జలములనూరి కాచపుకుప్పెలోగాని
మట్టిచిప్పనుగాని మంచు జేర్చి
వాలుకంబున బెట్టి వండిభస్మము పావు
శేరు టంకణమును శేరు మూడు
పావులు తామ్రంబు బలి శొంఠి చంగలి
కోష్ఠువు పిప్పళ్లుగూడ నన్ని
వెలిగారమెత్తుగా గలపిచూర్ణము జేసి
మాదిఫలరసంబు మందులోన

గీ. గలపి మైనను నేతిలోగాని మెదచి
సార్వవత్సరకాల మౌషధము నమ్మి

గోర్ల విస్ఫోటనామకకుష్ఠు వడగు
నీశ్వరగసంబు యనుదీని నెన్నవశమె.

సుప్తకుష్ఠువు.

వ. దీనికి ముందు చెప్పబోవు సముూహశ్యాపథములలో మైనదియిచ్చుచునేది. భృంగరాజచూర్ణము నైన వచ్చును.

దద్రుకుష్టువునకు కురంగపాణిరసము.

సీ. పారద మునిరకపప్పు వేపలబంక
సరిపాళ్లుగాజేసి చంద్రచెక్క
లకషాయమునసూరి ప్రకటింప నొక్కవ
రాయెత్తుగ్రోల కురంగపాణి
రసము దద్రురుదిన నసియించు మొక్కపు
చెక్క నెమలియడ్గుచెక్కబూడి
గంధక వెస వెలిగారముల్ శొంఠి స
ద్యక్షార పిప్పళుల్ తామ్రభస్మ

గీ. సరులు మొక్కపుచెక్క రసమునసూరి
మేనబూసిన నిజముగా మానుదద్రు
కుష్టువునకిదియొనత్క్రియ కుతలమందు
చెలువుమీరగ భేషజుల్ దెలియవలయు.

జిహ్వాకకుష్ఠుకు కుష్టురోగభంజని.

సీ. గంధక సూత నాగరములు నాభి ని
క్కము సమంబులు కాలగంజవిత్తు
లరసంబు వేప ఫలత్రయంబున చిత్ర
కము తిప్పతీగె కళ్గరలనొప్ప
పీటిరసంబుల వేర్వేరమర్దించి
జనకాలగంజ కషాయమునను

మెలఁకువతోఁ దగనూఁది యినుపగంటెన వండి
మఱి మూఁడుమాళ్లెత్తుమాత్ర గురిజ
గీ. జీడివిత్తులతైలంబు జేర్చి కాల
గంజపొడిమాడయెత్తుగా గలపి పదియు
నాళ్లు నెలలిడి పైఁబూయ తొలఁగు జిహ్వా
కాఖ్య కుష్ఠువిభంజని యనెడురసము.

చర్మదళకుష్ఠునకు కుష్ఠగదాప్రహారిణి.

సీ. రస గంధకంబులు వసనాభి మాక్షిక
ద్వయము శిలాజిత్తు తామ్ర మినుము
భస్మము లోహపుభస్మంబు సమములు
నూర కాకరగడ్డ లమరదారు
కామంచియాకుల ఘనరసంబులనూఁది
యెండించి మూఁకుళ్లనిడియు శీల
బిగియించిమూఁడుగా తగునట్లు పుటములు
వరియాకలోనుంచి పరగఁబెట్టి
కరమొప్పఁగా కాలగంజవిత్తులతైల
మును గట్టిగాను మర్దనము జేసి
మాడలు రెండెత్తుమాత్ర తెల్లనితుమ్మ
చెక్కచూర్ణంబును చలగి కాల
గీ. గంజవిత్తులపొడియును గవిఘృతంబు
గలపి యనుపానముల గ్రోలగాను చర్మ
దళనకుష్ఠోపశాంతి సిక్కముగగలుగు
దనరనిది సర్వకుష్ఠుగదాప్రహారిణి.

మండలికుష్ఠువునకు యోగరాజరసము.

సీ. పాలురసము రెండుపాళ్లుగంధకము నీ
టనునూరి యిన్పగిన్నెను క్షణంబు

వండి మందుసకొప్ప పదియెత్తులుగ నాభి
గలియవేయుచు కాలగంజములైల
మున దినత్రయము మర్ధనజేసి మహిసాక్షి
త్రిఫలముల్ శోధించి దెలియ గంధ
కము సరిబడవేసి కరమొప్పవీటెత్తు
నాముదమిడి కలియంగనూరి

గీ. రెండుగుంజలసరిగాగ రేపుమాపు
గ్రోల మండలికాహ్వాయ సప్తమడగు
మారుతావర్త రోగ పామలనడంచు
చారుతరమైన యోగరాజరసమవని.

చిత్రకుష్టువునకు దర్పకారిరసము

సీ. పలమురసంబును బలిరెండు పలములు
వేపమల్లియలాకు లేపుమీర
కాలగంజాకులగల్గు రసంబులు
గోమూత్రమునను నిక్కువముగాను
నొక్కొక్క దానితో నొక్కొక్క రోజు మ
ర్దించి ముస్తల పొడియుంచి భూధ
రపుటంబు నిడుకతోరపుమందు నెత్తుప
దెత్తులుగా దూచి యెలమికాల
గంజవిత్తులపొడి గలపిపంచితమున
మరలనూరక రెండు మాడలెత్తు
గావటుకము మేడికాయగసంబున
సార్ధ వత్సరముభక్షణముసేయ

గీ. సమరగానిది ధరదర్పకారి రసము
నిమ్మపులుసున చిత్రమూలమ్ము త్రాట
మృదుసురాకారమును నూరిమేనబూయ
చిత్రకుష్టువుమాను ప్రసిద్ధముగను.

ఉపదంశ కుష్ఠవ్రణ కష్టోపశాంతి రసము

సీ. ఫలముతామ్రము నాల్గుఫలములు రసముత్త్రి
కటు భస్మ మొక్కటిగాను జలము
లను మెత్తగానూరి యినుపగిన్నెలు యూరు
ఫలములు గంధకమలవకుండ
సన్నగా తెగనూరి సగముయగ్నిసదుంచి
పైననుండిడిసిచాని పైకలెక్కి
నట్టి పొడిడితేత యగ్నిపై నుడికించి
గుగ్గిలంబును వేపకుసుమములును
కానూకుత్రాట చొక్కముగు వేపులచక్క
త్రిఫలములతివస తిప్పతీగె
చేమపాల్లయుచంద్ర చెక్కకేలది త్రాట
సరిపాళ్ళచూర్ణించి సరిపిమనుము.

గీ. గలపిమాత్రతో తేనియగలపి గ్రోల
జనులకునుదుంబరపుకుష్ఠ శాంతియగును
సర్వకుష్ఠులకిచ్చిన సమయజూచు
నతులకుష్ఠకులాంతకంబను రసంబు.

కటిభకుష్ఠవ్రణకు వజ్రపాణిరసము

సీ. రసమును తామ్రమభ్రక భస్మములునాభి
సరులుగాకాలగంజలనుదీయు
తైలంబుతోడ మర్దనజేసి యొకర్షుభాము
యినుపగిన్నెయలోన నిడియు గంధ
కమురసంబునకు నిక్కముగ రెండుమాత్రలు
కలిపి గంధము శీర్ణకంబుగాగ
పచియించిమందులో పరిపాటిగాదూచి
కాంతపుభస్మము గలపి వేప
పంచాంగచూర్ణము బడవేసి తగినట్టు
మాత్రలుమా డెత్తమర్చిర క్తి

భక్షింపగా వజ్రపాణిరసంబున
నవనిలోపలను ప్రఖ్యాతిగాంచు

గీ. పసపుచిత్రికశోంఠి పిప్పళులుపెద్ద
మానుచక్క సమాంశలు గానుపంచ
రసముదెగనూరి బదియు నెనిమిదినెలలు
గ్రోలకటి భాఖ్యకుష్టువు గుణముగలుగు

విచచ౯కుష్టకు కుష్ఠనికుంతనరసము.

సీ. రసగంధకంబులు వసనాభి హేమమా
క్షికతామ్రములు శిలాజిత్తులోహ
మునయిన్పభస్మంబులును సరుల్కాసర
గడ్లలాగాకర గడ్డదేవ
దారులరసముల వేరువేరొకొక్క
దినముచొప్పున నూరితీసి వల్లి
వ్రాకలోపలభూధరైకపురంబిడి
మాత్రలు మాడెత్తు మరగజేసి
కరకచక్కలుగాల గంజవిత్తులుజీర
కయు జీడివిత్తులు ఘనవిళంగ
ములురేగువేళ్లను తులలుచూర్ణించి బె
ల్లముగల్పిద్రాక్ష పిష్టముగజేసి

గీ. తగినమాత్రంబుగాను తొల్తటిగుళికెను
కలిపిగ్రోల విచర్చిక తొలగుసర్వ
కుష్టువులగూల్చు కుష్టనికుంతనాఖ్య
రసమువర్ణింపదరమానె రసికులకును.

పామాకుష్ఠక్రియ,

గీ. గంధకంబాకమాడెత్తుకాలగంజ
తైలమున పార్థకాబ్ధంబు గోలిపాలు

సన్నమును భోజనము సేయ నడఁగునిజము
కుతలమందున పామాఖ్య కుష్ఠు వెలయు.

వైపాదికకుష్ఠఘ్నరస మహోదధిరసము.

సీ. రసము గంధకము తామ్రము కోష్ఠుబంకణ
పిప్పళుల్సమములు బెట్టిమాని
ఫలసారమున మెత్తబడనూరి యొకరోజు
దేలినమందెత్తు త్రిఫలవహ్ని
మునవైచి మర్దించి ముదమునమాకెత్తు
కాలగంజల విత్తనాలరసము
మందుయష్టాదశ మాసముల్ గ్రోలవై
పాదికకుష్ఠవు బాసివేగ
జనుమహోదధిన రసంబన జెన్నొందు
కానుగచిత్రకి కల్గరులును
బోడతరంబును బూరుగచెక్క వా
విలి వేప పంచాంగములును కాల

గీ. గంజవిత్తులు గోరింట క్రిమతసరులు
కూర్చి పొడితేనెలోఁగల్పు కొనియు సార్థ
వత్సరము గ్రోలగాను వైపాదికంబు
మానునిక్కంబటంచు మానులనిరి.

కపాలకుష్ఠకు సోమేశ్వరరసము,

సీ. రసగంధకములు నభ్రిక భస్మసమము వా
విలియాకురసమున గలియనొక్క
దినము మర్దనము నేర్పునజేసి భూపుటం
బున వేసితీసి యుంపునను కాల
గంజబీజంబుల క్వాథంబుననుదాని
సహామూలముంచు కషాయమునను

దినసప్తకముమునిగా౯ వెలియుమాత్రగా
కాసరగ్రైలు కాలగంజ

గీ. పైత్తనంబులు త్రిఫలముల్ వేసినూరు
పొడియుమాత్రను కల్పక పుడమిసార్థ
వత్సరముగోళ్ల హరియింపబడుక పాల
మనెడుకుష్ఠువు సోమేశ్వరాఖ్యరసము.

సిద్ధామకుష్ఠమునకు విరాళిరసము.

సీ. పారదాభ్రకలోహ వంగశిలాజతు
త్రిఫల త్రికటుకముల్ తెలియు చేల
తాడిగడ్డలుమద్రి యూడుగవిత్తులు.
పాసగసమంబులు పొడియొనర్చి
లీలమాత్రత్తు గుళికలారుమాసముల్
గ్రోలగానదియె విరాళిరసము
గంధకరస వెలిగారము లల్లంపు
రసమొకదినము మర్దనముజేసి

గీ. యూరునెలలును మేనవేసారకను వి
లేపనముజేయ సిద్ధామ మేపడంగి
మాను శతకోటి మదన సమానరూప
మొదవు నీయౌషధము లేమహోన్నతములు.

తాళికేశ్వరరసము.

సీ. తాళకసూత సైంధవములు టంకణ
మణిశిలలును హేమమాక్షికంబు
సరులుమర్దించి రసమున కీరెత్తులు
బలిదాని సరితామ్ర భస్మనిమ్మ
పండ్లరసంబున పట్టునూరుచు యూరు
భూధరపుటము లింపునను వేసి

తేర్వాతినోష్ణగా తామ్రభస్మము రెండు
పాళ్లు లోహము నాల్గుపాళ్లుగూర్చి
జంబీర రసమున సమ్మర్దనము జేసి
లఘుపుటంబిడియు చల్లనగుమందు
లోవముష్టదిపాలుగా నాభిసముగూర్చి
బ్రెరసేతనుసూరి పరగకాల

గీ. గంజవిత్తులు పాడినెయ్యి కల్లుగలిపి
గ్రోలగా పుండరీకాది కుష్ఠులడగు
కాంతిజెన్నొందు నూతన కాముడగును
తరమగునె నెన్న తాళకేశ్వరరసంబు

పంచాననరసము.

చ. అలవడ సూతదారదము లభ్రక ముస్తలు తిప్పసత్తు పి
ప్పళులఫలత్రయంబు సరిపాళ్లుగ నన్నిటి కిబ్బడించి జా
జ్బిలగుడముంచి నూరుకను పెంపున రెండగుగుంజలెత్తు మా
త్రలు నొసగంగ పంచముఖ రాజరసంబన గెల్చు కుష్ఠులన్.

హింగుళేశ్వరరసము.

సీ. రసనాభి శొంఠులు వసచిత్రమూలంబు
తిరమగు బ్రహ్మియు త్రిఫలములును
గంధకంబునుగుంట కల్గరవిత్తులు
మైలతుత్థము విళంగాలుజీడి
విత్తులు పిప్పళ్లు వేసిసమము ఫల
త్రయ కషాయంబున దనరనూరి
కంచుగిన్నెయను నొక్కటియైన రేయుంచి
కష్టమాత్రము గోళకములుజేసి

గీ. తేనియను నారుమాసముల్బాని గ్రోల
పదియునెన్మిది కుష్ఠులు బారిపోవు

కాంతియభివృద్ధియై యొప్పు గాత్రముసను
సరసులౌనన హింగుళేశ్వర రసంబు.

చిత్రకాదిగుగ్గులువటుకములు

సీ. చిత్రమూలంబు ఫల్యతయంబునుతుంగ
గడ్డలువాము త్రికటములను
సైంధవంబునుకోష్టు చవ్యంబు చిరుబొద్ది
యేలకుల్వాస విళంగాలు దేవ
దారుకానుగచెక్క తంటెపువిత్తులు
కాలగంజలు యవక్షారములను
పాలమానులచెక్క ప్రత్యేకములుకర్ష
ములు మహీసాక్షి శోభిలగ పిట్టి

గీ. సరిగ నిడియావునెయ్యి తోపరగనూటి
రేగుబండంత సేవించి రేనివేగ
గ్రహణకుష్ఠువరిణాని లార్శస్సులడగు
కుతలమున చిత్రకాది గుగ్గులుయనంగ.

భృంగరాజచూర్ణము.

సీ. కరకచక్కలు గుంటకల్గర చిత్రమూ
లమును సిరక పప్పు లమర తాడి
కాయచక్కలు వసకాల గంజలును పి
పిప్పళ్లునుమాండుక బ్రహ్మిశొంఠి
జిడివిత్తులుశుద్ధి జేసినమైల తు
త్థము కోష్టు పసపుచు దారదంబు
పెన్నేరుగడ్డలు వెంపొంద రసభస్మ
సమములు త్రిఫల కషాయమునను

గీ. నూరి యెండిచూర్ణించి కోరిఘరణ
మెత్తుకాంతపుగిన్నెలో నిడి త్రిఫలక

షాయముననారు నెలలిర్వసమయు
నుస్త్రకుష్ఠమిడి భృంగరాజాఖ్యగొనిన పడము.

దేవదారుచూర్ణము.

సీ. తగ దేవదారును సిరకచెక్కలుతాడి
కాయచెక్కలుమంచి కరకచెక్క
లలవడకేల వెగ్గల చక్కనేల తం
గేడు సమూలంబు జీడివిత్తు
లలచిత్రమూలంబు లివియన్ని వేర్వేర
పావుసేరులలెక్క పసపుపెద్ది
పావర వేళ్లును ప్రత్యేక మర పావు
లమర నన్నిటియెత్తు క్రమతకాల

గీ. గంజవిత్తులు నన్నిటి గలిపిపొడిగ
జనిపి రసభస్మరెండువీసములయెత్తు
గూరుచుక నావునేతితో నారునెలలు
గోల సురదారుచూర్ణమై కుష్ఠులడచు.

గంధకాదిచూర్ణము.

గీ. బలియు నారగుపాళ్లు త్రిఫల విళంగ
త్రికటకంబులు వేర్వేర ద్వితయభాగ
ములుగ చూర్ణించి తగినట్టు గలయచిత్ర
మూలచూర్ణంబుజేరిచి ముఖ్యముగను.

క. చక్కెరతోగల్పిక పెం
పెక్కగ మానవులుపదియు నెనిమిదిలనెలన్
మెక్కిన కుష్ఠువులెల్లను
చక్కనగుంగంధకాది సద్రజమనగన్.

భానుతైలము.

సీ. జిల్లేడుపాలును జెముడుబాలునునల్ల
యుమ్మెత్తరసమును నిమ్మపులును

గవిమూత్రమును గుంటకల్గరరసమును
పరిత్యేక మిరుబది పలములుగను
గలపినువ్వులనూనె పలములిర్వది జేర్చి
కీర్తింపనాగ కేసరములు
ధాతకీపుష్ప గంధకములు మంజిష్ఠ
పంచలవణములు బరగుపిప్లి
గీ. గడ్డలును మానుపసపు చొక్కంపునాభి
వేరు వేరుపలంబులు చూర జేసి
గలపివండిన తైలము నలదభాను
తైలమునకుసొప్పుకుష్ఠవితానమడచు.

వజ్రక్షీరతైలము.

సీ. బొమ్మజెమ్ముడుపాలు పొనగ జిల్లేడు పా
లుమ్మెత్త యాకురసమ్ము చిత్ర
మూలరసము బ్రెమూత్రంబులివియొక్క
టొక్కటి ప్రస్థములుంచి నూనె
యన్నిటియెత్తిడి యాముదంబొక ప్రస్థ
మునుగూర్చియందు లోనొనరచిరి
మూలంబుగంధక మనుమణిశిలతాళ
కంబునువస విళంగంబునాభి
చిరుబొద్దిమాంసియు చంగలికోష్ఠయు
ష్టిమధూక్షజీరకల్ చేమబీర
విత్తులుపసపును వెలయుసజ్జక్షార
దేవదార్వష్టయు త్రికటుకములు
గీ. మానుపసపునుకర్ష ప్రమాణముగను
పొడియొనర్చుకనందులో బోసివండి
వడిచి తైలంబుగా త్రలేపనము సేయు
కుష్ఠువుల గూల్చువాయు సంకులములడచు
దనరునిదివజ్ర సుక్షీరతైలమనగ

కాలానలతైలము.

వ. పలీరసతాళకంబులును పక్షివణేశిలకాలగంజకి
త్రులగల తైలముంచి సుమతుల్యపడియుంచుచుపత్తైనసా
సిలస్ఫదమే యదీపముగ జేసియు క్రిందను కుండయుంచి త
ప్తాలగత్ర బద్ధతైలమున వాతివృత్తిని మనఁబాయునుగా.

క. కాలానలతైలంబై
వాలాయముకుష్ఠగడల వదలించన్నై
జ్వాలదరిగొల్పు తూలము
గూలినక్రియఁదనరియిల నగుంత్రిలివృత్తిన్.

గోమూత్రతైలము

సీ. భాండములో నావుపంచితంబౌక ద్రోణ
మావులఘ్మృత మొక్కయాఢకంబు
గలబోసియుంచి నఖముచిప్పలును జీడి
విత్తులుపిప్పళ్ళు చిత్రిమూల
మును పంచకోలంబులును వెలిగారంబు
పసపునుయవలు త్రిఫలము నెల్లి
చెక్కవిశంగముల్ బొక్కునకాయలు
కానుగచక్కలు గంధకంబు

గీ. వెలయుమునగలుతంటెపు విత్తులునరి
పొడిమొనర్చి కనిడిపండి వడియబోసి
మేనపూచిన కుష్ఠపుల్మానునిదియె
ధారుణీస్థలి గోమూత్రతైలమనగ.

కపిత్థాదితైలము.

సీ. వెలగచక్కలు చింత వేపచక్కలునుయు
సిరికయూగుగ దిరి సైనము కేల
జీడివెదురు చంద్ర చక్కలు గన్నేరు
రెండుప్పిచక్కలు రెండుతేపను

లిలనేలవేము మొగలి చెంజ్లుజిల్లేడు
వేరులుతక్కెడు గారబొమ్మ
జెమ్ముడువిషముష్టి చెక్కలుచాగదుం
పలునారికేళక పాలములును
సరులుకొంచెము నాభిసమగూర్చికాలగిం
జలునాముదాలు ప్రస్థంబుప్రస్థ
ములువడ్లును కుడుపమును జేర్చిపాతాళ
యంత్రింబునను తైలమమరదీసి

గీ. గలయగాత్రమునను బూయగా భగంద
రములుగజచర్మముఖ కుష్ఠసముదయాలు
శ్లీపదముదురించు నిదియెప్రసిద్ధముప్ర
తాప కలిత కపిత్థాది తైలమనగ.

తిక్తఘృతము.

సీ. వేపచెక్కలు నేలవేముముస్థలునుపి
ప్పళ్ళుడ్డసరమును ప్రాచితీగె
కటుకరోహిణిపిల్లి గడ్డలు నతివస
త్రిఫలముల్ చిరుబొద్ది తిప్పతీగె
కొడిశచెక్కలు ఛాగ కోష్టుపాపరవేళ్లు
పర్పాటకంబును పసపుపద్మ
కములొట్టివేళ్లు సుగంధిపాలయువస
మనుబాలరేలలు మంచిగంధ
మును చేదుపొట్లయింపు సరటిదుంపలు
ప్రత్యేక మెన్మిదిఫలములుగను
తగుజలంబులనుంచి దనరనష్టావశే
షముదిగగాచి కషాయమొక్క
ప్రస్థమాపులనెయ్యి ప్రస్థంబు యుసిరిక
ఫలసారమున రెండుప్రస్థములుగ

గలెజోసి ఘృతపుపాకముగాగ కుండలో
వండి తేనియ నెయ్యివడియబాసి
గీ. ప్రాద్దునరచేతి గుండెడు పుచ్చుకొనిన
మేనరాచిన వేగమేమాను కుష్ఠు
సముదయంబు జనులకు క్షణములోన
తిక్తఘృతమనునామ సంయుక్తమిది యె

శుద్ధక్రియలు.

గీ. మోడిసద్దస సిందూరములును వాము
కోరిప్రత్యేకపలములు కొలముక్క
చెక్కపలములునాలుగు సేయుపొడిప
దియు నెనిమిదగు నెలలుసాధింపమేలు.

---

## ఇరువది రెండవపద్ధతి.

## సవాహోగ ప్రకరణము

సీ. ఖర్జూరసవాతిల కాలకార్ష్ణహా
పామానఖాత్రివి పాటికములు
వంధ్యాసవాశుక్ల వర్షిణీవిస్ఫోటి
కాచిత్రతాకి శుష్కములుచచ్చు
నామకదద్రురు కామకేతాంతిక
బాకనాభిధానముల్ బొల్పుమీర
త్వగ్రహాత్వాఖ్యాత దనరిందదియునె
స్మదిసవాహోగముల్ మేదినిస్థ
గీ. లంబులో మానవులదుష్కరంబుగాను
బాధసేయును వాటిశేర్పమనిదాన

ములుచికిత్సలు జెప్పెదమువైద్య
రత్నముల చిత్తమానందరసముఁజెంద.

ఖర్జూరసవానిదానము.

క. మేనెండుకాకమంటలు
బూనివిదాహంబుగజ్జి పొక్కులుశోషా
నూనంబగు దాగరఖ
ర్జూనామ సవాకునివియె సుస్థిరగుణముల్.

తిలకాలకాసవానిదానము.

క. నెలయభ్రమనల్లనిమ
చ్చలునసిమిరికడుపునొప్పి చర్దియుమంటల్
తిలకాలకాగుణంబులు
తెలియఁగవలె వైద్యవరులు ధీరత్వమునన్.

బర్బరసవానిదానము.

గీ. కాకజిలగజ్జిజ్వరమును కాంతిహీన
మన్నమిష్టంబులేమిమే నంతపచ్చ
నైనచర్మముతుమ్ముచక్కెనరూపు
గలదిబర్బర రసవయనగానుజెల్లు.

చచ్చుసవానిదానము.

క. మేనజిలగజ్జి సత్వవి
హీనభ్రమలుష్ణమొప్పి యేపున్ బ్రజలన్
దానిఁగనవలె వైద్యులు
వైనముచచ్చు సవయనుచు వసుధాస్థలిలో.

టాకీసవానిదానము.

క. నలినాలుక మొరయుటపొ
క్కులుజిలకాకలునుగలిగి కొంకక మన్నం-

బలసంచారగంధము లోదవిన
నిలబాకి ప్రవాయటంచు నెన్నుదురార్యుల్.

విపాటికాసవానిదానము.

క. కాకయు చమ్మటదగ్గను
వాకరకంఠమున జ్వరములు వాయువుజిలనెం
రైకాళ్లు యీనెబాచుట
నాకల్యవిపాటికాఖ్య నవకవిగుణముల్.

త్వగ్వహాసవానిదానము.

క. భ్రమయుంజిల మూర్ఛయుచ
ర్మముకొరుకుడుపాళ్ళలొప్పి మంటలుగలుగన్
క్రమలోత్వగ్వహాత్రీసవ
యమరుం దెలియంగవలయు నార్యులుదెలుచన్.

వంధ్యాసవానిదానము.

గీ. గర్భభంగంబునిస్త్రీణ కాంతిహీన
వీర్యనాశనశితరక్త పీతగౌర
వర్ణమగుచు రజోరక్త మున్నదాని
వైద్యులెల్లను వంధ్యాసవాయటంద్రు.

శుక్లపక్షిణిసవానిదానము.

గీ. ప్రతిదినంబును శుక్లంబు బడుచునుండి
మేఢ్రిమున కగ్రమునవశి మిరి
యుగలిగి మేనునల్పునశూలయు హీనబలము
గలిగియీశుక్లపక్షిణి వెలయుభువిని.

నఖార్తిసవానిదానము.

గీ. కాళ్లుచేతుల వేళ్లనుకాళ్లచుట్టు
పుండ్లువాపులచేవ్రాడి పోవుజిలలు

భ్రమయునిరువాయిగట్టును జ్వరముతృష్ణ
గలిగిన నఖార్తిసవ దానిదలచదగదు.

పామాసవానిదానము.

గీ. గజ్జచమ్మటమలబద్ధ కంబుదగ్గు
కనులుదిరుగుటదప్పిక కాకమేను
మంట నసిమిరిమూత్రంబు వెంటవెంట
వచ్చునేనియు పామాసవాగణింప.

బొకణాసవానిదానము.

క. దేహము నసిమిరి వేకియు
దాహముమేఢ్రాగ్రమునను తగ్గనిహాళ్ళుల్
కూహణపు బొకణ చెప్పగ
దాహఃమర్త్యులనునాశి కాదుల ద్రుంచున్.

రేతాంతికసవానిదానము.

గీ. కాళ్ళుచెమ్మటమేనున కాకనడుము
పోట్లుజిలగజ్జగల్గి నపుంసకత్వ
మునకుదెచ్చియు బలహీనమునుమనోవి
కారమొనరించు రేతాంతికా సవాకు.

చిత్రసవానిదానము.

ఆ. పిల్లిమేనువలెను నల్లనిమచ్చలు
కాళ్ళునసిమిరియును కాకమెదడు
చర్మమించుకంత నర్మలిదెగుచిత్ర
నామమగుసవాకు భూమిలోన.

శుష్కసవానిదానము.

క. కరములుపదములు మధ్యము
బరువుగపట్టుకొని పాండుభాతిని చిక్కన్

దోలుగుజలహొక్కు మూత్రము
హరితముగుఁ జెప్పసవకుసహాహె దెలియుఁ.

దష్టమసహా నిదానము.

క. మూత్రంబున రక్తము బడు
గాత్రమునఁ జ్వరముహెక్కు గజ్జయుజలయుఁ
నేత్రంబుల నొప్పులుదు
పాత్రపుదముఁ రసవాకుబహాఁగతుకిలలో

కామసహా నిదానము.

క. ఆరయ వేశ్యధము తెగిపడి
స్త్రీరూపంబగుచుమేన జిలహొక్కుడిబల్
జేరినపిర్యము వేగమె
జారును కామాఖ్యసహకు జంపును ప్రజలఁ.

విస్ఫోటకసహా నిదానము.

క. మోసినమిక్కిలి నసిమిరి
మూసనిగజ్జియునుకాళ్లు మంటలునుకళా
హీనంబు పైత్యమునుకన
గానగువిస్ఫోటకంబు గణుతింపబుధుల్.

## సహారోగచికిత్సలు

సహాసంజీవనీరసము.

గీ. బలియురసరసకర్పూరములు మృదారు
శింగుజంగాల పచ్చచర్పింపగరస
సింధురంబులుసరి తులసీరసమున
నూరగసహాహాసంజీవి నీరసంబు.

క. గానిరేగు గింజమాడ్కిగ
దిన వెన్నఁగలిపిబూని దీనికిపథ్యం
బునుజప్పిడి జేసినపదు
నెనిమిదియుసహాలుమాను నిదినిజముజవిరా.

శ్రీపర్ణ్యాదిచూర్ణము.

సీ. కొండగుమ్ముడుసేల గుమ్ముడుచక్కలు
పల్లేరువేళ్లు పిప్పళ్లకట్టె
కటుకరోహిణిచిత్రకము దుంపరాష్ట్రము
హంసపాదియు నీలియాకులగరు
బుసజాలయాకైన పూవైనయొనగూర్చి
యంచగానన్ని చూర్ణించిచూర్ణ
మెత్తుశర్కరయందు నిడియొక్కకర్షంబు
ప్రొద్దునమాపున పుచ్చుకొనిన

గీ. చంద్రుడుదయింపగా తమిస్రంబువాయు
కరణిదుష్టసవాల నిక్కముగగూల్చు
నమితసౌఖ్యంబు శ్రీపర్ణికాదిచూర్ణ
మనగనుతిగాంచురక్తతి నపహరించు

గ్రంథ్యాదిచూర్ణము.

గీ. మోడిచిత్రక కేసరములుతుకొండ
గుమ్ముడును నల్లబలుసాకుగూడ సరులు
పొడికితులచక్కె రందునొబోసితినస
వాలుమానును గ్రంధ్యాధివరరజంబు.

గాంగేరుపత్రచూర్ణము.

సీ. కరమొప్ప బలుసాకు కటుకరోహిణి యడ్డ
సరపాకు లీనెలీశ్వరి యుతిప్ప
సత్తువావిలియాకు చిత్రమూలముదుంప
రాష్ట్రతక్కోలములు రమణమోడి
పోడపత్రి కొండగుమ్మడు తెల్లవార్జపు
చెక్కలు యీడుగు చెక్కకణము
సరిపాళ్లనూరి వసనముపైరాచిన
పొడిమెత్తుచక్కెర బోసికలపి

సీ. కర్షమాత్రము సుస్నాదకమున గ్రోలి
పదియు నెనిమిదియైన సవాల ద్రుంచు
మహితమైమించు మేహావ్రణముల నడంచు
పటుతరంబైన గాంగేరుపత్త్రరజము.

కృష్ణగాంగేరుపత్త్రచూర్ణము.

ఉ. ఎలనలుగాను నల్లబలునాకును మోదిమరీచకోంకి రా
స్నలు త్రిఫలంబు కేసరము సర్వము వేశ్వర నర్ధభాగముల్
గలియఁగ చూర్ణ జేసి సరిగానిడి చక్కెర కర్షమంత ని
చ్చలుగొన కృష్ణగాంగెరన జానగుచూర సతాలనాబ్బెడుఁ.

మాసల్యాదిచూర్ణము.

క. ఇలనేల తాడిగడ్డలు
పొలుపుగ విటీగార సమము పొడియూపాపఁ
బులకర్షముగొనగ నవా
యిలుమూన్నెలనెమ్మసలాఖ్య నేపుసురజమై.

భృంగరాజాదిచూర్ణము.

సీ. కరమొప్పగుంటకల్గర సమూలంబును
త్రిఫలముల్ రాస్నయు త్రికటుకములు
కొండగుమ్మడునేల గుమ్మడుచెక్కలు
చెలువొందు నూగనుసికచెక్క
లును మంచివసగను గొననిమ్మయింగుడులు
గూరిచి సమములు నూరితీసి
తోరంబుగా పటోద్ధూళనంబును జేసి
వైద్యవతంసులు వన్నెమీర

గీ. చూర్ణమొనరించి చక్కెర చూర్ణమొత్తు
గలపి కర్షంబుగా నుషఃకాలమునను
గ్రోలగ నవాలనన్నిటి గూల్చునిదియ
భృంగరాజాదిచూర్ణాంబు ధృతయశంబు.

హస్తికర్ణికాదిచూర్ణము.

సీ. రాజితంబుగ జలురక్కసిగడ్డను
గంధిపాలయుమోడి గంటుబాజీ
జమ్మిచెక్కలు తిప్పసత్తడ్డసరపు యీ
నెలు పిల్లిగడ్డలు జెలియగుంట
కల్గరిముస్తలు కటుకరోహిణిజీడి
విత్తులుపిప్పళ్లు చిత్రకంబు
కస్తూరిపసపు చొక్కపు భద్రముస్తలు
యేలకుల్ మనుబాల కోలపాల

గి. వేళ్లు సురదారుమూలంబు తెల్లవారి
జంపుచెక్కలు సరిపాడిచేసి కష్ట
ములు జలంబులగోరిల బాపునుసవాల
ననగనిది హస్తికర్ణికాఖ్యారజంబు.

ద్రాక్షాదిచూర్ణము.

సీ. ద్రాక్షాఫలంబులు దానిమ్మవిత్తులు
దాచినియేలకుల్ తాళిసములు
ఖర్జూరములు కటుకత్రయంబును నాగ
కేసరంబును తవాక్షీరిచంద
నంబు కొబ్బరి మధుకంబు కరకకాయ
కరము మంజిష్ఠిద్రేంకణపుపువ్వు
కురువేరు నేలగుమ్ముడు యొట్టివేళ్లను
జాపత్రిముస్తలు జాజికాయ
తిలలు మహామేధ తీటకోకిసవిత్తు
లాయేన్గు పల్లేరు కాయలరయ
జీరకద్వయమును చిటిముట్టివేరులు
కూతురుబుడమ తక్కోలములను
పాలుపొంద లొద్దుగ పువ్వులు ముత్తువ
పులగంబునోమ మెంతులునుగంటు

## చతుర్థాశ్వాసము.

ధారిణిఁ దెల్లగన్నేరు సైంధవములు
వినుగుంటకల్గర విత్తనములు
కరిమొగ్గ ధనియాలు కర్కాటకశృంగి
జీడిపిక్కలును బ్రసిద్ధిగాఁగ
సింధూరమన్నియు జేర్చి సమంబులు
పొడిచేసి శోధించి పొడికిసాటి

గీ. గాను చక్కెరనిడి నెయ్యి గానియావు
పాలనైనను దరణను పానముగను
యనుభవింప సవాలుమేహములు కుష్ఠ
లడఁచు ధాత్ర్యాది చూర్ణమటం బ్రబుధులు.

### శతావరిఘృతము.

సీ. పరవిగా పిల్లిపీసరగడ్డలరసంబు
నాలుగుప్రస్థముల్ నయముమీరఁ
గా బూడిగుమ్మడికాయ రసము రెండు
ప్రస్థముల్ ప్రస్థంబు బర్రె నెయ్యి
బర్రెపాలాధక పరిమాణముగను పై
న్నెరుగడ్డలగల సారమొక్క
కుడుపంబులన్నిటి గూర్చి త్రికటుక చతు
ర్జాతధాన్యములు ద్రాక్షాఫలములు

గీ. ఖర్జురము గొబ్బివిత్తులక్కజపుతాడి
కాయ ప్రత్యేకమరకర్షగా రజంబు
జేసినిడి వండిదినిన సవాసమేహ
హాతము సేయు శతావరి ఘృతమనంగ.

### భల్లాతకీఘృతం.

సీ. వెలయఁగా జీడివిత్తులు తులనీటిలో
పల నాలుగవపాలు నిలువఁగాచి

కలిపెట్టెపైదేలు జలములు యుసిరిక
కాయలరసము నిక్కంబుగాను
ప్రత్యేకములునర్థ ప్రస్థములుగజేర్చి
ప్రస్థంబుఘృతము నేర్పడగనుంచి
కరకప్రయునల్లజీరకప్రయు వాము
పంచకోలంబులు పంచలవణ

గీ. ములును యవక్షారమును విశంగము లింగు
వయును వేశ్వేరుగా పలముపలము
గంటుభారంగియు గజపిప్పళులు దుంప
రాస్నలోహము పదార్థములు వేరు.

గీ. వేరుచూర్ణించి యందులో వేసివండి.
వదలకను గోలగాను సవాలుమేహా
వాయువులుకుష్టు కుష్ఠిలుబాయుటరుదె
యవనిభల్లాతకీ ఘృతంబనగ నొప్పు.

భల్లాతకీరసాయనము.

సీ. జీడిగిత్తులు నైదు శేరులయిటికల
చూరలోపల జేర్చి నీరుజల్లి
కరకరగాఁగాచి కడిగియెండించి తు
న్కలుగాగ తెగగొట్టి నాల్గుప్రస్థ
ముల జలంబులలోన గలిపిప్రస్థమునిల్వ
బడగాచివిత్తులు పారవేసి
నెయ్యిప్రస్థముబోసి నేర్పొప్పగాగాచి
చల్లార్చిపాలు ప్రస్థంబుబోసి
వండిచల్లారగా రెండుప్రస్థంబులు
యుసిరికకాయల రసము జేర్చి
యుడికించి చల్లార్చి వడిశర్కరర్థ ప్ర
స్థంబిడి యుడికించి చల్లపరచి

పంచదారకు నాల్గోభాగంబుతోసరి
కటుకత్రయంబును కరక చెక్క
లును లోహమును గల్పుకొని చూరగావించి
యందుంచి కాచి చల్లారనిచ్చి

గీ. తేనెతగినట్టుగావేసి పూనికాచి
చల్లనగుమీద తులమెత్తు జనులుగ్రోల
గను సవామేహ మారుతగుణము లణగు
దనరు భల్లాతకీరసాయన మనంగ.

అశ్వగంధ బలా లాక్షాది తైలము.

సీ. పెన్నేరుగడ్డలు వెంపొంద ముంతపు
రుగుడు లక్కలను సొంపుగను వేరు
వేరుగా ప్రస్థముల్వేసి ద్రోణమునీట
గలపి నాల్గవపాలు నిలువగాచి
వడబోసి పిడిచిన క్వాథంబునకు మూడు
పాళ్లుగా నూనియ పరగ పెరుగు
పైనీళ్లు నాలుగుపాళ్లుగాగలిపి పె
న్నేరుగడ్డలు దేవదారుచెక్క
శ్రీగంధమును రాస్న చెంగలికోష్టు స
దాపలు లక్క ముంతపురుగుడులు
కటుకరోహిణియు చాగసమూలము పసపు
యష్టిమధుకము మంజిష్ట వట్టి

గీ. వేళ్ళు మను బాలవేళ్లను వేసి సరుల
పొడినిడియు వండి వడియగాబోసి పూయ
యిల సవాలను వేకి శోఫలును మాను
అశ్వగంధ బలా లాక్షకాఖ్యరసము.

చిత్రకాదితైలము.

చ. అలవడ చిత్రమూలమును యడ్డసరంబును పిల్లిగడ్డలున్
కలువలగడ్డ లూడుగనుగల్గినచక్కలు చక్కెరల్ సమాం
శలునిడి గోఘృతంబునను చక్కగవండి ఘృతంబువంచి యా
వలవెస ద్రావ బూయగ సవాల నడంచును చిత్రకాఖ్యచేన్

శుద్ధక్రియలు.

సీ. చిటిగారచ క్కర్ధశేరు మరీచముల్
యేలకులును లవంగాలు జాజి
కాయ పిప్పళ్లునాగర మతిమధురము
మోడివేర్వేరుగా బొసగతులము
లనుగూర్చి చూర్ణించి తగ తులమెత్తు నీ
టను గ్రోల నొక్కటి దనరు, నల్ల
బలుసాకుపొడిశేరు పావుశేరుమరీచ
ములు నొప్పగా చిత్రమూల మర్ధ
శేరు మోడియు పావుశేరు యాలకులు ల
వంగాలు పిప్పళ్లు వాముములను
ధనియాలు ప్రత్యేకతను మూడమాడెత్తు
లుగ చూర్ణమొనరించి తగుజలంబు
గలుపుక భక్షింపగా నొక్కటి, ఫిరంగి
చెక్కవాముము పావుశేరులెక్క
చిటిగారచెక్కర్ధశే రేలకులు జీడి
విత్తనంబులు రెండుతుత్థములును
నాగకేసరములు నల్లజీరక కొత్తి
మేరలు హింగుళ జీరకలును
యివి వేరువేరు మాడెత్తులుగా వేసి
చూరయొనర్చుక నీరములను
గీ. గలిపి గ్రోలగ నొక్కటి వెలయు, కణము
లును సవాసారముసనూరి గొనుటయొకటి

కర్తసస్త్రీయలివియని శూరులనిరి
వారకను మేహాకుష్టసవాలకంప.

పథ్యములు.

చ. చెలువగు చిత్రకారయును జీరకపత్రము నంటికాయ లు
ల్వాలు వెసపొన్నగంటి వరి వంబక మాపులనెయ్యి పాలు చ
ల్లలు దగ శీతముద్గరము లాజలు కందులు శర్కరాగుడం
బులు కలకండ పథ్యములు భుక్తికిమేలు సవాలవారికిన్.

అపథ్యములు.

సీ. మాహిషఘృత తక్రమాషముల్ పులుసులు
పెరుగు చాపలు నల్లపెసలు యుష్ణ
వస్తువుల్ చేదగువస్తువు ల్వంకాయ
గుమ్మడికాయలు గోధుములును
నూనెయు రతికేళి నువ్వులు తాంబూల
ములు కంద పిండివంటలును యింగు
వయు మంచిగంధలేపనమును కొర్రలు
క్రమమొప్పగా గురుద్రవ్యములును

గీ. ధరణిలోన సవారోగ దాహతులకు
నివియపథ్యంబులని యార్యులెంచి రెలమి
గావున భిషగ్మణులు గనగాను మేలు
వైద్యములు సేయబూను నవసరమున.

---

ఇరువదిమూడవపద్ధతి.

(వహ్నిరోగప్రకరణము.)

సెగ

గీ. అవనిపై వహ్నిరోగత్రయంబు వెలయు
శ్వేతపీతారుణఖ్యాతిజెంది వాటి
కరయగా నిదానమును క్రమ్మరచికిత్స
లే దెనుంగింతుపూర్వ శాస్త్రోదితముల

పచ్చసెగ

చ. బడిబడి మూత్రబిందువులు భగ్గునమండుచు మేఢ్రవక్త్రముల్
వెడలుట లోనినాళమున విప్పగులోహిత వర్ణమంట శే
రుడుకున పాణిపాదములు నొక్కటిగ్రాగుట జట్టుపచ్చగా
దడియుట పొత్తికడుపు సతతంబొగి నొచ్చుట పీతవహ్నియా.

తెల్లసెగ

చ. మురువుగ మేఢ్రవక్త్రమున పుండగుటన్నఖపాళిలోపలన్
నురుకని పాణిపాదములు నొచ్చుటమూత్రపు చుక్క లేపతే
పరుదుగ భగ్గుమంచును బయల్పడుటన్ దెనినీరుబుట్టిలో
నురులుట శూలపోటు కడు పొందుట పాండురవహ్నిరోగమా

ఎఱ్ఱసెగ.

గీ. వేడి మూత్రంబు చురుకుగా వెడలుటయును
వెడలి చివరకు నెత్తురుబడుట క్రింది
కడుపుశూలించి పోటువేగంబ శిశ్న
మందుమారుట యరుణాగ్ని యను రుజంబు.

## చికిత్సలు.

గురుకుక్కాగాడిచూర్ణము.

సీ. అమరంగ బుణజాలయాకును చవ్యంబు
నేలయుసిరిక సమూలము దగ
నలుపగు బలుసాకు నాగకేసరములు
పాళులొక్కొక్కటి పరగచిత్ర
మూలంబయిదుభాగములు గూర్చి పొడిజేసి
పదిభాగములుమంచి పంచదార
మిశ్రమంబొనరించి మెరయనుభయకాల
మున కర్షమాత్రంబు బుచ్చుకొనిన

గీ. కఠినతరవహ్నిరుజలు నిక్కముగమాను
యమితసౌఖ్యంబు చేకురు హాయిమీరు

ప్రబలమైన గుడుచ్యాద్యర్కచూర్ణ
మనుచు నిల్కిరి పథ్యాంతరాదిబుధులు.

వహ్నిరోగాంతకరసము.

సీ. జెముడుపాలొక్కసి నేర్పుమర సూతమును మూడు
జాములు మర్దించి సరగవండి
బలునేలతాడిగడ్డలు చిత్రమూలంబు
పల్లేరు చక్కబౌ పారునేల
గుమ్ముడుమిరియముల్ కొమరొప్ప గల్పి యా
రియు పదును బగ జదరీఘలోన
మానమాత్రమ్మానర్చి మరియిక్షురసముతో
పొద్దుటిపూటను బుచ్చుకొన్న

గీ. చిప్పరోగంబులు మహాసల్పమేఘ
జాలములకు సమీరమై జగతిబరగు
వహ్నిరోగాంతరసమను ప్రతిభగాంచు
ననిరి నాసత్యదేవత లభినవముగ

తుత్థయుగ్మాదిచూర్ణము.

సీ. మహిలతమా తుత్థయుగ్మంబు భాగతీరియ
ముప్పాళ్ళు త్రికటుకములును గూర్చి
పాటలీపర్ణము ల్వసగంటు బాజీరాయు
త్రిఫలముల్ నీలాకు దిరిశనంపు
చెక్క మేలగుజువ్విచెక్కయు వట్టివే
ళ్ళప్పిమధుకము పాళ్లసగ నొక్క
కొకటి వేర్వేరుగా నురుము జేసియు పటా
ద్ధూళనంబొనరించి దొరయు చూర్ణ

గీ. మునకు నరిశర్కరయుగల్పి మూడువాస
రములు సేవింప వహ్నిరోగములు మాను
ప్రమదమొనరించు సౌఖ్యసంపదల నిచ్చు
తుత్థయుగ్మాదిరజము విఘాతకుజము.

### పిప్పలీమూలగుళికలు.

గీ. నెయి పిప్పలిమూలంబు నీలియాకు
పసరుతో నూరి దగ రేగుపండుకొలది
వటుకములుజేసి భక్షింప వహ్నిరుజలు
దొలగు పిప్పలిమూలికా గుళికలివియు.

### జంబూత్వగాదిలేహ్యము.

సీ. చెలువొందనేరేడు చెక్కసారం బాఢ
కము జువ్విచెక్కసారములు దాని
సమము గోఘృతమాఢకముగల్పి శాచిత్రి
కటుకముల్ పిప్పలికట్టై తిప్ప
సత్తు రాస్నయు వససారమా పర్పాట
కము సమూలము చిత్రకంబు తెల్ల
మిరియంబు లూముగు బెరడు నల్లావాలు
సైంధవలవణ మచ్చపుసముద్ర
ఫేనంబు వారిజవృతుంబు వేళ్లచె
క్కయు నొక్కటొక్కటి గాగపలము

గీ. పలము లొగిచూర్ణమొనరించి పరగ పచన
మైననేతినిగల్పి నేర్పమరవండి
రేగుబండంత భక్షింప బాగుమీర
శ్వాసలును కాస లగ్ని రుజములుదొలగు
నరయ జంబూత్వగాది లేహ్యమనజెల్లు.

### చిత్రకాదిరసము.

సీ. వరశమీఫలములు పలములిర్వది కణం
బులు నైదుపలములు పొసగ చిత్రి
మూలం బయిదుపలంబులు నుసిరికచెక్క
పలము త్రిఫలముల్ పరగమూను

పలములుచూర్ణించి భవ్యమహా గోక్షీర
ములు మూడు దఱయ గోమూత్ర మొక్క
ప్రస్థంబు దగఁ గొంచు ప్రస్థము ల్నాలిలా
కురసంబు గాచి గోమ్మూత్రను మొదటి

సీ. చూరబోసియుఁ వండి పొంపారదించి
గుళికలొనరించి ప్రొద్దునఁ గొన్న గ్రహణు
లరుచి మందాగ్ని వహ్నిరోగాదు లణఁచు
నావుపాల్ నెయ్యి శాల్యన్న మగు పథ్య
మరయఁగా చిత్రకాదిరసాహ్వయంబు.

విషతిందుకగుళికలు.

సీ. వెలయంగ పరిశుద్ధ విషముష్టివిత్తులు
వాల్మరిచములు పిప్పళ్లు పాలు
లలితమా జీడివిత్తులలోని చమురున
చేకొద్ది మర్దించి చెలువు మీర
కలుకు దుగింజలకొలది మాత్రలు జేసి
ప్రొద్దున మేల్కాని బుచ్చుకొన్న
నిష్ఠురంబైన వహ్నిరుజంబులు దొలంగి
భాసుర సౌఖ్యంబు ప్రబలుచుండు

గీ. వలను విషతిందుకాహ్వయ గుళికలనుచు
బలికిరొక్కట చరకాది వైద్యమునులు
వీర్యవృద్ధియు నై ధర వినుతకాంతి
గలిగి వర్తింతు రలకిలికరుని భంగి.

కూశ్మాండఘృతము.

సి. మహితమా బూదిగుమ్మడికాయ గసము న
ద్దసర పాలురసంబు నుసిరికపల
రస మిక్షురసము నిర్మల మైన నేలగు
మ్మడు చక్కరసము పొంపడర పిల్లి

జీసరరసము సంభావితగోక్షీర
మలుతద్ఘృతంబును పొసగపాల్లు
గోకర్ణకప్రస్థంబులొగిగూర్చి నేతితో
నినుకగాచియునటు వెనుక శొంఠి
పిప్పళ్లు మిరియముల్ బేర్మితోనుసిరిక
పప్పు తవాక్షీరి పరగ యష్టి
మధుకంబు దుంపరాష్ట్రము నల్లజీరక
ము ల్చందనము తుంగముస్త లేల
కులు దాచనీచెక్క లిలశిత తాళిస
పత్రి ఖర్జూరపుపండ్లు వట్టి
వే ళ్లడవిసదాపవిత్తులును సుగంధి
పాల శిలాజితు భవ్యమైన
చిటిముటివేళ్లపై జెలువొందుజెరడును
బలుపెద్దముత్తువపులగము చిన
ముత్తువపులగ మీ మొత్తముల్ చూర్ణించి
కాగినరసమందు కలియబోసి

గీ. వండిదించియునర్ధంపు ప్రస్థము మధు
వరయగల్పిన కూశ్మాండకాదిఘృతము
ననగదగపాండుకాసలు నసల రుజలు
రక్తపైత్త్యజ్వరములు మూత్రప్రబద్ధ
ములును వంధ్యానపుంసత్వములు దొలంగు

కర్పూరభస్మము.

సీ. ఉమ్మెత్త గజ్జేరు లొగి సహదేవి చి
త్రకముల వేళ్లను దనరియున్న
బర్బర తోడను పారదంబుమధించి
పొసగకుండను యుప్పుబోసి డమరు
యంత్రంబు చేవండి యనువంద పైకుండ
కంటినభస్మంబు నమరరాల్చి

కలబందగుజ్జుతొక్కుపు పంచదారయు
భక్షించి సుఖమున బ్రబలుటొకటి
ప్రత్తికాయరసంబు పంచదారనుగల్పి
భక్షించుటొకటి స్రాంబ్రాణితులమును
నారికేళరస్సాని మరయుతులం బద్ద
తులమింగిలీకము వెలయఁజేసి
పిత్తులుపావుల యెత్తుగూరిచి నూరి
దినుటయొక్కటిముదంబుననువెలఁగ
పింజెలు శర్కర పొందించినూరి పు
చ్చుకొనుటొక్కటియును సొబగుమీరు

గీ. వహ్నిరోగంబులెల్ల నిర్వాపణంబు
సేయఁజాలుటకని ముసు సిద్ధవైద్యు
లనఁగ సిద్ధక్రియలుజెప్పి రట్లుగాన
గాంచుఁడభినవభిషగగ్రగణ్యులార

పథ్యములు.

గీ. ఉడుకునీరును విమల శాల్యోదనంబు
నేకవారాశనంబు నస్తోకనియతి
సేయవలెగాని యుష్ణైన చెలఁగిదినుట
తగదు యీవహ్నిరోగ సంతాపపరులు

---

ఇరువదినాల్గవపద్ధతి.

(వంధ్యారోగప్రకరణము)

గీ. వాత పుత్ఫేదముల ధర వనితలకును
యోనియందు రజోదోష మొదవి ఒన్న
వంధ్యనా కాకవంధ్యనా బలువగు మృత
వంధ్యనా కదళీతరువంధ్యయనగ.

సాంవుపాలను శాల్యన్న మరయదినుట
పథ్యమిడి జన్మవంధ్య తాంబడయుసుతుల.

ఆ. వెలయదేవదారువేరుచక్కను పుష్య
తారయుక్త భాను వారమందు
వెచ్చి యేకవర్ణ ధేనుదుగ్ధంబుల
నూర ఋతువు మొదలు చారుముఖికి.

క. వగనిష్కత్రయ మెత్తు ను
దరమునకుఁ గ్రిందిలెట్టు తెగ నెన్మిది వా
సరములు బూసిన సంతతు
లరయఁగ గల్గెదరు పథ్య మగుపూర్వగతిఁ.

సీ. పాతజలమున పెంపలి వేరునూరి ర
సముదీసి ఋతువుకాలము మొదలుగ
సప్తదినములు కర్షము కర్ష మెత్తుగా
గ్రోలియు తద్రసంబోలి పొత్తి
కడుపునబట్టించి గరిమంబుతోడ పా
లును పచ్చపెసల పప్పునఘు శాలి
తండులాన్నంబు పథ్యంబు జేసిన గర్భ
వతియగు నిలజన్మ వంధ్యయన స

గీ. నిత్యనాథాది వైద్యులు సత్యముగను
బల్కి రిటుగాన తప్పవీ పద్ధతులకు
సంశయమునందబోక నిశ్చయముగనుడి
యుథుసిక భిషగ్వతంసము లారమీరు.

మ. అలసర్పాక్షియు కుంకుమంబుపుదివ్యత్పూతముఁ గానసం
బులయందుండెడు కందగడ్డల రసంబొల్పొందగా నూరి సం
జిలనేక పల్భగల్గు ధేనువుల సత్క్షీరంబులఁ గర్ష మిం
పలరంగా ఋతుకాలమాదిగను సప్తాహంబులఁ ద్రావినఁ.

క. బలుజన్మ వంధ్యకును చూ
ల్గల్గును గోక్షీరములును కడుపచ్చపెసల్
విలసిత శాల్యోదనముల
నలలిత పథ్యంబుసేయు జనునిక్కముగన్.

గీ. పొసగ సహదేవి చెట్టంత పుష్యసంధ్య
నాదివాసరమున దీసి యమరనీడ
నెండబెడ చూరగావించి యేకవర్ణ
ధేను దుగ్ధంబుతో నేడు దినము లరయు.

క. ద్రావియు పచ్చపెసల ప
ప్పావరి వంటకము పాలు నలరగ పథ్యం
బై వెలయ వంధ్యలకు గ
ర్భావిర్భవమొందు సత్య మనిరిమహాత్ముల్.

కాకవంధ్యలకు.

గీ. ముదముతోడ విష్ణుక్రాంతమును సమూల
మరయ నీడనుయెండించి నురుముజేసి
బర్రెపాలను భావన పరచి ఋతువు
మొదలు నెన్మిది దినములు మొనసి నేదె
వెన్నతో దిన సుతులుద్భవించు టరుదె.

క. మేహప్రకరణమందును
దాహరణము జేసియున్న ద్రాక్షాదిరజం
బూహించి చూడుదదియె గ
దాహతియగుగాక వంధ్యయను గుణమునకున్.

కాకవదీవంధ్యలకు శుద్ధక్రియలు.

సీ. చెలగి విష్ణుక్రాంత చెట్టంత బర్రెపా
　　　　లమర్దించి ఋతువాసరము మొదలుగ
నేడుదినంబులు పోడిమితో నేదె
　　　　వెన్నగల్పుక ప్రేని వెలయు టొకటి

పాసగపెస్నెరుగడ్డ పుష్యమీ రవివార
మునదెచ్చి ౩ కైవాలనుమథించి
యుద్ధఫలంబెత్తు సమాంగ ఋతువేళ
మొదలు సప్తాహముల్ బుచ్చుకొనుట

గీ. యొకటి పచ్చపెసలపప్పు ప్రకటమైన
శాలి బీజాన్నమును పాలు సలలితంబు
పథ్యమయ్యెను నీరెండు పద్ధతులకు
కాకరంభాదివంధ్య లొక్కటదొలంగు.

మృతవంధ్యకు.

గీ. వెలయగానూనె వెంుతురు వేళ్లరసము
గల్పివండియు నా తైలమొలమిరెండు
మాసములదాక సేవింప వదలని మృత
వంధ్యలెల్లను మాని శుభంబుదనరు.

గీ. సరవి వెంుతురు వేళ్ళరసంబు నావు
నేతితోవండి గర్భిణి నెలలుదనకు
నేడుమొదలుగ సేవింప నొసగిన మృత
వంధ్య తెవులుదొలంగి భవ్యశుభములరు.

గీ. రమ్యతరమైన బలుచేతరాసిగడ్డ
పెద్దమాన్ చెక్క వెంుతురు వేరునూనె
వండిసేవింపగా మృతవంధ్యలెల్ల
మాను నివిపూర్వవైద్యుల మతములయ్యె.

వంధ్యలకుయోనిశుద్ధి.

గీ. గరిమతో గొడ్డుగాకర గడ్డలపొడి
మంచిగోక్షీరములతోడ మరియు నాల్గు
మాడలెత్తున ఋతువేళమహితముగను
ద్రావిమృతవంధ్య తెవులొగి దాదొలంగు.

గీ. గరిమలొద్దుగ చెక్క శ్రీగంధ ముత్ప
లంపుగడ్డయు చూర్ణించి లలిత శాలి
తండులక్షాళ నాంచితోదకముతోడ
నొసగ గర్భము దిగజారుటుడుగుసతికి.

గీ. ప్రేంకణపుపువ్వు జిల్లేడువేరుచెక్క
పెద్దముత్తువ పులగంపువేళ్లు కుంకుమం
పుపువ్వు కేసరముల్సమముగ చూర్ణ
జేసి నిమ్మద్వయంబెత్తు జెలగి మేక
పాలతోగొన్న షడ్డియనా భగముసతికి.

గీ. కొమరుమీఱంగ తరువాత కొర్రెజిడ్డు
చెట్టుచూర్ణించి నిత్యంబు జెలగి నాల్గు
మాడలెత్తావు పాలసమ్మతిని ద్రావి
యదియ సస్యంబొనర్ప సుతాప్తిగలుగు.

సీ. గ్రంధి తగరము శ్రీగంధంబును బలుసు
కసిగడ్డ నల్లని గలువగడ్డ
మామిడివే రతి మధురంబు కోష్టుపు
పరిభాగములచూర్ణ సంతతంబు
నాల్గుమాడలయెత్తు నయముగా మేకపా
లను ద్రావ ఋతుకాలమునను నల్ప
గల రక్తమమరెను బలువై నవదశ్యతు
భగముశుద్ధియగును భాసువృక్ష
మూలంబులును తెల్లములకగంటునవేళ్లు
గొడ్డుగాకర కొర్రెజిడ్డుగడ్డ

గీ. లివిసమంబుగ చూర్ణించి వవిలి వెనుక
నేడురోజులు నావు పాల్తోడ ద్రావ
వలయునని పూర్వభేషజుల్వాలికి రిటుల
నేయ గర్భంబుదాల్చుట సిద్ధమవని.

గీ. గ్రంథి తగరంబు నల్లని కలువగడ్డ
మంచిగంధంబు రజ మతిమధుర మలఁకు
కోష్ఠంవులపాడి మేకపాల్గోరిల ముక్క
సస్యమొనరింప సుతవృద్ధినాతికెసగు.

చ. అలఘుతరేక్షుసారమున నామలకంబులపప్పుచూర నిం
పలరగభావనంబులు నయంబున నిర్వదిమార్లుచేసి నీ
డలుగలచోటనార్చియు దిటంబుగ తద్రజమంతశర్కరల్
గలయగబోసి క్షౌద్రమొగిగల్పి భుజించినపిమ్మటల్ దగన్.

క. గోదుగ్ధంబుల ద్రావుచు
పాదుగ నీరీతిసతియు పతిసల్పిన పెం
పూదగ నెనుబదిదినముల
కాదటవంధ్యామయంబు లన్నియుమానున్

సీ. మంజిష్ఠియును అతిమధురంబు పెద్దము
లక నల్లకలువ రేణుకలు తిప్ప
తీగె పెన్నేరు గ్రంథి తగరంబు మరి చేమ
పొట్లతామరతూండ్లు పొనగపనపు
కురువింద గచ్చడ్డ సరము నింబయునారి
కేళముచ్చితయు పల్లేరు నర్క
తరువు లేదినుసుల వరసారములుసమం
బులుగాగ సర్పి లోపలనయముగ
బోసిఘృతమునను పొలుపొంద నిన్కంగ
గాచి సేవింపంగ కామినులకు

గీ. నాల్గువిధములవంధ్య లెన్నగదొలంగు
ప్రజలసంతానవృద్ధిచే బరగగలర
టంచుమున్నాడి రమర వైద్యాగ్రగణ్యు
లిదిమనంబున గనుటొప్పుసిద్ధమతులు.

సీ. ఎఱ్ఱనువ్వులు శర్కర మెలమి తమ్మి
గడ్డ సరిభాగములు చూరగానొనర్చి
మేడివేళ్లకషాయంబుతోడ ద్రావ
నిలువకుండెడుగర్భంబు నిలుచు సతికి.

శీతకల్యాణఘృతము.

గీ. ధాతకీకుసుమము మున్గు తమ్మివేళ్లు
తఢ్యమా నల్లకలువదుంప లతిమధుర
మరయ లొద్దుగచక్కెయు సరులచూర
ఋతువున్నాడిచ్చినను నిల్చు సతికి చూలు.

సీ. కలువగడ్డలు పద్మకాలును వట్టివే
ళ్లను పిల్లిపెసర బెంపెనయపెద్ద
గుమ్ముడు తిప్పయు గోదుముల్ పెద్దము
త్తవపులగము నేలతాడిగడ్డ
లెఱ్ఱవడ్లు సదాప మెప్టిమధుకము తిరి
ఫలములు కరకకాయలును జీర
కము నేలగుమ్మడు కదళిఫలమ్ములు
తుంగముస్తలును నిస్తుల్యమైన
తెలిజిగికలువగడ్డలు చినముత్త
వపులగంబును మృణాళములును మంచి
ముయ్యాకుపొన్నయు మురువుతోనివి యర్ధ
పలములుచొప్పున పరగగూర్చి
ద్రోణమాత్రపునీట ద్రోసియునెన్మిదో
భాగశేషముగ బెంపారగాచి
యాజ్యంబుప్రస్థంబు నావుపాల్ రెండుప్ర
స్థంబులు తత్తకషాయమందు
కలియబోసి మరల కాచి త్రిజాతముల్
ద్రాక్షపండ్లను పంచదార నమ్మ

గడ్డ త్తువాక్కిరి ఖర్జూరపుంబండ్లు
గొలిమిడివిత్తులు గురుతరంపు
పెన్నేరుగడ్డలు బేర్మిమొరడుబంక
జాజికాయలును భాస్వర్ణవంగ
ములు నతిమధురంబు పొలుపగు నిప్పపు
వునుగూర్చి పొడిజేసి వెనుకటిరస
మందిడి వండి క్రమంబునదించి యా
మందు కర్షంబెత్తు పొందుమీర
పూటపూటకుగొన్న ఘూటమా యోనిశూ
లలు వంధ్యలును మేహములు శ్వాస
కామయంబులు క్షుధ లరుచి రోగంబులు
పాండువుల్మాను విస్ఫారసౌఖ్య
గీ. ములును జేకూరు బహుళరుజలునుదారు
శీతకల్యాణఘృతము ప్రసిద్ధముగను
మున్ను వైద్యవతంసులు మొనసిదీని
కాహ్వయంబిడి రిదియు మంగళకరంబు.

---

## ఇరువదిమొదవపద్ధతి

(శోఫరోగపరికరణము.)

గీ. శోఫలెనిమిది యతిసారశోఫ శుష్క
శోఫ క్షయశోఫ ఘనపైత్యశోఫ వాత
శోఫ కఫసంభవంబగుశోఫ శ్వాస
శోఫయును పాండుభవమగుశోఫ లవని.

గీ. రొమ్ముకంతమువాచిన నమ్మరాదు
కిందికడుపున యోనిపై కిందితొడల
వాపులవి కష్టసాధ్యంబులౌ పదముల
కరములనువాపు కుదురు భంగంబులేదు.

అతిసారశోఫ.

ఆ. వాచనేని వాచువడలెల్ల లేకున్న
కాష్ఠచేతులందుగలిగి మేను
చెక్కవేడువలెను చిక్కును నతిసార
శోఫ నమ్మరాదు సుమ్మి భువిని.

శుష్కశోఫ.

సీ. తగనిజ్వరంబు హృత్తాపంబు నిస్సత్త్వ
కాంతిహీనంబు నుద్గార వమన
మలబద్ధ కృచ్ఛ్రాగ్నిమాంద్యశూలాజీర్ణ
రక్తగ్రహణిబధిరత్వకంఠ
శోషలతో మేనుశోషించి పచ్చనై
మాయగా వాపు దాబోయి మేను
చిక్కినట్లుండియు శీఘ్రంబుజంపును
దుష్కర్మభవము యీశుష్కశోఫ

క్షయశోఫ.

గీ. దారుణంబైనవాపు గాత్రంబునందు
శీతమైనను జ్వరమైన జేరియుండు
సర్వసంధులు శిరమును జాలనొచ్చు
గురుతరంబైన క్షయ శోఫ కుదురదెచట.

పైత్యశోఫ.

క. వడలెల్లవాచి దాహము
కడుబుట్టి వివర్ణమగుచు కాంతివిహీనం
బుడుగనిశీతము కంఠము
వడియెండిన పైత్యశోఫ వైద్యులుదెలియన్.

వాతశోఫ.

గీ. గాత్రమున శీతమును వేకి కఫగళంబు
అరుచి తేపులు పాండుదేహము ప్రలాప

వేదనాజీర్ణములతోఁటి వేగవాత
శోఫ జంపును యెటువంటి సుజనునైన.

కఫశోఫ.

గీ. చాలపాండురమై పీన సాగ్నిమాంద్య
మరుచి కృచ్ఛ్రయుగలిగి దాఁణగిలిగి
వచ్చు కఫశోఫ మానవావళికిబాడమి
కుదురు కుదరదు వివరింప కొన్నిచోట్ల.

శ్వాసశోఫ.

గీ. జన్మమాదిగ వేకువర్షూమునందు
దగ్గు నెగరొప్పు ఛర్ది శీతంబు హిక్క
వేకితో చిక్కి చిక్కి శోభించెనేని
చంపునిది శ్వాసశోఫ నిశ్చయముగాను.

పాండుశోఫ.

ఆ. పొత్తికడుపునొప్పి భుక్తినజీర్ణము
తెల్లనైనమేనుతీరు వేకి
గాక భుక్తిమిగులు గాత్రంబుపాండువు
పాండుశోఫతోఁటి బ్రతుక డెవడు.

శోఫరోగచికిత్సలు

అంధకారిరసము.

సీ. రసగంధకంబులు వసనాభి కాంతంబు
తామ్రభస్మంబును తాళకంబు
కాచలవణము త్రికటుకముల్ రజితంబు
ముష్టివిత్తనములు శ్రేష్ఠమైన
గుంపెనవిత్తులు సొంపు రాజావర్త
శిల చిత్రమూలముల్ జేర్చిసరిగ

కల్వంబులోనిడి కల్వరరసమున
మూడుదినంబులు నూరిగాను
గీ. మర్దనమొనర్చి గురిజెత్తు కొద్దిమాత్ర
మానవాళికిల రేపుమాపునివ్వ
పాండుశోఫలుహరియించు బలితమైన
కామిలలగూర్చు నీయంధకారిరసము.

వజ్రమండూరము.

సీ. నాలుగురపూములు నాలమాత్రంబున
మండూరము పలంబు వండి దించి
నల్లేరు గండ్రికల్ నయమొప్పగా చింత
బలిపేళ్లభస్మంబు పలముపలము
జతగూర్చి జలముల జాముమర్దనజేసి
గచ్చకాయలసరిగాను మాత్ర
లొనరించి యిరుపూటలను దినంబును గ్రోల
పాండుకామిలలను బారదోలు
గీ. శోఫలను మానుగాజేసి శుభమొసంగు
వైద్యసింహములకు చాలవన్నెదెచ్చు
వజ్రమండూరమను పేరు వాడిదీసి
మున్ను ధన్వంతరికిదెల్పె మురహరుండు.

సురదారుచూర్ణము.

ఆ. దేవదారుచెక్క తెల్లగజ్జెరువేళ్లు
తెల్లమిర్యములను త్రికటుకములు
కరకమానుపసపు లరయ విళంగముల్
సారదిబాద్దిచక్క చూరజేయ.
క. సురదారుచూర్ణమైభువి
బరగును యుష్ణోదకమున పలుమరుగొనినన్

గురుశోఫ పాండుగదలను
బరిమార్చునటంచు శూలిబల్కె సురులతోన్.

అభయాదిచూర్ణము.

ఆ. కరకకాయ తెల్లగల్జెరువేళ్లను
తుంగముస్త శొంఠి తోరమైన
దేవదారుచెక్క దెచ్చిచూర్ణమొనర్చి
ఆలమూత్రమునను గ్రోలగాను

క. శివనామోచ్చారణమున
నవలీలను పాతకంబు లణగినకరణిన్
భవశోఫగదలుదొలగును
భువిలో నభయాదిచూర్ణ బుధులుగణింపన్.

పునర్నవఘృతము.

సీ. పల్లేరువేళ్లను తెల్లగల్జెరువేళ్లు
జిల్లేడుచెక్కయు నెల్లిచెక్క
తిక్కడుచక్కయు తగుచాగమట్టలు
వావిలియాకును శివిమిరాల
త్రొక్కితీసినసార మొక్కొక్కపస్థముల్
గోక్షీరములురెండు గూర్చి యావు
నెయ్యిపస్థంబందు నేర్పుతో సంధించి
ఘృతపాకమునవండి చతురులగుచు

గీ. లేపనముసేయ శోఫల బాపుననుచు
అశ్వినీదేవతలతోడ హరుడుబల్కె
ధర పునర్నవఘృత మన బరగుదీని
వైద్యదేవేంద్రులు గ్రహించి వాడవలయు.

పంచగవ్యఘృతము.

సీ. ఆలమూత్రము దధి పాలు ఘృతంబును
పేడరసంబును రూఢిగాను

కుసుమములు ప్రత్యేకమిడి యందులోపల
వాయువిళంగములు వసయు పసపు
చిత్రమూలంబును చిరుబొద్ది ముస్తలు
త్రిఫలములు మిర్యాలు దేవదారు
పలములు ప్రత్యేకములుగూర్చిచూర్ణించి
జెముడుపాల్ గిద్దెడు జేర్చి వండి

గీ. ప్రాతకు తులంబుచొప్పున బుచ్చుకొనిన
పాండుశోఫలతొలగింపు ప్రబలమైన
ప్లీదరముల కామిలంబుల చెదరజేయు
మానవావళి కమృతోపమానమగుచు.

సురదారుకషాయము.

క. సురదారుత్వగభయములు
కరికణమును కణముకొంతె గద్దెడు వేష్లక్
వరచిత్రకంబుముస్తలు
సరి క్వాథముజేసి గొనిన సమయునుశోఫల్.

శుద్ధక్రియలు.

సీ. పాతచట్టెముదెచ్చి బద్దలుగాగొట్టి
కల్లులోబడవేసి కలియదీసి
మరుదినంబాకల్లు మరియొక్క కుండలో
వంచి యందున విభజించి పావు
శేరుకల్లునను నైదారులవంగములు
నూరినపాడిగల్పి ధీరుడైన
వైద్యసింహంబులు వదలక నలుబది
దినములొసంగిన దీనశోఫ

గీ. పాండువులు మానునిమున్నుబల్కె శివుడు
యోగివర్యులతోడుత బాగుగాను

ప్రాణిరక్షణమదిలోన బూనివారు
మర్త్యమున వెల్లడించిరి సత్యమనుచు.

సీ. చింతాకుపసరున చిట్టెముసుడికించి
మేలుగాసొటాకు గ్రోలుటొకటి
చిట్టెమును సిరకల్ జేర్చిన క్వాథంబు
రససింధురంబుతో నొసగుటొకటి
పావుశేర్చింతాకు పసరులో పిప్పళ్లు
మండూరమొకనాల్గుమాడలెత్తు
గల్పిభక్షించుట కరమొప్పనొక్కటి.
మరిచముల్ చిట్టెము సరిగ నూరి

గీ. క్వాథమొనరించి గుడమందు గలపియైన
తెగడపొడిబోసి కలియగాదీసియైన
పానమొనరించుటొక్కటి మానుగాను
శోఫలకు శుద్ధక్రియలని శూరులనిరి.

పరమహంసక్రియలు.

సీ. గజ్జేరువేళ్ళను కరకచక్కలుశొంఠి
మానుపసపు సరిగాను గూర్చి
ఆవుచల్లనునూరి యదిమితీసిన రసం
బనుదినంబును బుచ్చుకొనుటయొకటి
గోవుమూత్రము క్రొత్తకోకనువడబోసి
తీక్ష్ణలోహంబును త్రిఫలములను
చిత్రమూలము శొంఠి శ్లేష్మహాపసపును
చూర్ణించి జతగూర్చి సారదిత్తేనె

గీ. వేసి సప్తదినంబులు విసుకులేక
పానమొనరించుటొక్కటి మానుగాను
పరమహంసలతోడుత బల్కెశూలి
శోఫలకుమందులనుచు విస్ఫుటముగాను

గీ. పాండుపద్ధతియందున బల్కియున్న
కాంతవల్లభరసమును కరము లోక
నాథరసమును చించ్యాది నరుల కొసగ
శోఫలును మానునని వైద్యశూరులనిరి.

క. రసభూపతియను మందును
యసదృశ శోఫలకునొసగ ననుకూలమగుఁ
రసికులగు భేషజేంద్రులు
వెస సన్నిపాకరణమున వెదకికనవలెఁ

పథ్యములు.

క. అల్లము గోదుము లావుల
చల్లయు గలిజేరుకూర సరసంబుగ నూ
ఒన్నెల్లకు బండిన వస్తును
చెల్లును శోఫలకు పథ్యసిద్ధు లనంగఁ

అపథ్యములు.

క. పెరుగును కల్లును మినుములు
గొరియలమాంసము విదాహగుణవస్తువులుఁ
కరమొప్ప పులుసు నువ్వులు
సురవగరు లపథ్యమనిరి సోఫలకెల్లఁ

---

ఇరువదియారవపద్ధతి.

(కామిలారోగప్రకరణము)

ఆ. పాండుయక్ష్మరీతి బాధించు కడువడి
కామిలాత్రయంబు భూమినరుల
కుదుర దెవరికైన కుంభకామిల దాని
వదలివేయవలయు వైద్యమణులు.

ముఖ్యగుణములు

గీ. మలము మూత్రము ముఖమును మహితమైన
నేత్రములు గోళ్లు పచ్చనై గాత్రమరయ
కృష్ణవర్ణముదనరి బల్ తృష్ణగల్గ
కామిలయటంచు వైద్యులు గనుడుదీని.

కుంభకామిల.

గీ. జ్వరము వాకరదడ శోఫ లరుచి యగ్ని
మాంద్యమును మూత్రమలములు మానుగాను
పీతవర్ణము కాయముద్రోత నల్పు
గలుగనిది కుంభకామిల గడుసు తెలియు.

దుష్టకామిల.

గీ. కాయమతికృష్ణవర్ణమై కడుయజీర్ణ
మరుచి జ్వర శోఫ తృష్ణలు కరము మలము
కన్ను లేపచ్చనై ధరగానుపించు
దుష్టకామిలయందురు స్పష్టముగను

చికిత్సలు.

పంచాస్యరసము.

సీ. తామ్రంబు గాంతము తాళక లోహముల్
హారవీర్యభస్మము యభ్రకంబు
మాక్షికద్వయము సమంబులుగాదూచి
దేవదారు రసాన దినమునూరి
కాచకుప్పెను రోజు గాఢాగ్ని చేవండి
గుంజాప్రమాణమౌ గుళిక తిప్ప
తీగె తామరతూండ్లు తెలికల్వగడ్డలు
పాలతోమర్దించి బాగుగాను

గీ. తీసినరసంబులో తేనెవేసి పంచ
దారయును పూర్వగళికను చారుగతిని
గలిపిభక్షింప కామిలల్ కడకుదొలగు
వసుధలోనిది పంచాస్యరసముదెలియు

ఔషధక్రియలు.

సీ. నలకట్లవిత్తులు నయముగాచూర్ణించి
పచ్చిపుల్సునుగల్పి యిచ్చుటొకటి
తెల్లగల్జేరువేళ్లు దెచ్చి సారముదీసి
చక్కెర మరిచముల్ సరిగకల్పి
పానంబుసేయుట మానుగ నొక్కటి
పాలు గంటెనవేళ్లు గ్రోలుటొకటి
కుప్పియాకురసంబు గోక్షీరయుతముగా
ప్రియత నుదయమున బీల్చుటొకటి

గీ. 'కామిలకు మందులని మునిస్వాములనిరి
గాన వైద్యులు కడుశ్రద్ధబూని యొసగ
వేదవేద్యునిసత్కృప విమలమగును
సత్యమని నమ్ముడీపల్కు మర్త్యులార

అగ్నిచికిత్స.

క. కరచరణంబులమొదలను
యురు తామ్రశలాకతోడ యుర్వీస్థలిస
త్వరమున రక్షలు వేసిన
బరువడి కామిలలు విడచిపారుటయరుదే

పథ్యము.

ఆ. కామిలలకు పథ్యక్రమము ప్రత్యేకము
గానులేదు శ్రద్ధబూని పాండు

ప్రకరణమున బల్కబడిన నిషేధముల్
విధులు తెలిసికొనుడి విబుధులార.

---

ఇరువదేడవపద్ధతి
(మూత్రకృచ్ఛ్రప్రకరణము.)

సీ. ధర నజీర్ణద్రవ్యతతిని మత్స్యంబుల
తీక్ష్ణవస్తువులను దినుటవలన
అనయ మాసవపాన మొనరించినందున
నంగదృఢంబు దొలంగుకతన
వాత పైత్య శ్లేష్మ వస్తి శర్కర శుక్ల
ఘనత్రిదోషము రక్త మనెడు పేర్ల
కృచ్ఛ్రలెన్మిదిబుట్టు కుండలికృచ్ఛ్రన
గలదు వేరొకటి బల్గడుసునగును

గీ. వైద్యశాస్త్రంబులన్నియు వరుస వెదకి
వాటిగుణములనన్నిటి తేటపరచి
క్రమ్మర చికిత్సలును చెల్పు దిమ్ముగాను
వైద్యసింహంబులకు కడు హృద్యముగను.

వాతకృచ్ఛ్రము.

గీ. కడుపులోపలగడ్డలుగట్టి మొదలు
పరగ మూత్రము బొట్లుగాబడును మిగుల
వాచియుండును దేహంబు వాతకృచ్ఛ్ర
బూనునరులకు ధరలోన మానుగాను.

పైత్యకృచ్ఛ్రము.

క. ఏతరిజూచిన మూత్రము
పీతారుణ కాంతులలరి బిందువులుబడన్

ఆతుర దాహముఁగలిగిన
భూతలమున పైత్యకృచ్ఛ్ర బుధజనులెన్నన్.

శ్లేష్మకృచ్ఛ్రము.

క. మూత్రముజానలునాగును
గాత్రంబున మేహము వను గల్గును వాపే
మాత్రంబరుగదు యన్నపము
చిత్రిం బీశ్లేష్మకృచ్ఛ్ర చేష్టలుదలపన్.

రక్తకృచ్ఛ్రము.

ఆ. మూత్రమడ్డకట్టు ముక్కిచూచినరక్త
బిందువులుస్రవించు బంధురముగ
రక్తకృచ్ఛ్రములను రాజతాచలగేహ
యమలహీరహార దాభదేహ.

త్రిదోషకృచ్ఛ్రము.

ఆ. ధరత్రిదోషకృచ్ఛ్రంబరగు పైత్యశ్లేష్మ
వాతకృచ్ఛ్రములందు వరుసగాను
జెప్పయున్న గుణము లేర్పడియుండిన
హాతమొసర్చు మనుజతతిని నిజము.

శుక్లకృచ్ఛ్రము

చ. అరయగ శుక్లహీనమును నశ్మరిపోలిక కృచ్ఛ్రమూత్రిముల్
నిరుపమ బిందురూపముగ నీరుస్రవింపు మ కాష్లచేతులన్
దిరువుగ మంట నొదలను యీాక్షణముగ్మము నందు వేదనల్
జ్వరము నిబంధతృష్ణ హాతసత్వముగల్గును శుక్లకృచ్ఛ్రికన్.

వస్తికృచ్ఛ్రము.

ఉ. పొక్కిలిక్రిందమూత్ర మతిపూరితమై వడి కాగుచున్ శిరో
దృక్కుల పీడ శీతహాత దీపనహస్త తలాంఘ్రిదాహముల్

మిక్కిలి శాంతికంపము సమీరవికారము బిందుమాత్రమున
పక్కలసూల శిశ్న గుదపద్ధతి నుష్ణము వస్తికృచ్ఛకున్

శర్కరకృచ్ఛము.

గీ. కొమ్మునను నాభిక్రింద నేత్రంబులందు
శూలజనియించి శర్కర జాలి మూత్ర
మించుకించుకగాను గార్పించి బొట్లు
బడిన నిది శర్కరాకృచ్ఛ గడుసుదెలియ.

వాతకుండలికృచ్ఛము.

గీ. శిశ్నమున కల్క గుదము వస్తియును నొచ్చు
మూత్రమల్పముగావచ్చు గాత్రిమునను
వాతమధికంబగునుదీని వసుధ కృచ్ఛ
కుండలియటంద్రు దేనను కుమర దెలమి.

## చికిత్సలు

వాతకృచ్ఛమునకు

సీ. సూతభస్మము పరిశుద్ధతామ్రము మైల
తుత్థ వెల్గారముల్ తుల్యముగను
గూర్చి ఖల్వంబున జేర్చి శతావరి
సారముచే నాల్గునాళ్లునూరి
యాయౌషధము నూనె యావునేతను ఘృతము
పక్వముగావించి పదిలముగను
చిన్న మెత్తగుమాత్ర చేసి మధువునైన
తులసియాకును కొత్త తెలికపిండి

గీ. చారుతరమైన మారేడు చక్కదెచ్చి
త్రొక్కితీసిన సారము తోడనైన
నాలుగగు మాసములు సేవ నరులుసల్ప
వాతకృచ్ఛలదొలగించు భూతలమున.

శైత్యకుష్ఠహరుసము

సీ. పారదభస్మము పాలు నాలుగుపాళ్లు
గంధకంబొనకూర్చి కరము మేక
పాలతోడననూరి పచ్చగవ్వలబెట్టి
యెండించి పిమ్మట దండిటంక
ణంబుభాగంబు భస్మంబు గావించియు
మేకపాలనుగల్పి మెదపిపూసి
గాలికారగనిచ్చి కడవలోపలబెట్టి
మేకపాలనువండి ప్రాకటముగ

గీ. నూరి చిన్నముక్కొక మాత్ర వేరువేర
జేసి జాతీఫలంబున వాసిగల్గు
మేకపాలనుగొనిన భూలోకమునను
శైత్యకుష్ఠలదొలగించు భాసురముగ.

క. ఉసిరికపప్పును జీరయు
కసిగందని యెందుగాకు క్వాథముతోడన్
రసికులగు వైద్యులిచ్చిన
వసుధాస్థలి నీరుకట్టు వదలు గిరీశా.

శ్లేష్మకుష్ఠహరుసము.

సీ. పదియారువన్నియ బంగారుభస్మంబు
పారద వైక్రాంత భస్మములను
సమభాగములుగూర్చి సలలితంబుగ కొండ
పిండిరసంబున రెండువాళ్లు
మర్దించిపుటమిడి మాషప్రమాణమౌ
గుళికలు మధువుతో గొనిన శ్లేష్మ
కుష్ఠలు మొదలంట కొట్టివేయునటంచు
శూలిబల్కెను మున్ను సురలతోడ

గీ. సటులగాకనున్న సమలమాత్రెక్కుడు
యూకుపసరుతోను సతులజెప్ప

వారితోడ నొసగవచ్చునటంచవి
పరమహంసలనిరి భాసురముగ.

శుక్లకృచ్ఛమునకు

గీ. కొండపిండిసమూలము పిండిగాను
రుబ్బి కలిబోసి నిలకొట్టి గూఢమైన
రసముదీసియు బెల్లము పసపుగలపి
గొనిన శుక్లజకృచ్ఛలు కుదురుటరుదె.

కుండలికృచ్ఛచికిత్స.

క. తిల యవ కదళి పలాశం
బుల లవణము లుత్తరేణిబూడిదసారం
బిల పాత్రిబినీళ్ళనొసగిన
అల కుండలికృచ్ఛ మానుననిరి యతీంద్రుల్

త్రిదోషకృచ్ఛమునకు

గీ. యెష్టిమధుకము చందన మెలమి ద్రాక్ష
పండ్లు ముత్తువపులగము బాగుగాను
క్వాథమొనరించి వైక్రాంతభస్మగలిపి
గొన త్రిదోషకృచ్ఛలు కుదురుటరుదె.

శర్కరాకృచ్ఛమునకు

గీ. గొబ్బివా కుడుప్లేరు కొండపిండి
ముల్క పేరాముదము వీటి మూలములను
దెచ్చి క్వాథముగావించి తేనెవేసి
గ్రోల శర్కరకృచ్ఛ్రిలు గుదురుటరుదె.

రక్తకృచ్ఛమునకు.

క. పల్లేరుగాయలును కడు
తెల్లని తెగడయును వేగదెచ్చిశ్రద్ధతో

ఖల్వమునమూర్చి తేనెతో
చల్లగగొన రక్తకుష్ఠ వైద్యము లణఁగున్.

వస్తికుష్ఠమునకు.

ఆ. అల మయూరశిఖిని కలితోడ తెగఁబట్టి
పసరుదీసి యందు పంచదార
వేసి వైద్యమణులు వేసారకొసగిన
వసుధ వస్తికుష్ఠ వదలుటరుదె.

సమాహాచికిత్సలు.

గీ. విష్ణుక్రాంత సమూలము విరుగదంచి
పలిగడుగుచిల్క చెక్కని పసరుదీసి
జీలకర్రను చూరగాజేసి గల్పి
గొనిన కుష్ఠలుమానును కువలయమున.

క. అల కొండపిండివేళ్లను
సలలితముగ నేలకులును సత్రిఫలతో
వెలయు శిలాజితు సరిగా
కలితో డను గ్రోల మానుగదా కుష్ఠల్

క. ఇష్టియల తుంగముస్తలు
శ్రేష్ఠంబగు దేవదారుచెక్క చాగయున్
పుష్టిగల కరకకాయలు
శిష్టులు చూర్ణించి సురతో సేవించదగున్.

సీ. వట్టేరువేళ్లను బాగైన కురువేరు
గుమ్మడుగడ్డలు నమ్మగడ్డ
లలశతావరిగడ్డ లలఘు సుగంధపు
పాలవేళ్లనుదెచ్చి పరగగొట్టి
మంచినీళ్లందున యుంచి సన్నపుసెగ
నష్టభాగము దిగునటులగాచి

గిద్దెడుక్వాథంబు శ్రద్ధతో విడదీసి
తులమెత్తుశర్కర గలపి వైదు

గీ. ప్రూటలీకీతిగొసినను పుడమి సకల
కుష్ఠరోగులను మానునని కడునిశ్చయముగ
అంధకాసురసూదను డనియెగాన
వైద్యసింహము లీరీతి వాడవలయు.

శుద్ధక్రియలు.

సీ. నింబఫలరసంబు సెరి సురాకారంబు
ప్రియముతో మూనాళ్లు గ్రోల్చుటొకటి
పరగ వేనీళ్ళతో పంచదారను గల్పి
తప్పక మూనాళ్ళు త్రావుటొకటి
గుమ్ముడాకుననీళ్ళు గూర్చితీసిన సార
మును పంచదారయు గొనుటయొకటి
మరి యవక్షారంబు సరిపంచదారయు
తిరముగా మూనాళ్లు దినుటయొకటి
గుడసంయుతంబుగా గోక్షురఫలసార
పానంబుగావించి ప్రబలుటొకటి
గుమ్మడుతీగెల గురుతైనసారంబు
కలకండతోనిచ్చి చెలగుటొకటి
తిప్పసత్తొక్కటి తివిరి శర్కర రెండు
నుష్ణధారలతోడ నొసగుటొకటి
కొత్తిమెర్లుబెల్లము గొప్పబెంకాయల
నీళ్లనుగలపి సేవించుటొకటి

గీ. మర్త్యమున కుష్ఠులకు నివి మందులనుచు
సిద్ధులనిరిటుగావున శ్రద్ధబూని
వైద్యదేవేంద్రులీరీతి వాడిరేని
యలఘుసత్కీర్తి తోడుత మెలగగలరు.

పట్టు.

క. త్రిఫలకుక మింగువ వసయును
యుకలుప సైంధవము కలియు నావగింజలున్
నికరంపు ముల్లగివిత్తులు
ప్రకటముగా పట్టు బొజ్జపై వేయవలెన్.

క. పల్లేరు కాయలును కడు
నెల్లిడిగాది నెడి దోసవిత్తులు మెలుకల్
పెల్లుగ బెట్టినవంటలు
చల్లనికలి వస్తిపట్టు చమికిన గుణావా.

పథ్యములు.

సీ. పొన్నగంటాకును పొట్లకాయలు మంచి
దోసకాయలు తియ్యదొండకాయ
కొయ్యగూరయు మంచి గుమ్మడికాయలు
బెల్లము పచ్చని పెసరపప్పు
పనసకాయలు తెల్ల పంచదారయును ప
ప్పులు కలుబందయు పొసగ నావు
నెయ్యుసిరికకాయ నిజమైనపల్లేరు
కూరయు కుఛ్ఛల వారికిలను

గీ. పథ్యములటంచు మానులు సత్యముగను
బల్కియుండిరి గావున ప్రబలులైన
వైద్యవరులు ప్రకృత మీవరుసగాను
పథ్యములుసేయ నిష్కర్షపరచవలయు.

అపథ్యములు.

సీ. ఆవాలు నువ్వులు నాతపంబును కంద
పిండివంటలు పులుసు బృహతిహ్యాఘ్రీ
మత్స్యము లింగువ స్వచ్ఛమానల్లము
తైలంబు లవణము తగుసదాప

కూరయు బచ్చలికూర గర్జైరును
బలువిదాహపు వస్తువులును మరియు
తాంబూల ముష్ణపుద్రవ్యంబులును భూమి
కుచ్ఛలవారికి కూడవనుచు
గీ. అంబికేయుండు మును దెల్పె నశ్వినులకు
గాన ప్రాక్కృతు లతిశ్రద్ధబూని దీని
వరుసగా చెప్పబడియున్న వాటినెల్ల
వదలుడనుచును శాసింప వలయుమిగుల.

---

ఇరువదెన్మిదవపద్ధతి.

(అతిసారరోగప్రకరణము.)

సీ. కడుపు మానముగాన కను భుజించిన యుప్ప
ననము పెక్కుగా దినిన యుష్ణ
వస్తుజాలములను వరుస భక్షించిన
భయదుఃఖములు మదిబట్టియున్న
దుర్గంధవితతికి దోలగిపోవకనున్న
ధర నజీర్ణము నరతతికి బాడము
అష్టవిధంబులో నతిసారములు దాన
గలిగిమానవులను కష్టబెట్టు
ఆ. జ్వరము పైత్యమేహజాలంబులన్ మాను
తామరక్తదోష నామధేయ
ములు వహించువాటి ముఖ్యగుణంబులు
మేటి యౌషధములు తేటపరతు.

వాతాతిసారము,

క. మలమును బంకయు నురుగును
బలువెచ్చనయగుచు ధ్వనితో బయలువెడలినన్

దిలకింప శూలగలిగిన
మలినపు వాతాతిసార మనిరి యతీంద్రుల్.

పైత్త్యాతిసారము.

ఆ. పసలము మెరుపు కలుపు మరి పచ్చనైయున్న
శూల దాహ మూర్ఛ శోషలుండ
కంపుమలమునందు గలుగ పైత్త్యపు నతి
సారమగును యది యసాధ్యమగును.

శ్లేష్మాతిసారము.

క. దగ్గను యున్న ద్వేషము
నగ్గలమగు శూలతెరుచు యామముదుడుటన్
తగ్గనియుష్ణముకలిగిన
నగణజు తెన్నిదిది శ్లేష్మ సబంధముగన్.

రక్తాతిసారము.

గీ. ఆసనంబున శ్లేష్మమల్పాల్పముగను
స్రావయుచును శూలమద్గంధ మూత్రతృష్ణ
దాహమూర్ఛాభ్రమి కరదేహతాపములను
దారుణము సేయు రక్తాతి సారమహహ.

జ్వరాతిసారము.

క. తాపజ్వరమును శూలయు
దీపన హీనమును తనువు వెలియనిక్రియ చే
నాపక నామము రక్తము
తోపడును జ్వరాతిసార దుర్గుణమునకున్

ఆమాతిసారము.

గీ. అనిలసంభవమగుచు మందాగ్నిశూల
శూకరస్నేహసదృశమై శుభ్రమైన

ఆమ మెడవిూక పడినచో నదియె కష్ట
సాధ్యమందురు ఆమాతిసారమవని.

త్రిదోషాతిసారము.

గీ. వాయువునబుట్టి కడుప్రవాహంబుగతిని
పారుచుండియు మిక్కిలి బరగు శ్వాస
శోష మూర్ఛలుగలిగి బ్రస్తుతముజంపి
యాను దోషాతిసారంబు బూనెనేని.

ప్రవాహికిక.

క. వడివడిని బద్ధమగుచును
విడిచిన సెలయేరుగతిని వెళ్లుచు గవ మె
ప్పుడుగుదమునందుగలిగిన
కడుచంపునిది ప్రవాహికా నామముచేఁ

అతిసారసాధ్యగుణము.

చ. కలువలబోలుకన్నులు నఖంబులు మాంసయుతంబు రక్తముల్
గళమున పూర్ణనిస్వనము కాళ్ళను చేతుల నుష్ణముస్ మహో
జ్వలతరమైన మోము పెలుచన్ నలుపైనను రక్తమైన పెం
పలరిన పీతమైన తరుచాముము బడ్డ సు సాధ్యమెప్పుడున్.

అసాధ్యగుణములు.

చ. ఫలములరీతి యామువదము భాతినియామము వెళ్ళెనేని యీ
గలుముసరంగ చూడ కొరగానివిరుద్ధమలంబు కంపు గో
రులకడ మాంసహీనశితరోసులుమిశ్రము రక్తవర్ణముస్
నలుపగుచున్ విరేచనమునన్ గలదేనియసాధ్యమిమ్మలన్

మలపరీక్ష.

ఆ. మలము తేనెవలెను మరి యామువదముభాతి
మాంసశకలములను మానుగాను

కడుఁగుసీళ్ళవలెను గానుపించిన రోగి
మనవు నిముసమైన మర్త్యమందు.

ఆ. బొచ్చెలోనసీళ్లు బోసి యాపై మలము
వేయ మునిగెనేని విడచి మందు
స్మరణసేయవలెను శంకరభూతేశ
కనకశైల కార్ముకాయటంచు.

నల్లిమందు.

మ. అతిసారాహ్వయ వ్యాధిపీడితులకున్ యాభీనుయేనల్లిమై
యతికారుణ్యముతోడ బ్రోచునని మీరత్యంతమౌ శ్రద్ధతోన్
జతగావానినిగూర్చి మందులిడినన్ సత్కీర్తిసంపాదమౌ
మతిలోనుంచుడు వైద్యసింహములు యీమర్మంబునే జెప్పితిన్.

అతిసారముల వమనము.

చ. ధర నతిసారరోగులకు దార్ఢ్యముగన్గొని లంఘనంబు సు
స్థిరముగనుంచి యావెనుక శ్రమమె వాకరకిచ్చి పిమ్మటన్
కరమరుదైన సొంఠి నిడికాచినచల్లయొసంగ మంచిదం
చిరువుగ నిత్యనాథమునుడేర్పడ బల్కెను చిత్తశుద్ధిగన్

వాతాతిసారమునకు త్రిలోకనాథరసము.

సీ. పారదభస్మంబు పాలునాలుగుపాళ్లు
పరిశుద్ధమైయొప్పు బలిసిగూర్చి
మంచినీళ్ళను రెండుయామము మర్దనగావించి
పచ్చగవ్వలజొప్పవైనికొంత
వెలిగారమునుబూసి సలలితంబుగ గాలి
పాఁనపిమ్మట నోటుకొంచ
మైనమంతను బూసి ఘూనికగాచీల
మన్నుతిన్నగమెత్తి మహితమైన

గీ. పుటము వేసిదీసి దిటముగానూరి త్రి
లోకనాథరసము ప్రాకటముగ

పాల్గు గుంజలైనం నరులకొసంగిన
వాతజాతిసారం హరించునదిగదా.

క. అతివసముత్తలు శోంఠియు
నతులితమైయొప్పు వస యమరదారుపర్ణ
జతజేసిన క్వాథముతో
సతుంతెనిడ వచ్చునని చరకాదులోగిన్.

మహాదేవరసము.

సీ. హారవీర్యభస్మంబు మరితీక్ష్ణలోహంబు
మరిచము లీమూడు సరిగగూర్చి
కేసరక్వాథము భాసురమాజెప్పు
బాలందుపోసి బళి భద్రముగను
ఘనామమర్దనజేసి వేమారు భూధర
పుటపాచనమొనర్చి పుడమినిడిరెవు
మహాదేవరసమగు మనుజులు మాహాత్తు
గోదధితోడను గ్రోలరేని

గీ. వాతజాతిసార భీతినిదొలగించు
ననుచుమున్ను నిత్యనాథసిద్ధు
డనియెగాన వైద్యులతిశ్రద్ధతోమత
వాడిరేని మిగుల వాసిగనును.

క. ఇల సర్వాక్షిసమూలము
సలలితముగ నూరిదాని సారముతోడన్
నలమహాదేవరసంబును
చెలువుగ నిడవచ్చుననుచు జెప్పిరివిబుధుల్.

కనకసుందరరసము

చ. రసబలిటంకణంబులును రాజులుచుంజెడి వత్సనాభ మిం
పెసగెడు దూర్తబీజములు భేషగు వీర్యములున్ సమంబుగా

పసియగు భంగుయాకు మృదుసారముచే మథియించగాను యీ
వసుమతి హేమసుందరము వాతజమా యతిసార వైరియా.

ఆ. ఆవుపెరుగుతోను నది లభింపకయున్న
మేకపెరుగుతోనుమేలు యున్న
తేనెతోడనైన పూని శనగలవంటి
మాత్రలొనగవలయు మానుగాను.

పైత్యాతిసారమునకు లోకేశ్వరరసము.

సీ. సూతిభస్మము పాలు సురిచిరమగు హేమ
భస్మనాల్గవపాలు బలియు రెండు
వాళ్ళపై యలపాలు భాసురంబుగ చిత్రి
మూలముతో రెండు జాలునూరి
పచ్చగవ్వలలోన పదిలమ్ముగా బెట్టి
పైనవెల్గారంబు పటుతరముగ
బూసి గజపుటంబు వేసిన ధరనిది
లోకేశ్వరరసంబు ప్రాకటముగ

గీ. నాల్గు గురిజలెత్తు నరులు తేనెతోగాన
పైత్యజాతిసార బాధదొలగు
ననుచు నిత్యనాధముని రసరత్నాక
రంబునందుజెప్పె రసికులెన్న.

గీ. తేనెమారేడుపిందలు నూనె శొంఠి
గుడము పిప్పళ్ళు కడువడి గూర్చినూరి
పైనయౌషధమున కనుపానమిడుట
మంచిదని భేషజులు మదినుంచవలయు.

ప్రకారాంతము.

గీ. సర్జ రసమును శర్కర సమముగాను
తూచియిచ్చుట నొకయుక్తి తోరమగు త్రి

లోహసంధాఖ్య రసమును ప్రాకటముగ
తేనెతో చిన్నమెత్తివ్వ బూనుటొకటి.

శ్లేష్మాతిసారమునకు ఆనందజాజి.

గీ. జాజికాయలు వస నాభి చారుసైంధ
వంబు నుమ్మెత్త విత్తులు వరుస శొంఠి
గవ్యభస్మము నింగిలీకమును కణము
నూర నానందజాజియా నేర్పుమహిని.

ఆ. పంచదారను యనుపానంబుగావించి
నాల్గుగురిజలెత్తు సరులకిడిన
శ్లేష్మజాతిసార చేష్టలదొలగించు
ననియె నిత్యనాథ మునివరుండు.

ప్రకారాంతరము.

గీ. తేనె పిప్పళ్ళు కర మనుపాన మొసగి
ప్రాకటంబుగ వెలయు త్రిలోకనాథ
రసము పగలును తుమ్మాకురసము జీర
యుగము రాతిరొసంగుట యుత్తమంబు.

ప్రవాహికాతిసారమునకు బాలబిల్వాదిలేహ్యము.

సీ. మారేడుపిందెలు నూరుమంచివిదెచ్చి
యడ్డెడునీళ్లలో నమరజేచ్చి
యష్టభాగములుండు నట్టుమట్టుగగాచి
దానికిసరిగాను నూనెబోసి
అర్ధశేరుగుడంబు నందులో బడవైచి
కాచియావెనుకను గట్టిశుంఠి
పిప్పళ్లు నీరెండు జెల్లమంతటిమెత్తు
చూర్ణించి వైచియు సూక్ష్మముగను

గీ. పక్వమొనరించి యొసగిన ప్రబలమగు ప్ర
వాహికము మానజేయును వసుధనిదియె

బాలబిల్వాది లేహ్యంబు నీలగళుఁడు
సిద్ధులకుజెప్పె నత్యంత శ్రద్ధబూని.

కషాయములు.

క. సురదారు చిత్రమూలము
కరమరుదుగ చిరుతబొద్ది గంటుబారఁగ నా
గరము తెలివాముమును భా
సురముగ క్వాథంబొనర్చి సుజనుఁ లిడదగున్.

క. కలితో దాచినచెక్కయు
సలలితముగ వేపబంక సైంధవలవణం
బలయుత్తి పత్తివేళ్లను
చెలగి కషాయంబుగాచి శీఘ్రము నిడదగున్.

జ్వరాతిసారచికిత్సలు.

క. ఊడుగవేగులచక్కలు
రూఢముగా చల్లతోసు రుబ్బ రసము బల్
వేడుకనుఁ దీసివేగమె
వాడిన నతిసారరుజలబాధలుమానున్.

ఆ. వెస త్రిలోకనాథ రసము పూదేనెతో
చిన్నమెత్తొసంగ చెడుఁ బ్రవాహి
కాఖ్యరుజనడంచు గడియలో ననిమున్ను
నిత్యనాథుడనియె నిశ్చయముగ.

ప్రకారాంతరమృతసంజీవనీరసము.

సీ. పిప్పళ్లు కాచాఖ్య బెంపొందులవణము
సమభాగములురెంట సమము టంక
ణంబు జంబీర ఫలంబుల రసముచే
రెండుఝాములునూరి దండిగాను
నమృతసంజీవనీ యనునామము వహించు
పూటకుచిన్నము మేటి పంచ

దారతోడను గ్రోల ఘోరమైన జ్వరాతి
సారాఖ్యగదలను పారదోలు
ఆ. ననుచుమున్ను శివుడు యమరులతోజెప్పె
గానమిగుల శ్రద్ధబూని వైద్యు
లెలమి వాడిరేని యిహపర సౌఖ్యైక
భోగములను తరచు పొందగలరు.

క. కొతిమెర్లు తుంగముస్తలు
యతులిత శ్రీఫలశలాటు లలనాగరముక్
చతురత క్వాథంబిడికొన
హతమగును జ్వరాతిసార మవనిస్థలిలోన్

గీ. కటుకరోహిణి విషబొద్ది గడ్డుశొంఠి
యతివసయు తుంగముస్తలు నడ్డసరము
వట్టివేళ్ళును యగరును వరుసక్వాథ
మొనరగావించి తేనెతో గొనుట మేలు.

క. అతివస ముస్థలు శుంఠియు
నతులితపూ నేలవేము నమృతలత స
మ్మతమైన కొడిశపాలును
చతురత క్వాథంబొనర్చి శీఘ్రముమిడదగున్.

గీ. మంచిగంధము చిరుబొద్ది మహితమైన
వట్టివేళ్లు కిరాతకి వరుస నేల
వేము పర్పాటకంబును వేడుకలర
క్వాథమిడి తేనెతోగొన బాధలణచు.

ఆమాతిసారచికిత్సలు.

సీ. వసనాగరము లతివస తుంగముస్థలు
కరకకాయలు సరిగానుగూర్చి
వలసిన నీటిలోపలవైచి సూక్ష్మాగ్ని
నష్టభాగమునుండు నటులగాచి

బాగుమీరజయంతి యోగవాహకమును
చిన్నమెత్తందున జేర్చి వైద్యు
లతిసీట మానవ వితతి కొసంగిన
నామాతిసారము లణచుమరియు

గీ. పైత్యసంబంధ వేకుల బారదోలు
శ్లేష్మసంజాతకాసల చెలగిద్రుంచు
ననుచు శ్రీపార్వతీపుత్రుడైన నిత్య
నాధసిద్ధుండుబల్కెను మోదమలర.

జయంతియోగవాహకము.

గీ. విసము విషబొద్ది పిప్పళ్లు వేపయిగురు
వసయు పెన్నేరుగడ్డ తాళిసము మరిచ
ములు సమము మేకపంచితమునను నూర
యగుజయంతిక యోగవాహకరసంబు.

గీ. పటుజటామాంసి పిప్పళ్లు పరగశొంఠి
కరకకాయలు కొతిమెర్లు గడుసువసయు
క్వాధమిడి యోగవాహంబు గలపిగ్రోల
ఘోరతరమైన ఆమాతిసారమణచు.

గీ. శొంఠి యుసిరికపప్పును సురుచిరముగ
క్వాధమిడిచిన్న మెత్తందు ఘనత్రిలోక
నాధరసమును గలిపివ్వ నరులకిలను
దాహయుతమగు నతిసారతత్వమణగు.

గీ. పంచనిష్కప్రమాణమై బరగు సైంధ
వంబు నిష్కప్రమాణమై వరలు నిమ్మ
పండ్లరసమున గలిపివ్వ ప్రబలమైన
ఆమదోషాతిసారము లణచుటరుదె.

క. ఆమాతి సారరోగికి
 ప్రేమతో లాజలును పచ్చపెసలుఁగూర్చి బ
 ల్మీమనుతో వండిపెట్టుట
 సేమంబని వైద్యమణులు జెప్పిరిపెలుచన్

దోషాతిసారచికిత్సలు.

సీ. పారదభస్మంబు పాలునాలుగుపాళ్లు
  గగనభస్మము రెండు గంధకంబు
 కవిగా నొకదినం బావనూనెతోనూరి
  గాజుకుప్పెనుచేర్చి కరమువాలు
 కాయంత్రమున ఝాము గాఢాగ్నిచేవండి
  సాంగశీతలము నెరింగిదీసి
 సర్పాక్షిరసమున సరసముగా జాము
  మర్దనగావించి శ్రద్ధమీర
 పూర్వపురీతిని పుటపాచనమొనర్చి
  త్రిక్షారములునాభి త్రికటుకంబు
 చిత్రమూలము తెలిజీరకకరణియు పంచ
  లవణముల్ వాయువిళంగములును
 పుటపాకయుతమగు పూర్వపుమందెత్తు
  సంధించి సర్పాక్షి సారమునను

గీ. బాగుగానూర కారుణ్యసాగరంబు
 మాషమాత్రంబొసంగిన మానవులకు
 దోషయుతమగు నతిసార దుర్గుణముల
 దొలగజేయు నటంచనె జలజభవుడు.

చంద్రప్రభావటి.

సీ. పారదభస్మంబు పైడిభస్మంబును
  తాళకభస్మంబు తగసమాన

ములుగూర్చి బూరుగు నలచంద్రచెక్కల
సారంబులును యడ్డసరపుయాకు
పసరున యనటిదుంపల ద్రవంబున రెండు
జాలు మర్దనజేసి చణపరిమాణ
మాత్రలుగావించి మనుజులు తెలిజీర
కద్రతో గానినను కఠినమైన

గీ. దోషజాతిసార దుర్గుణ వైరియై
ప్రబలుచుండు శక్తి ప్రభావతియన
మందుదీనికిసరి మర్త్యమందున లేదు
వైద్యసింహులెరిగి వాడవలయు.

శైలజానంద భైరవి.

క. బలిదరద త్రికటుకంబులు
వెలిగారము శుభ్రమైన విసము సమాంశం
బులునారె చక్కరసమున
సలలితముగ నూరశైల జానందమగుక్.

ఆ. సెనగగింజసాటి చెలగిమాత్రలొనర్చి
తేనె కొడిశపాలతోనుగూర్చి
భక్షణంబుసేయ భస్మమౌ దోషాతి
సారమనిరిమున్ను సూరిజనులు.

రక్తాతిసారమునకు గ్రహణిగజకేసరము.

సీ. రసగంధకంబులు వసనాభి త్రికటుక
సైంధవ లవణముల్ సరసమైన
వైక్రాంతభస్మము వామము నుమ్మెత్త
విత్తులు దరదము విమలమైన

జాతీఫలంబులు ఖ్యాతిగల్గిన చిత్ర
మూలంబును కొడిశపాలమరియు
టంకణంబును నిరాతంకముగా సమ
భాగంబులోనగూర్చి భాసురముగ
గీ. కనక శ్వేతార్క మూలజక్వాథములను
నాల్గుయామములు మర్దించి నరులుమాష
మాన గుళికలు తేనెతోనైన శొంఠి
రసమునైనను శ్రీద్ధతో నొసగిరేని.

గీ. ఘోరతరమైన రక్తాతి సారమణచు
కడకుద్రోయును గ్రహణుల గడియలోన
గ్రహణి గజకేసరి సమాఖ్య గలుగుదీని
నిత్యనాథాగ్రణికి దెల్పె నీలగళుడు.

గ్రహణమదద్విరదము.

సీ. గంధక మతివస గగనభస్మము నాభి
హారవీర్యటంకణ దరదములును
ఉక్కుభస్మము నల్లయుమ్మెత్తవిత్తులు
కరక చెక్కల మసి గచ్చపప్పు
మారేడు బూరుగ మానులబంకలు
జాతీఫలంబులు ఖ్యాతిగల్గు
చిత్రిమూలంబును కొత్తవామవుపొట్టు
కొడిశపాల్ పిప్పళ్లు గడుసుశొంఠి
వెల్లచూకులబంక విలసిల్లు మారేడు
పిందెలు మరిచముల్ బంధురముగ
సమభాగములుగాను సంధించియానీటి
సరినల్లమందిడి శ్రీద్దదోడ

మేలైన దుత్తూర మూలజద్రవమున
యాఘువసరున నూరలోకమునను
గ్రహణి మదద్విర్ద కంఠీరవంబగు
నార్ద్రకద్రవయుత మైనపువ్వు

గీ. తేనెతోడనుమాషోప మానగుళిక
నొసగ రక్తాతిసారపు పసనణంచు
ననుచు శ్రీపార్వతీపుత్రుతెనినిత్య
నాధసిద్ధుడుబల్కెను మోదమలర.

కషాయములు.

గీ. మణుగుదామర యతివస ముఖ్యమైన
చిరుతబొద్దియు మారేడుచెక్కకణము
కొడిశపాలయు వామంబు గడుసుకొంతి
క్వాథమున మాను నతిసారబాధలవని.

సీ. గసగసాలును తుంగగడ్డలు మారేడు
చెక్క దాచినచెక్క శ్రేష్ఠమైన
ఖర్జూరఫలములు కమనీయమగు వట్టి
వేళ్లుసమాంశలు వేడ్కమీర
కుంచెడునీళ్లయందుంచి సూక్ష్మాగ్నిచే
నష్టభాగంబుండునట్లుగాచి
నేరుపుతో కొత్తచీరెను వడబోసి
చల్లారనిచ్చి నిశ్చలపుమతిని

గీ. అచలజాధీశ విశ్వేశ యఘువినాశ
యనుచుబల్కరు నభవుని వినుతిజేసి
పూటకొక యుగ్గుగిన్నెడు బుచ్చుకొనిన
ఘోరతరమైన రక్తాతి సారమణచు.

అతిసారసమూహచికిత్సలు

క. మారేడుపండ్లగుజ్జును
తోరంబగు... గుడిగదూచినూరి వే
మూరు తులమెత్తొసంగిన
ధారుణి రక్తాతిసార దర్పమణంచున్.

గీ. పిల్లిపీసరగడ్డలు పెచ్చుదీసి
త్రొక్కితీసిన రసమును తోరమైన
ఆవుపాల్ పోసి కడువడి గ్రోలిరేని
ఘోరతరమైన రక్తాతిసారమణచు.

దాడిమాష్టకము.

సీ. దానిమ్మకాయలపైనుండెడుచెక్క
లష్టఫలములగూర్చి స్పష్టముగను
శొంఠియు పిప్పళ్లు శుభ్రమైన సుగంధ
పాలవేళ్లును మిరియాలు మోడి
ప్రతేక్యఫలములు భాసురంబగు జీల
కర్రమిర్యాలును గలపి పలము
వెదురుప్పు కురువేరు వేర్వేరకర్షముల్
గూరిచిచూర్ణించి తోరమైన

గీ. పంచదారొక్క శేరందు బాగుగాను
గల్పిగ్రోలిన యతిసార గదలనణచు
దాడిమాష్టకమను పేరు దనరుదీని
సిద్ధులకు శంకరుడుజెప్పె శ్రద్ధబూని.

నాగరాదిచూర్ణము.

గీ. ధాతకీకుసుమంబు తగు కటురోహిణి
శొంఠి విషపుబొద్ది శుభ్రమైన

బిల్వమూలత్వక్కు భేషరసాంజన
మతులమగుచునొప్పు నతివసయును.

సమభాగంబులుగూర్చి భేషజవరుల్ సత్ప్రేమ చూర్ణించి వే
కమనీయంబుగ వస్త్రగాలితముగా గావింప శుంకీ రజం
బమలక్షౌద్రముతో నొసంగిన గడున్ నామాతి సామలన్
విమలంబొప్పగ జేయునంచు గనుడీ వేమారుసంరంభులై.

గంగాధరగుళికలు.

సీ. లొద్దుగుచెక్కలు పెద్దమానులచెక్క
లతివస విషబొద్ది యలరుశుంఠి
మారేడుచెక్కలు తోరమౌ బూరుగు
బంకబల్ యభ్రక భస్మమతుల
చింతవిత్తులపొట్టు శ్రేష్ఠమైన కొడిశ
పాలుధాతకియును పాల్లువరిగ
నొనగూర్చి చూర్ణించి యనువుగా తేనెతో
గుళికలుగావించి కొనిన సకల

గీ. గ్రహణు లతిసార గుణములు కడకుదొలగు
నవనిలోపల గంగాధరాఖ్యగుళిక
లగును ఘనతండు లోదకమందుగలపి
సేవజేసిన మిక్కిలి క్షేమమబ్బు.

చిత్రకాదిచూర్ణము.

గీ. చిత్రమూలంబు యింగువ చిరుతబొద్ది
శొంఠియు లవంగముస్థలు సొబగు కొడిశ
పాలుచూర్ణించి వేగమె నీళ్లగ్రోల
గ్రహణు లతిసారములు మాను గడియలోన

## గ్రహణికవాటము.

సీ. కరకచెక్కలు శుంఠి గంజాయివిత్తులు
బూరుగబంకయు జీరయుగము
దానిమ్మకాయల పైనుండు చెక్కలు
కరివేపయాకు బల్ గచ్చపప్పు
మారేడుచెక్కయుఁ తోరమైన కొడిశ
పాలు పిప్పళ్లు మిర్యాలుపెద్ద
మానుచక్కలు నల్లమందువామము యతి
వస సమభాగము ల్వరుసగూర్చి

గీ. భంగియాకురసంబుతో భద్రముగను
నూర గ్రహణి కవాటమన్నే రుగల్గి
ఘోరతరమైన యతిసార గుణమణంచు
పూటపూటకు మాడెత్తు బుచ్చుకొనిన.

## నల్లమందౌషధములు,

సీ. వేమరువామంబు వేయించి తెగనూరి
ద్రవము పుట్టినవెన్క దానిలోన
మానితంబగు నల్లమందు పదహారవ
భాగంబుసంధించి బాగుగాను
కలియగామర్దించి కరమొప్ప శనగల
బోలినమాత్రలు బుచ్చుకొనుట
జాజికాయలపాలు రాజితంబగు నల్ల
మందునాల్గవపాలు మానుగాను

గీ. నూరిపుటమిడి యోపిక నారనిచ్చి
తేనెతోడుతమర్దన పూనిజేసి
పూటకొక చిన్నమెత్తుగా బుచ్చుకొనుట
మందు లతిసారమున కనె నిందుధరుడు.

సీ. కరకచెక్కలు మంచి గంజాయిరెక్కలు
నేతను వేయించి నేర్పుమీర
అష్టభాగము మంచి యాభిని వైచుచు
మర్దించి మిక్కిల శ్రద్ధబూని
పూటకుపావెత్తు బుచ్చుకొనుటొక్కటి
దానిమ్మకాయల పైననుండు
చెక్కలు నొకపాలు చెలగి యాభీనిని
నాల్గవపాలును నలుగదంచి
గీ. పుటమ్ము వేసితీసి దిటముగా తెగనూరి
చిన్న మెత్తుగుళిక శీఘ్రముగను
బుచ్చుకొనుటయొకటి హెచ్చైన నతిసార
ములకు మందులగును ముఖ్యమగుచు.

శాకౌషధములు.

గీ. రేగు బూరుగవెల్గ నక్కెరుభంగి
జమ్మిబావంచనెల్లి దానిమ్మయానెకి
చెట్లయిగురులు గొని తెచ్చి చెలగితియ్య
కూరలుగ వండిపెట్టుట గొప్పయుక్తి.

పథ్యములు.

సీ. కొడిశమొక్కము మేడి గుమ్మడియులపొట్ల
దొండ వెల్గరటులు దొడ్డయిప్పె
చెట్లకాయలు పులిచింత దూసర చక్ర
వర్తి కర్వేపయు వరుస దేవ
దారుకూరల నూనె తోరమౌ పూవుల
పెరుగు మజ్జిగ నెయ్యి సరసమైన
శాల్యోదనంబును తుల్యమైయొప్పెడి
జీరయుగం బతి సారగదల

గీ. వారలకు పథ్యమని మున్ను వైద్యశాస్త్ర
కారులెన్నిరి గావున గణుతికెక్క
భేషజేంద్రులు యత్యంత ప్రీతితోడ
చెప్పవలె పథ్యములుదీని దప్పకుండ.

అపథ్యములు.

సీ. మినుములు నువ్వులు ఘనమైన గుమ్మడి
కాయలు బూరెలు కంద దోస
కాయలు బెల్లము కరమొప్పబచ్చలి
కూర చాపలు పుల్సు తోరమైన
పొరకాయ నంజుడు సురగురుద్రవ్యముల్
స్నానంబు విడెము స్త్రీసంగమంబు
అతిశారరోగము లంటినవారికి
మేదినిలోన నిషేధమనుచు

గీ. నిత్యనాథాదిసిద్ధులు నిర్ణయించి
వైద్యశాస్త్రములందున వరుసగాను
వ్రాసియుండిరిగావున వైద్యులతుల
శ్రద్ధతోడుత నీరీతి జరుపవలయు.

# సరస్వతీగ్రంథమాల, బెజవాడ

(భవానీముద్రాక్షరశాల వద్ద)

సంపాదకులు:- మహారాజరాజశ్రీ శ్రీరాజా వాసిరెడ్డి శ్రీదుర్గాసదాశివేశ్వర ప్రసాద్ బహద్దరు మన్నెసుల్తానుగారు, జమీందార్ ఆఫ్ జయంతిపురం.

ఒక దేశముయొక్కగాని, జాతియొక్కగాని నాగరికత దెలుపుటకు వారి వాఙ్మయమే మొదటిసాక్షి. మనపూర్వులు వారికాలమునకు తగినట్లుగా యీసాధనమును చక్కగా నుపయోగించుకొనియున్నారు. ఆధ్యాత్మిక ప్రధానములైన వారి వివిధాభిప్రాయములు దీనిసహాయముతో వ్యాప్తికిదెచ్చి లోకకళ్యాణమునకు ప్రయత్నించి ధన్యులైనారు. ఆనాటి దేశకాల పరిస్థితులు వేరు. నేటిపరిస్థితులు వేరు. నేడుదేశమున వివిధములైన సమస్యలుద్భవించుచున్నవి. విజ్ఞాన మనంతముఖములఁ విజృంభించుచున్నది. సాంఘికజీవిత మనేక పరిణామముల బొందుచున్నది. రాజకీయములలో క్రొత్తక్రొత్త సిద్ధాంతములు తలచూపుచున్నవి. కళలు, లలితకళలు వికసించుచున్నవి. ఉడుతభక్తిని మేముకూడ విజ్ఞానసేవ చేయదలచి సరస్వతి గ్రంథమాలను స్థాపించినారము. పండితులకేగాక, జనసామాన్యమునను, స్త్రీలయందును బాలురయందును, గూడవిజ్ఞానము వ్యాపింపజేయవలెనని మాముఖ్యాశయము.

దీనికి సహాయముగా ముద్రణాలయము ఔదార్యముతో శ్రీముక్త్యాల సంస్థానాధీశు లొసంగినారు. కనుక దేశాభిమానులు భాషాభిమానులు యీయుద్యమమునకు యథాశక్తిని తోడ్పడగోరుచున్నాము. మాప్రథమకుసుమము

## ధమ్మపదము

అనువాదకులు:- శ్రీరాజా వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద్ బహద్దరు
జయంతిపురం జమీందారుగారు

అవతారపురుషుఁడగు బుద్ధదేవుని దివ్యోపదేశము లిందుగలవు. పాళీభాషలో ౨౬ వర్గములలోనున్న ౪౨౩ గాథశ్లోకములకు సరియయిన, చక్కని తెలుగు వచనరచనము. మూలగ్రంథము గూడ సమగ్రముగా నిందుగలదు. హిందీ ఇంగ్లీషు, కర్ణాట, ప్రాకృతభాషలలోగల పరివర్తనములను, వ్యాఖ్యలను బరిశీలించి అతిజాగ్రత్తతో నిది యనువదింపబడినది. జైన బౌద్ధమతములను గురించి విపుల పరిశోధనముగల పీఠిక గొప్పదిగలదు. బౌద్ధమత సంప్రదాయవిషయములకు ముఖ్యమయిన టిప్పణికలదు.

బుద్ధదేవుని దివ్యోపదేశము లెట్టివో, బౌద్ధమత మెట్టిదో యీగ్రంథముఁ జదివినఁ దెలియగలదు. సుందరమైన బుద్ధుని చిత్రమిందుగలదు. మేలుకాగితము అందమైన నిండుక్యాలికో బైండు. వెల 1—4—0

పోస్టుఖర్చులు ప్రత్యేకము ——— చందాదారులకు 1—0—0

రెండవ కుసుమము

# ఉద్భటారాధ్య చరిత్రము.

అపూర్వసత్ప్రబంధములలో నొక్కటియగు తెనాలిరామలింగ మహాకవికృతము. ఈచరిత్ర నైజాముమండలములో సంపాదించిన తాళపత్రిగ్రంథమునుండి గ్రహింపఁబడినది. తెనాలి రామలింగకవి పేరువినని యాంధ్రుఁడుండఁడు. రామలింగమహాకవిని గౌరవించు ప్రతియాంధ్రుఁడును అతని సహజసాహిత్య మాధుర్యము ఁఉట్టిపడు చున్న యీగ్రంథమును తప్పకచదువుట యవసరము. రామలింగఁడే రామకృష్ణుఁడని తెలుపు విపులపీఠిక గూడ గలదు.

వెల రు 0-12-0 చందాదారులకు 0-8-0

---

ఇతరగ్రంథములు.

---

# శ్రీకృష్ణ భారతము

సంస్కృత భారతానుసారము బ్రిహ్మశ్రీ కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచియింపఁబడిన పద్యకావ్యము. ప్రస్తుతము ప్రచారములోనున్న నన్నయ భారతమునకన్న విశేషములు సంస్కృతభారతము లోనివి- స్తవములు, నాగరికతా విశేషములు, కథాభాగములు- యిందెన్నియో గలవు. రాయల్ ఆక్టోవో సైజు.

| | | | |
|---|---|---|---|
| 1 | ఆది, సభాపర్వములు, | 464 పుటలు | రు 1-8-0 |
| 2 | అరణ్యపర్వము, | 552 పుటలు | 1-8-0 |
| 3 | విరాట, ఉద్యోగపర్వములు, | 443 పుటలు | 1-8-0 |

---

# రాజ్యలక్ష్మీ పరిణయము.

కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి పుత్రిక శ్రీమతి కల్లూరి విశాలక్షమ్మ గారిచే రచియింపఁబడిన 5 ఆశ్వాసముల పద్యకావ్యము.

వెల 0-4-0

# హాలాస్య మాహాత్మ్యము

మల్లంపల్లి బుచ్చికవి ప్రణీతమైన 6 ఆశ్వాసముల పద్య కావ్యము. 294 రాయల్ పుటలు ఇది స్కాంద పురాణాంతర్గత శంకరసంహితయందలికథ. ధార అనర్గళము. హాలాస్య క్షేత్రమగు మధురాపురిలోని శ్రీసుందరేశ్వర స్వామివారి మాహాత్మ్యము 64 లీలలుగా వర్ణింపఁబడినవి. ఇందు వైద్యము, రసాదులశుద్ధి, సంగీతము, జ్యోతిషము, సాముద్రికము. అశ్వశాస్త్రము, రత్నమౌక్తిక పరీక్ష, మంత్రశాస్త్రము, మొదలగు పెక్కువిషయములు విపుల ముగాఁ జర్చింపఁబడినవి. వెల రు 1-8-0

---

## లలితాంబోపాఖ్యానము.

ఆతుకూరి పాపయామాత్య ప్రణీతము. 8 ఆశ్వాసములపద్య కావ్యము బ్రహ్మాండపురాణములోనిది. భండాసురుని మడియించుటకై శివుడుయాగముచేయ, శ్రీలలితామహాదేవి యావిర్భవించి భండాసురుని బరిమార్చుట, కుమారస్వామిజననము, మొదలగు విషయములు వర్ణింపబడినవి. శైలిప్రౌఢము వెల 1-4-0

---

## ద్రౌపదీ పరిణయము,

అమరవాది రామయకవి ప్రణీతమైన 8 ఆశ్వాసముల పద్య కావ్యము. చక్కని శైలి. గ్లేజు కాగితములపై అందమైన అచ్చుతోనున్నది. 430 రాయల్ పుటలు. 1-8-0

---

## కాలనిర్ణయ చంద్రిక.

మిట్టపల్లి సీతారామశాస్త్రి విరచితమైన గొప్పధర్మశాస్త్రగ్రంథము. పంచాంగకర్తలకును, ధర్మనిర్ణయకులకును అమూల్యము. రెండు సంపుటములు. మొత్తం 700 పుటలు. సంపుటము1కి 1-8. 0

విలాసము:— **భవానీ ప్రెస్,**

గవర్నరుపేట, బెజవాడ.

# ఆర్య రసాయనశాల, ముక్త్యాల.

## ( కృష్ణా జిల్లా. )

### వారి సుప్రసిద్ధాయుర్వేద ఔషధములు.

---

### అభ్రక భస్మము.

అభ్రకభస్మము, ఇంతకంటెమంచిది ఇంత చవుకధరగలది
యింకెక్కడను దొరకదు. శాస్త్రప్రకారము సక్రమముగా తయారు
చేయబడినది. వాస్తవము. ఇతరులు తక్కువపుటములుబెట్టినను
శతపుటాభ్రకమనియు, సహస్ర పుటాభ్రకమనియు పేర్లుపెట్టి యెక్కువ
ధరలకు అమ్ముచుందురు. ఎక్కువధరలు బెట్టినచో మందు నమ్మక
మయినదని కొందరు భ్రమపడెదరు. ఎంతనమ్మకముగా తయారు
చేసినను ఇంతకంటె ధర పెట్టుట అనవసరము. అనేకులు మా అభ్రక
భస్మమును వాడి మెచ్చియున్నారు. 'డయబిటిస్' అనబడు బహు
మూత్ర వ్యాధిని నిర్మూలింప జేసి మూత్రమునందుండు చక్కెర
పదార్థమును దీసివేయును. వేడిని, దగ్గును, క్షయను, ప్రదరమును
బోగొట్టును. అనుపాన విశేషములచే సర్వ వ్యాధులను గుదుర్చును.
ఔషధయోగము లందుగూడ కలుపుకొనవచ్చును. అభ్రకము
యొక్క గుణము లిట్లు చెప్పబడియున్నవి.

"గౌరీతేజః పరమ మమృతం వాత పిత్తక్షయఘ్నం
ప్రజ్ఞాబోధి ప్రశమితరుజం వృష్యమాయుష్య మగ్ర్యం
బల్యం స్నిగ్ధంరుచిదమ కఫం దీపనం శీతవీర్యం
తత్తద్యోగై సకలగదహృత్ వ్యోమసూతేంద్ర బంధి,,

అభ్రకము అమృతమువంటిది. వాత, పిత్త క్షయలను హరించును.
బుద్ధిబలమునిచ్చును. రోగములను బోగొట్టును వీర్యవృద్ధిని
ఆయుష్యమును యిచ్చును. బలకరము. స్నిగ్ధగుణవిశిష్టము. రుచిని
గలిగించి కఫమును లేకుండ జేయును. అగ్నిదీప్తిని గలుగజేయును.

శీతవీర్యము. అనుపానవిశేషములచే సర్వరోగహరము. రసబ్రాహ్మీఫ
మును జేయును. దీని గుణమునుగూర్చి అనేకులు వ్రాసిన "సర్టిఫి
కెట్లు" లను ఇచట ప్రచురించమానినందులకు చదువరులు క్షమించె
దరుగాక.

| 100 | పుటములు | అభ్రకభస్మము | తులం 1కి రు | 2-0-0 |
|---|---|---|---|---|
| 200 | " | " | " | 4-0-0 |
| 300 | " | " | " | 5-0-0 |
| 500 | " | " | " | 10-0-0 |

---

## మహాసిందూరభూషణము.

గర్భిణీస్త్రీలకు గలుగు సమస్తవ్యాధులకు నిర్భయముగా
నియ్యవచ్చును. నోటిపూత, నోటనీళ్లూరుట, కాళ్ళుచేతులు మం
టలు, హృదయస్పందనము. దగ్గు వీట్లను బోగొట్టును. లోకాక,
శీకాక, యనబడు జీర్ణజ్వరములను బోగొట్టుటలో నద్వితీయము.
క్షయ, ప్రమేహములు, శరీరము కృశించి నెత్తురు తక్కువగానున్న
ప్పుడు బాగాపనిచేయును. ప్రతియింటను యుండదగిన అపాయము
లేని ఔషధము. తులం 1కి రు 10-0-0.

---

## రజితలోహరసాయనము.

ఇది ఆంధ్రదేశమందు వైద్యులచే విరివిగా వాడబడు
మందులలో నొకటి. నంజుయనబడు శోఫవ్యాధులయందు అమో
ఘముగా పనిచేయును. శరీరమునందున్న నీటినంతనుపీల్చి వేయును.
గుండెలలోదడ, శ్వాస కాస, పాండువు వీటియందు గుణమును
త్వరలోకనపర్చును. దీనిసేవనవలనజీర్ణజ్వరములు కఫవ్యాధులు ఉప
శమించును. దీనినిగూర్చి సాధారణముగా వైద్యులందరకు తెలిసి
యేయుండును గాన మేము ఎక్కువగా వ్రాయ నక్కరలేదు.

తులం 1కి రు 9-0-0

---

## వసంతకుసుమాకరము.

ఇయ్యది ఆరోగ్యమునుగోరు ప్రతిమానవుడు సేవించదగిన దివ్యౌషధము. అత్యుత్తమమయిన రసాయనౌషధము. విలువగల వస్తువ్రలిందు జేరియున్నవి. జాగ్రత్తతో సక్రమముగా తయారుచేయబడినది. దీనిసేవవలన ప్రమేహవ్యాధులన్నియు మాయమగును. మూత్రము, అధికముగానగుట, అందు తీపిపదార్థముండుట, మూత్రనాళముమంట చురుకు, మొదలగునవన్నియు నివారణమగును. మరియు కాస, క్షయ, పాండువు, మొదలగు రోగములు పోవును. దీనిని గూర్చి గ్రంథములందిట్లు చెప్పబడియున్నది.

శ్లో......హంతిపాండ్వామయాన్ శూలాన్ మూత్రాఘాతాశ్మ రీంజయేత్.
యోగవాహిత్వదంసేవ్యం కాంతిశ్రీబలవర్ధనం। సుసాత్మ్యమిష్టభోజీచ రమయే త్ప్రమదాశతం। మదనంమదయేన్మ దమజ్వ్యాయాన్ ప్రమదానివహానతివిహ్వాలయాన్ । సురతైస్సుఖదైర్ఘతివిహ్వచసైర్భవసారజుషామయమేపసుహృత్.

తులం 1కి రు 30-0-0

---

## సూర్యావర్తిరసము.

ప్రతి మనుష్యుని వద్దను ఉంచుకొనతగినది. వెంటగొంపోతగినది. అందరికి అవసరమయినది తలతిరుగుట, నోటనీరూరుట, శరీరమందు దద్దుర్లు, కాళ్లుచేతులుమంటలు, గుండెలలోమంట, నోటిపూత, అరుచి, తలపోటు మొదలగు సమస్తపైత్యవికారములకు వజ్రాయుధమువంటిది. గర్భిణీస్త్రీలకు గలుగు పైత్యవికారములందు నిర్భయముగా నుపయోగింప వచ్చును. మరియు ఉన్మాదము. అపస్మారము మూర్ఛ మొదలగు వ్యాధులలోగూడ అత్యద్భుతముగా పనిచేయును, ప్రశస్తమయినయోగము. తులం 1కి రు 5-0-0

సువర్ణ సూర్యావర్తి తులం 1కి రు 10-0-0

విలాసము:

### ఆర్షరసాయనశాల

ముకాల (కృష్ణాజిల్లా)

# దాసబోధ

## వేదాంతశాస్త్రము.

మహారాష్ట్రభాషలో నీయుత్తమగ్రంథమును మహారాజ ఛత్రపతి శివాజిచక్రవర్తికి గురువగు సమర్థరామదాసు రచించెను. ఇందు వేదాంతచర్చలు, మానవధర్మములు, చారిత్రకరహస్యములు, స్వాతంత్ర్యసంపాదనవిధము, దేశోద్ధరణధర్మములువిపులముగాఁ చర్చింపఁబడెను. ఈ యుద్గ్రంథమును కవులు కవితాగ్రంథమని జాతీయవాదులు రాజనీతిగ్రంథమని తత్త్వవేత్తలు వేదాంతశాస్త్రమనిసంస్కర్తలు సాంఘికగ్రంథమని విశ్వసించుచున్నారు. సర్వకాలసర్వావస్థలలో మానవజీవితమునకీగ్రంథము సరిపడును. రాజకీయవాదులకు, గృహస్థులకు, కవులకు, పండితులకు, పామరులకు సరిగనన్వయించు గ్రంథమిదియొక్కటియే శ్రీ శివాజీచక్రవర్తినంతటి స్వార్థత్యాగిని చక్రవర్తినిజేసినదీగ్రంథమే ఇందు మహాత్ముఁడగు సమర్థునిజీవితము గ్రంథవిమర్శము గూడఁగలదు. హిందీకిసరియగు ఆంధ్రీకరణము దాదాపు 800 పుటలు క్యాలికోబైండుగల యీగ్రంథరత్నము వెల ముందుదరఖాస్తుచేయువారికి రు 4—0—0 లు. 1929 జనవరి మొదటివారములో వెలువడును. బెంగాలీ, గుజరాతీ, హిందీ, మహారాష్ట్రభాషలలో వేలకువేలుప్రతులు కర్చుపడు నీయుత్తమ గ్రంథమునకు ఆంధ్రులు త్వరపడుటయుక్తము. లోకమాన్యబాలగంగాధరతిలకు, కె. వి. లక్ష్మణరావు మున్నగుప్రముఖులీదాసబోధను సహస్రముఖములఁ గొనియాడియున్నారు. వలయువారలువ్రాయనగును. గ్రంథవివరములు తెలిసికొనగోరువారికి విపులమగుప్రచురణపత్రము బంపుదుము. లేదా కె. వి. లక్ష్మణరావుగారి శివాజీచరిత్రమునందలి గురూపదేశమను ప్రకరణమును జూచినచో గ్రంథప్రశస్తి తెలియఁగలదు.

శేషాద్రి రమణకవులు
కాకతీయగ్రంథమాల
నందిగామ, కృష్ణాజిల్లా.

---

# శృంగార శ్రీనాథము.

## శ్రీనాథచరిత్రమును, కవితావిమర్శనమును.

ఇట్టి గ్రంథమిదివఱకుఁ దెలుఁగున వెలువడలేదు. ఇందు, శ్రీనాథచరిత్రమెల్లఁ గరతలామలకముగాఁ జూపబడినది. రెడ్లు మొదలగు వారిచరిత్రములు, శాసనములు, ఇతరకవులు, ఇట్టివెన్నియో యపూర్వవిషయములుగలవు. ఆంధ్రకవిత, శ్రీనాథుని కవితా గౌరవము, కొఱఁతలు, పోలికలు, మార్పులు, మొదలగు రహస్యము లెన్నో వెల్లడింపఁబడినవి. ఆంధ్రకవితలోని మెఱుఁగులు తేర్చిచూపఁబడినవి. వెల రు 2—0—0.

---

# సప్తపదులు.

## ఆండాళ్ దేవి పాయించిన తిరుప్పావైయను అరవపాశురములకు తెలుగుపాటలు.

సరసమనోహర కవితారసప్రదర్శనమందు నెరజాణయై "రాధికాసాంత్వన" మనుశృంగార ప్రబంధమునురచించిన ముద్దుపళనియను స్త్రీరత్నము ౧౦ పాశురములును, సరసకవితారచనయం దారితేరిన బ్రహ్మశ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిగారు ౨౦ పాశురములను తెలిగించిరి.

అరవగ్రంథమును రచించిన ఆండాల్ దేవి ధనుర్మాసారంభదినము మొదలుకొని 30 రోజులవరకు ఒక్కొక్కపాశురముచేత శ్రీకృష్ణభగవానునికొనియాడి శ్రీకృష్ణపరమాత్మను భర్తగాపొందెను. గనుక దినమునకు ఒక్కొకపాశురము చదువుచు భక్తులు శ్రీకృష్ణునిప్పుడు సేవించుచున్నారు. ఆంధ్రులయుపయోగార్థమీపాటలు తెనుగున ఇపుడు సమకూర్చబడినవి.

ధనుర్మాసమునందు మనదేశమునందు కన్యకలు గొబ్బిపెట్టుయాచారము దీనికి సంబంధించినదే. పెండ్లికాని బాలికలు ఈపాటలచేత భగవంతునికొనియాడిన సద్గుణభూషితుడగు భర్తయు, సిరిసంపదలున్ను వారికి తప్పక కలుగును.

వెల 0-4-0 12 ప్రతులు 2-8-0

---